




ముఖచిత్రం : **వజీరుజాదీ నిశ్చయం**

చిత్రకారుడు : **వడ్డాది పాపయ్య**


యువ సాలుచందా రూ. 24-00

దీపావళి సంచికతో రూ. 30-00

యువ, హైదరాబాదు - 500001

# అఖిలభారత పాప్యులారిటీ పోటీ

## ఎంట్రీ ఫీజులేదు - మీరు బహుమతిని గెలుపొందగలరు.

*సహాయము కొరకు **38** మొత్తముగల నమూనా :*

| | | | |
|---|---|---|---|
| 5 | 8 | 11 | 10 |
| 12 | 9 | 6 | 7 |
| 14 | 15 | 4 | 1 |
| 3 | 2 | 13 | 16 |

మొదటి బహుమతి: ఒక వెస్పాస్కూటర్ లేదా ఆల్విన్ రిఫ్రిజిరేటర్ లేదా టెలివిజన్ సెట్. రెండవ బహుమతి : ఒక టేపు రికార్డర్ లేదా ఆటోమెటిక్ కెమెరా. మూడవ బహుమతి: (100)తోషిబా జపాన్ మోడల్ మూడు బ్యాండ్ల ఆల్‌వరల్డ్ ట్రాన్సిస్టర్లు ధర. రు. 275 మీ కుటుంబమునకు జీవితాంతం ఉండే కానుక.

| | | | |
|---|---|---|---|
| | | | |
| | | | |
| | | | |
| | | | |

### మీరు చేయవలసినది

2 నుంచి 17 వరకుగల అంకెలను పై ఖాళీగళ్ళలో నిలువుగా, అడ్డముగా, లేదా అయిమూలగా ఎటునుంచి కూడినా మొత్తం 38 వచ్చేటట్లు వేయాలి. ఒక అంకెను రెండుసార్లు ఉపయోగించరాదు.

### క్లోజింగ్ 28-4-74 * ఫలితము 30-4-74

పోటీకి నిబంధనలు : (1) ప్రమోటర్ల తీర్మానము ఖాయమైనది, చట్టబద్ధముగా న్యాయమైనది. ఈ పోటీ విషయములో ఇది ఒక ముఖ్యమైన షరతు. (2) ఎంట్రీలు మా అఫీషియల్ సీల్డు సొల్యూషన్‌తో సరిపోల్చబడతాయి. (3) నగదురూపములో ప్రైజులు ఇవ్వబడవు. (4) ఒక మొదటి బహుమతి : మావద్దనున్న అఫీషియల్ సొల్యూషన్‌తో సరిపడేదానికి మాత్రమే ఇవ్వబడుతుంది. (5) ఒక రెండవ బహుమతి పైమూడు వరసలు అడ్డగడులు సమానముగా వున్నదానికి ఇవ్వబడుతుంది. (6) 100 మూడవ బహుమతులు: మా అఫీషియల్ సొల్యూషన్‌తో ఏ క్రమంలో అంకెలువేసినా ఏ వరసతోనైనా సమానముగా వున్నవాటికి ఇవ్వబడును. (7) బహుమతులు గెలుచుకున్నవారు పోస్టేజి, ప్యాకింగ్, లైసెన్స్‌కయ్యే ఖర్చులు భరించవలయును. (8) ఫలితాలు పొందగోరువారు 45 పైసల పోస్ట్ స్టాంపులు పంపాలి. (9) మీ భవిష్యత్తు ఉపయోగంకోసం నిబంధనల కాపీ మీదగ్గర ఉంచుకోండి.

Director, Contest Department

**B. B. & C. కార్పొరేషన్ (-38)**

P. O. Box No. 1635, DELHI-6.

**Statement about ownership and other particulars about newspaper**

**YUVA TELUGU MONTHLY**

# FORM IV

(See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of publication | ... Hyderabad |
| 2. | Periodicity of its publication | .. Monthly |
| 3. | Printer's Name | ... A Sudhakara Rao for Yuva Publications |
| | (Whether citizen of India ?) | ... Indian |
| | Address | ... 5-9-88, Public Garden Road Hyderabad-500 001 |
| 4. | Publisher's Name | ... A. Sudhakara Rao for Yuva Publications |
| | (Whether citizen of India ?) | ... Indian |
| | Address | ... 5-9-88, Public Garden Road Hyderabad-500 001 |
| 5. | Editor's Name | Sri A. V Subba Rao (Alias Chakrapani) |
| | (Whether citizen of India ?) | ... Indian |
| | Address | ... 2 & 3, Arcot Road. Vadapalani Madras-26 |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital | ... Sri A V Subba Rao (Alias Chakrapani) Managing Partner 2 & 3 Arcot Road, Vadapalani Madras-26<br>A Chandra Sekhar Rao, A Raja Sekhar Rao, A C Chakrapani } Minors 2 & 3 Arcot Road, Vadapalani Madras-26<br>A Sudhakara Rao, 5-9-88, Public Garden Road, Hyderabad-500001. |

I, A Sudhakara Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief

Sd /- A SUDHAKARA RAO
*Signature of Publisher*

Dated : 1-3-1974



మార్చి నెల యువ ముఖచిత్రం. టప్, అత్యంతాకర్షణీయంగా వుంది లా శివరామ్‌గారి నవల 'భ్రమర' మునకి హైలైట్ ఒకే రకం కథలు దివి విసిగిపోయిన పాఠకులకు రిలీఫ్ భ్రమర.' భ్రమర పాత్ర చిత్రణ చాలా గుంది. ఇతివృత్తంలో ఎంతో వైవిధ్యం కల్గిన "వదిన," "డబ్బు! డబ్బు!! డబ్బు!!" "అమృతం"-మూడు కథలు మూడు ఆణిముత్యాలు. అగ్ని పరీక్ష సీరియల్ చక్కగా సాగుతుంది.

—విశ్వనాధ్, గుంటూరు-3

మార్చి నెలలో మీరు మాకందించిన యువ ముఖచిత్రం శోభాయమానంగా వుంది. "కళ్లు పోయినై" అనే వన్ ఫూల్ గారి రచన సూక్ష్మంలో మోక్షం. ఈ కథ చదివి క్షణకాలం మూగ వోయాను "భ్రమర" అనే షీలా శివరామ్ గారి నవల హృదయ రంజకంగా, మా మనస్సులను ఆహ్లాద పరిచింది. గోపీచంద్ గారి కథానిక ఈ కాలంలో డబ్బు విలువను స్పష్టపరుస్తుంది.

—యం బి. కె. ప్రమీల

# రచయితలకు మనవి

మాకు నెలనెలా వందలకొద్దీ కథలు వస్తూన్నందు వల్ల, వాటిని పరిశీలించి, రచనలు పంపిన వారిని నిరీక్షింపజేయడం అంత సబబుగా ఉండదు కాబట్టి, కొంతకాలంపాటు రచయితలను/రచయిత్రులను కథలు పంపవద్దని సవినయంగా మనవి చేస్తున్నాము

— సంపాదకులు

దేవరాజపుత్రి ముఖచిత్రంతో మార్చి
\ "యువ" నయనానందకరంగా
ంది. మధురమైన నడక సాగిస్తున్న
ూడు సీరియల్స్ మమ్ములను
ుగ్ధులుగా విస్తున్నవి. "భ్రమర"
వల చాలా బాగుంది. మీరు "యువ"
ూల్యాన్ని ఎంత పెంచినా అది మాకు
ుమూల్యమే.

—బిందు, బొబ్బిలి

షీలా శివరామ్ గారి "భ్రమర"
వల చాలా చక్కగా ఉంది. మూర్తీభ
ించిన మానవత్వానికి నిదర్శనంగా
ిజయ్ పాత్ర పదికాలాలపాటు పాఠకుల
హృదయాలలో నిలిచిపోతుందనటానికి
ఎంతమాత్రము సందేహంలేదు. విశాలాక్షి
పాత్ర కూడా ఎంతో ఉదాత్తంగా వుంది.
చాలా కాలానికి ఒక మంచి నవల చదివా
మన్న తృప్తి మాకు కలిగింది. ఇటువంటి
నవలను ప్రచురించినందుకు మీకు థేంక్స్
చెప్పకుండా వుండలేకపోతున్నాం.
కథల్లో వదిన కథ కొన్ని పరిస్థితుల
ప్రభావం వలన అంతస్థుల్లో తేడా
లేర్పడినా-మనస్సుల్లోని ఆత్మీయత, అను
రాగం, అనుబంధం మొదలైనవాటికి
తేడాలుండవన్న నిజానికి అద్దం పట్టింది.

గోపీచంద్ గారి "డబ్బు! డబ్బు!!
డబ్బు!!!" కథ చిన్నదైనా ఎంతో అర్థ
వంతంగా వుంది.

—సుస్మితారమణమూర్తి
—గౌరీపార్వతి, విశాఖపట్నం

# యువ ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | అరుణోదయం | (నవల) | కొ. కుటుంబరావు | 2-00 |
| 2. | మారుపేర్లు | ,, | ,, | 2-00 |
| 3. | కులంలేని మనిషి | ,, | ,, | 2-00 |
| 4. | గడ్డు రోజులు | ,, | ,, | 2-50 |
| 5. | నీకేం కావాలి | ,, | ,, | 2-00 |
| 6 | నిలవ నీరు | (కథలు) | ,, | 2-00 |
| 7. | కాలభైరవుడు | ,, | ,, | 2-00 |
| 8. | వరప్రసాదం | ,, | ,, | 2-00 |
| 9. | మొండివాడు | ,, | ,, | 2-00 |
| 10. | శిథిలాలయం | (నవల) | గోపీచంద్ | 2-50 |
| 11. | అర్థమున్న కథలు | (కథలు) | అవసరాల రామకృష్ణరావు | 2-50 |
| 12. | కరుణ | (నవల) | రవీంద్రనాథ్ ఠాకూర్ | 2-00 |
| 13. | వీరఛత్రసాల్ | (సంక్షిప్త నవల) | | 2-50 |
| 14 | మాధవీ కంకణం | ,, | | 2-50 |
| 15. | రాజసింహ | ,, | | 2-50 |
| 16 | కుంకుమభరిణ | ,, | | 2-50 |
| 17. | ఆనంద మఠం | ,, | | 2-50 |
| 18. | కపాల కుండల | ,, | | 2-50 |
| 19. | గోరా | ,, | | 3-00 |
| 20. | మాయావి | ,, | | 3-00 |
| 21 | మొగలు దర్బారు కుట్రలు | ,, | | 3-00 |
| 22 | సీతారామ్ | ,, | | 2-50 |

పది కాపీలకు తక్కువ కాకుండా సొమ్ము ముందుగా పంపినవారికి ఖర్చులు మేమే భరించి పుస్తకాలు పంపుతాము. యువ ఏజంట్లకు 30% కమీషన్ ఇవ్వబడుతుంది. కావలసిన కాపీలకు కమీషన్ మినహాయించుకుని డబ్బు ముందుగా పంపవలసినదిగా ఏజంట్లను కోరుతున్నాము.

**యువ పబ్లికేషన్స్,**

హైదరాబాద్ - 500 001.

# సిల్వర్ ప్రిన్స్

చేసిన వాగ్దానాలను నిలబెట్టుకొనే బ్లేడ్...
నున్నని,శుభ్రమైన క్షౌరాలను
సమకూర్చే బ్లేడ్







## సిల్వర్ ప్రిన్స్

క్షౌరం చేసుకొన్న ప్రతిసారి
ఆనందానుభూతినిచ్చేందుకు

Grant 6 TL

# ట్విన్ సిటీ గ్యాస్ కం

(కోసాన్ గ్యాస్ కంపెనీవారి ఏజంట్లు)

62-బి, సర్దార్ పటేల్ రోడ్, సికింద్రాబాదు-3 ఫోన్: 76600




* ఎస్సో గ్యాస్‌తో
  వంట త్వరగా అవుతుంది
* ప్రతి సిలెండరుకూ
  ప్రపంచ ఖ్యాతిగాంచిన
  కోసాన్ సేఫ్టీకాప్ అమర్చబడింది.

షో రూమ్:

86, సరోజిని దేవి రోడ్
తాజ్‌మహల్ హోటల్ ఎదురుగా
సికింద్రాబాదు.

బ్రాంచీలు :

4-1-881/7, తిలక్‌రోడ్ ఫోన్ 42586
15-9-311, అఫ్జల్‌గంజ్ ఫోన్ 42629
15-6-68, చాదర్‌ఘాట్ ఫోన్ 52400
ఆంధ్ర బ్యాంక్ ఎదురుగా, విద్యానగర్ ఫోన్ 62544
సత్యా టాకీస్ వద్ద, ఆల్వాల్ ఫోన్ 79009
గోల్డు స్పాట్ వద్ద, అమీర్‌పేట ఫోన్ 32901
భారత్‌హెవీ ఎలెక్ట్రికల్స్ రామచంద్రపురం

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 29 | ఏప్రెల్ - 1974 | సంచిక 4

మే నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) ...

ఏప్రెల్ నెల

# భావపరిచయ పోటీ

**బహుమతి పొందిన వ్యాఖ్యలు**




చిన్ననాడె లేవు ప్రేమానురాగాలు
పెద్దవారివలన పెండ్లియగుట;
బొమ్మ చూడనీకపోవచ్చునే కాని
నిలుపగలదె యతని వలపుతలపు

— వి. సత్యవతి, మచిలీపట్టణం.

చిత్రసీమనేలు సింగారి తారను
చూడనీక నడ్డె సుదతి మగని
వయసు మళ్ళినంత వలుపులు మళ్ళునా
ప్రేమ గుడ్డిదనరె పెద్దలెల్ల.

— కె. కె. శాస్త్రి, మానేపల్లి.

మీరిన వయసు - మారని మనసు

— రావుల వెంకట శారదాదేవి.




ఇల్లిందల సరస్వతీదేవి

కురుద్వాడీలో దిగి మీరజ్‌కు వెళ్లే బండిలో ఎక్కి కూర్చున్నాడు చూడామణి.

నిద్ర లేవగానే కాఫీ తాగే అలవాటు. కాఫీకోసం కడుపులో పేగులు అరవటం మొదలుపెట్టాయి ఈ మార్గం అతడికి కొత్త. ఇదే కనక ఏ బెజవాడ లైనో అయితే ఈపాటికి కాఫీ ఇడ్లీ సేవించిఉండేవాడు. తన సామానంతా పై బల్లమీద సర్ది పెట్టుకుని, కిటికీకి దగ్గరగా కూర్చుని నాలుగు మూలలా చూశాడు. కాఫీ ముఖం ఒక్కటయినా కనబడలేదు. గుండెలో సన్నగా బాధనిపించింది.

“గరం చాయ్. పూరీ మసాలా కూరా తీసుకురానా?” కాంటీన్ యజమాని హిందీలో అడిగాడు చూడామణిని.

ఆ స్టేషను చూడగానే అదికూడా దొరకదనిపించింది చూడామణికి. ఆ మాత్రం దొరికితే చాలన్నట్లు తీసుకురమ్మన్నాడు. కాని చాయ్ అనగానే పెదవులు ఒక మాదిరిగా వంపుతిరిగాయి

“ఇక్కడ తీసుకోకపోతే మీరజ్ వెళ్లేవరకూ మీకు ఏమీ దొరకదు,” అన్నాడు పూరీ కూర చేతికిస్తూ కాంటీన్ యజమాని.

"మీరజ్ వెళ్లేటప్పటికి ఎన్ని గంటలవుతుంది ?" అడిగాడు చూడామణి వచ్చీ రాని హిందీభాషలో.

"ఇవాళ బండి లేటు. సాయంత్రం నాలుగు గంటలవుతుంది."

కాంటిన్ యజమానికి డబ్బిచ్చి పంపించి, ళ్లలా వేలాడే పూరీలు దవడలు నొప్పిపెట్టేటట్టు నమిలి నమిలి తిన్నాడు చూడామణి. అవి తిన్నతరవాత ఏవో ఒకటి – వేడివేడి నీళ్లు కడుపులో పడితేగాని తోచదనుకుంటూ కాంటీన్ యజమానిని మళ్లీ పిలిచాడు

''గరం గరం చాయ్ కావాలా" అక్కడినుంచే అడిగాడు. కాంటీను సరిగా చూడామణి కూర్చున్న కంపార్టుమెంటుకు ఎదురుగా ఉంది. చూడామణి తలాడించ గానే పొగలు గక్కే వేడి టీ కప్పు తీసుకువచ్చాడు. మెల్లగా తన గ్లాసులో పోసుకుని తాగటం మొదలుపెట్టాడు చూడామణి. ఒకొక్క చుక్క తాగుతూ పెర్రీమేసన్ చేతిలో పట్టుకుని పేజీలు తిరగవేస్తూ కూర్చున్నాడు. రైలు కదిలే సరికి ఉదయం ఏడుగంటలయింది.

అది మీటర్ గేజ్. బండి ఊగుతూ సాగుతూ పక్కలకు ఒరుగుతూ నడు స్తోంది. చూడామణి ఒక్కొక్కచుక్కే టీ తాగి సిగరెట్ వెలిగించాడు.

చిన్నచిన్న స్టేషన్లు వస్తున్నాయి, పోతున్నాయి. రైలు ఎక్కేవాళ్లు ఎక్కు తున్నారు. దిగేవాళ్లు దిగుతున్నారు. వాళ్లు మాట్లాడే భాష చూడామణికి అర్థం కావటంలేదు.

పెర్రీమేసన్ నవల ఆదినుంచి మంచి ఉత్కంఠతో సాగుతోంది. ఆధునిక అలంకరణలో డెల్లాస్ట్రీట్ కళ్లు జిగేలుమనిపిస్తోంది.

పన్నెండు గంటలు దాటుతుండగా పందరిపూర్ స్టేషన్ వచ్చింది అది ఆ లైనులో జంక్షను. ఎక్కేవారూ దిగేవారితో స్టేషను చాలా సందడిగా ఉంది. రైలు కదులుతుండగా నలుగురు ప్రయాణీకులు గబగబా లోపలికి వచ్చారు. వాళ్లల్లో ముగ్గురు మగవాళ్లు. నాలుగవ వ్యక్తి పాతికేళ్లలోపు స్త్రీ ఏడాది బిడ్డను ఎత్తుకుని గాలికోసం ఇటూ అటూ చూసి కిటికీకి దగ్గరగా కూర్చుంది. మిగతా ముగ్గురూ ఎదురో బెంచిమీద స్థిమితంగా కూర్చున్నారు. వాళ్లల్లో ఒకాయన ఏభయి ఏళ్లు దాటినవాడు. జేబులోనుంచి తమలపాకు బీడా నోట్లో పెట్టుకుని డబ్బీలో నుంచి చిటికెడు జరదా నోట్లో రాల్చుకున్నాడు. మిగతా ఇద్దరూ ఆయన ప్రమేయం లేకుండా మాట్లాడుకుంటున్నారు.

చూడామణికి వాళ్లు మాట్లాడుకుంటుంటే కనకసలాడినట్టుగా ఉంది. భాష రాకపోవటంచేత దీర్ఘాలు తక్కువనిపిస్తున్నాయి.

"మనం వెళ్లేటప్పటికి నాలుగవుతుంది ఉంటాడా అప్పటికి ఇంట్లో?"

"మనం హాస్పిటల్‌కే వెళ్లుతున్నాంగా. ఉండక ఎక్కడికి పోతాడేమిటి?"

"మన ముఖాలు చూడగానే ఏంచేస్తాడంటావు?"

"ఇప్పుడే ఎట్లా చెప్పగలం?"

వాళ్లు మరాఠీలో మాట్లాడుకుంటుంటే ఒకమాట తెలిసీ-ఒకమాట తెలియకా దిక్కులు చూస్తూ అప్పుడప్పుడు పేౖరీమేసన్ తిరగవేస్తున్నాడు చూడామణి

పెద్దాయన, వాళ్ల తండ్రి కాబోలు, పోలికలన్నీ ఒకటిగానే ఉన్నాయి. ఆయన వాళ్ల ప్రసంగం జోలికి పోవటంలేదు. జరదా బీడా నములుతూ జోగుతున్నాడు. మధ్య మధ్య ఆమెముఖంలోకి చూసి బరువుగా నిట్టూరుస్తున్నాడు. ఆయన ముఖం చూస్తే మానసికంగా అలసిపోయినట్టున్నాడు.

ఇద్దరు యువకుల్లో ఒకతడు కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

"ఏమిటి అనిల్. నీకు మతిపోతోందా?" రెండవ అతడు మందలిస్తున్నాడు.

"నేను చాలా నిగ్రహించుకుంటున్నాను ఆనంద్. మన ప్రయత్నం వృథా కాకూడదని వెయ్యి దేవుళ్లకు మొక్కుకుంటున్నాను."

అంత దుఃఖంలోనూ అనిల్ ఒక్కసారి పెద్దపెట్టున నవ్వాడు. "మన నలుగుర్నీ చూసి భయపడిపోడుకదా?"

ఆనంద్‌కు మనసులో భయంగానే ఉంది వాళ్ల బాధ చూడలేక ధైర్యంచేసి అందరినీ బయలుదేరతీశాడు.

"ఆనంద్ సందేహిస్తున్నావా ఏమిటి? ఉన్నమాట చెప్పెయ్యి." అనిల్ నిలదీసి అడుగుతున్నాడు.

చూడామణికి పేౖరీమేసన్ సాగటంలేదు. ప్రతి మాటకూ అర్థం తెలియక పోయినా మొత్తంమీద వాళ్ల సంభాషణ కొంత కొంత తెలుస్తున్నది

పసిపిల్ల ఒక అరగంట పడుకుని లేచింది. తల్లి మంచినీళ్లు పట్టింది తల్లి ఒడిలో కూర్చుని కేరింతలు కొడుతున్నది.

తల్లి పేరు సుమన కాబోలు. వాళ్ల మాటల్లో ఆ పేరు దొర్లుతున్నది తన పేరు వినబడినప్పుడల్లా, ఆమె వాళ్లను క్రీగంట చూస్తున్నది ఆసక్తితో. వాళ్లిద్దరిలో

అనిల్ ఆమె తమ్ముడు. ఆనంద్‌ను గుచ్చిగుచ్చి అడుగుతున్నాడు. ఆనంద్ సమాధాన మివ్వటానికి అవస్థపడుతున్నాడు.

అనిల్ పాపను మంజూ అని పిలిచినప్పుడల్లా కిలకిల నవ్వుతున్నది. మంజూ నవ్వుతుంటే చూడామణి పుస్తకం మూసి ఆమె ముఖంలోకి చూశాడు. రంగూ కనుముక్కు తీరూ చూస్తే దృష్టి మరల్చుకోలేనట్టుగా ఉంది. పరిశీలనగా తల్లి ముఖంలోకి అనుకోకుండా చూశాడు. మంజు మూడుమూర్తులా తల్లిపోలిక. ఒకటే అచ్చు. వర్ణించటానికి కవులే కావాలా అనుకుంటాము కాని - వట్టి మాటలతో ఆమె సౌందర్యాన్ని వర్ణించటం సాధ్యంకాదని చూడామణి హృదయం తట్టితట్టి చెప్పింది. ఆమె సౌందర్యం చూడామణి హృదయంలో ఒక మూలగా ముద్రితమైపోయింది. ఆ రంగు - ఆ కళ్లు - ఆ నొసలు - కనుబొమలు - నోరు - చిన్న గడ్డం - ఆ గులాబీ పెదవుల్లో ఆమె సృష్టించే విలాసమయిన చిరునవ్వు - తలవెంట్రుకలు పాపిట కిరువైపులా పరచుకున్న తీరూ - అంత లావూ సన్నం కాకుండా సమున్నతమయిన దేహమూ చూడామణి ఒక్కటంటే ఒక్కసారి గతంలో చూశాడు. తదేకదృష్టితో ఆ మూర్తిని చూసే అవకాశం కలిగింది. అదే మనసులో ముద్రపడిపోయింది. పది సంవత్సరాలకు పైగా గతాన్ని తవ్వుకుంటూపోతే టెన్నిసు ఆటలో తనను ఓడించి కప్పు గెలుచుకుని తన స్మృతిపథంలో నిలిచిపోయిన నిలోఫర్ బేగం బొమ్మ కళ్లకు కట్టినట్లయింది. ఎంతపోలిక ! అచ్చులు తయారుచేసుకున్న బ్రహ్మదేవుడు కళ్లు మూసుకుని ఎప్పుడో ఎక్కడో ఆలోచించుకోకుండా ఉపయోగించినట్టుంది.

మంజు నవ్వుతుంటే తల్లికూడా నవ్వింది. ఆ నవ్వు మొగల్ మహారాజ్ఞి నవ్వినట్టుగా ఉంది. చూడామణి హృదయం పరవశించింది.

ఆనంద్ అనిల్ మధ్య సంభాషణ సాగుతున్నది. అనిల్ మాటిమాటికీ పెదవులు విరుస్తున్నాడు.

''పెళ్లయిన తరువాత మూడురోజులు మాత్రమే ఉన్నాడు మా యింట్లో, అంతే మళ్లా ఎన్నిసార్లు పిలిచినా రాలేదు. ఉత్తరాలకు జవాబులేదు. సుమన ఎన్ని ఉత్తరాలు రాసిందో లేక్కలేదు. చివరకు ఒక ఉత్తరంలో రేపు బయలుదేరి వస్తున్నానని వ్రాసింది. దానికిమాత్రం వెంటనే జవాబు వ్రాశాడు."

''ఏమని ?" ఆనంద్ కుతూహలంతో ప్రశ్నించాడు.

"ఏమనా ? రావద్దని." అనిల్ కోపమూ విచారమూ ఆందోళనా ముప్పిరిగొన్నట్టుగా మాట్లాడుతున్నాడు.

''ఆఁ ?'' తల విదిలించాడు ఆనంద్.

మంచిపట్టులో ఉన్నది పెర్రీమేసన్ కథ అనిల్ – ఆనంద్‌ల సంభాషణలకు టక్కున పుస్తకం మూశాడు చూడామణి. అతడి దేహం జలదరించింది సగం సగం అర్థమయిన ఆ భాషలో అతడికేదో స్ఫురించింది. ఏమిటి ? ఇది ఆడపిల్ల సమస్యా ? ఇంత అందమయిన అమ్మాయికి కూడా అటువంటి దుర్దశా ? అయి ఉండదు. ఉండకూడదు. భాష సరిగా తెలియనికారణంగా తను తప్పుగా ఊహించుకున్నాడేమో ? తన ఊహలకు తనే సిగ్గుపడ్డాడు

ఉన్నట్టుండి ప్రయాణీకులు సామాను సర్దుకోవటం మొదలుపెట్టారు గంట చూసుకున్నాడు చూడామణి. నాలుగయింది: వచ్చే స్టేషన్ మీరజ్ అయి ఉంటుందనుకొని తన సామానుకూడా ఒకచోట చేర్చుకున్నాడు అప్పటినుంచి ఒక కంపార్టుమెంటులో ప్రయాణం చేస్తూ పలకరించకపోవటము అమర్యాదగా ఉంటుందనుకొని 'వచ్చే స్టేషన్ ఏమిటి ?" ఆనంద్‌ను అడిగాడు ఇంగ్లీషులో.

'మీరజ్. మీరూ అక్కడికేకదూ ? ఈ బండి ఇక్కడ నిలిచిపోతుంది." అన్నాడు

''అవును. నేనూ అక్కడికే." చూడామణి చిరునవ్వుతో జవాబిచ్చాడు.

''అక్కడ ఎవరింటికి ?" మామూలుగా అడిగాడు ఆనంద్.

"నా కళ్లకు గ్లకోమా వచ్చింది. అక్కడ మంచి కళ్లవైద్యుడున్నాడట. ఆపరేషన్ చేయిస్తాను రమ్మనమని మా బాబాయి ఉత్తరం వ్రాశాడు. అందుకని నా ప్రయాణం" అన్నాడు చూడామణి.

''కళ్ల డాక్టరా ? పేరు ?"

"నరేంద్ర కోరట్కర్."

అనిల్ ఉలిక్కిపడ్డాడు. ఆనంద్ ముఖం తిప్పుకున్నాడు. సుమన కళ్లు పెద్దవి చేసుకుని వాళ్లందరివైపు చూసింది.

"ఏమలా ముఖం తిప్పారు ? మీకు తెలుసా ? మంచి వైద్యుడు కాదా ?'' అంటూ అందరి ముఖాలలోకి చూశాడు చూడామణి.

"అయ్యో ! అలా భయపడుతున్నారేమిటి? చాలా గొప్ప నిపుణుడు. ఆయన వైద్యంకోసం ఎక్కడెక్కడినుంచో వస్తారు ప్రజలు," ఆనంద్ సర్దుకుంటూ జవాబిచ్చాడు.

సంభాషణ ఇంగ్లీషులో సాగిపోయింది. తనది తెలుగువాడి ఇంగ్లీషు, వాళ్ళది

మహారాష్ట్రుల ఇంగ్లీషు. చూడామణి మనసులో ఆనందముఖంలో వచ్చినమార్పు నిలిచిపోయింది.

తరువాత కొంతసేపు మీరజ్ హాస్పిటల్‌ను గురించి మాట్లాడుకున్నారు.

రైలుబండి నడకవేగం తగ్గించి. ఒక్క ఊపులో టక్కున ఆగింది. మీరజ్ స్టేషను వచ్చింది. ఎవరికి వారు ముందు దిగాలన్న ఆత్రంలో తోసుకుంటూ దిగటానికి ప్రయత్నంచేస్తున్నారు.

సుమన మబ్బురంగు జరీఅంచులచీరె మహారాష్ట్రులు కట్టినట్టు కట్టుకున్నది. చేతికి అరపని తలవంట్రుకలు ముడిపెట్టింది. కుచ్చులు కుచ్చులుగా ముఖంమీద పడే ముంగురులూ సోగకళ్ళూ—మహాశిల్పి చెక్కిన శిల్పంలా బిడ్డనెత్తుకుని ప్లాట్‌ఫారమ్ మీద నిలబడ్డది.

ఆ తల్లీబిడ్డలను ఒకసారి కళ్లారాచూసి తన సామాన్లతో స్టేషన్‌దాటి బైటకి వచ్చాడు చూడామణి.

సంగ్లీ పట్టణానికి దగ్గరగా ఏరకమయిన ప్రాధాన్యతా లేనిది మీరజ్. కాని అమెరికా నుంచి మిష్నరీలు వచ్చి ఒక పెద్ద హాస్పిటల్ కట్టారు. అది ఒక విధంగా నర్సింగ్‌హోమ్ లాంటిది. దానిపేరు వాన్‌లెస్ హాస్పిటల్ అంటారు. హాస్పిటల్లో పనిచేసే డాక్టర్లకూ నర్సులకూ ఆవరణలో అందమయిన ఇళ్లు కట్టారు. వాటి ముందర కంటికింపయిన పార్కు-టెన్నిస్‌కోర్టు.

బాబాయి ఇల్లు వెతుక్కుంటూ క్వార్టర్ల నంబర్లు చూసుకుంటూ ఒకదాని ముందర ఆగాడు చూడామణి. టాంగాలోనుంచి సామాను దింపుతుండగా పిన్ని బయటికి వచ్చింది.

"నిన్న వస్తానని బాబాయి కూడా స్టేషనుకు వచ్చారు. ఇవాళ నీ దగ్గర్నించి ఉత్తరమో టెలిగ్రామో వస్తుందనుకుంటున్నాము." లోపలికి తీసుకువెళ్ళింది పిన్ని చూడామణికో కుర్చీచూపించి లోపల్నించి కాఫీ గ్లాసుతో బైటికివస్తూ "ఈ ప్రయాణంలో నీకు కాఫీ దొరికిఉండదు. ముందు కాఫీ తాగు. తరవాత మాట్లాడుకుందాము." చేతికిచ్చింది.

కాఫీ గ్లాసు చూడగానే చూడామణికి ప్రాణం లేచివచ్చింది

"ఏమిట్రా మణీ! ఇప్పుడేనా రావటం?"

బాబాయి మాట వినబడగానే దిగ్గున లేచి నిలబడ్డాడు చూడామణి. నిన్న రాని కారణం—ఇవాళ వచ్చిన కారణం-ఆయనతో సహేతుకంగా చెప్పి-ఆయనకోసం ప్రత్యేకంగా తీసుకువచ్చిన జీడిపప్పు పాకెటు అందించాడు.



ఎవరిమీద ఎంతకోపం వచ్చినా, మనసెంత చికాకుగా ఉన్నా డాక్టరు రమణక జీడిపప్పు చూడగానే ముఖం విప్పారుతుంది. ఆ తరవాత చాలా కులాసాగ సరదాగా మాట్లాడటం చూడామణికి అనుభవమే. కాని ఎప్పటికప్పుడే కొత్త.

చూడామణి పిన్ని రాధమ్మతో చాలాసేపు కబుర్లు చెప్పాడు. ఆమె ఇల్లు తోటా చెట్లపాదులూ చూపించింది. కనకాంబరాలు మల్లెలూ కలిపి దండకడుతూ తమ కబుర్లన్నీ చెప్పి బంధువులందరి కబుర్లూ చెప్పించుకున్నది.

ఏడు గంటలు కాగానే చపాతీ కూరా చేసి "అలా బైటకి వెళ్దాంరా మణీ. బాబాయి ఇంకో గంటకుగానీ రారు" అంటూ తీసుకువెళ్ళింది.

వాన్‌లెస్ హాస్పిటల్ కొత్తభవనాలు డబ్ల్యూ ఆకారంలో నాలుగు అంతస్తులుగా తయారవుతున్నాయి. ఒక పక్క పాత కట్టడాలకు కొత్త అలంకారాలు చేస్తున్నారు. గేటుకు దగ్గరగా బర్న్ ప్రాజెక్టు రెండంతస్తుల భవనానికి రంగులు వేస్తున్నారు. రాధమ్మకూ చూడామణికీ దారికడ్డం వచ్చాడు నాలుగేళ్ళ పిల్లవాడు.

"నమస్తే మేమ్‌సాబ్"

"నమస్తే, బాగున్నావా ?" రాధమ్మ ఆప్యాయంగా పలకరించి పర్సులోనుంచి పదిపైసల బిళ్ల తీసిచ్చింది

"థాంక్స్" పరుగెత్తాడు పిల్లవాడు

వాడినిచూసి రాధమ్మ బరువుగా నిట్టూర్చి, "జరుగుతున్న విషయాలు కథలలోకి ఎంతమాత్రం ఎక్కుతున్నాయో నాకు తెలియవు కాని మణీ! కథలలో వ్రాయబడుతున్నవి జరుగుతుంటే చాలా విచిత్రంగా ఉంటుంది. ఇప్పుడు కనబడ్డాడే ఆ పిల్లవాడిదో కథ" అన్నది.

"ఏమిటది పిన్ని. వాడికి తల్లీ తండ్రీ లేరా?"

"ఇద్దరూ ఉన్నారు. వాడు కడుపులోఉండగా తల్లి ఒకనాడు భర్త కాలితోపిడివల్ల పొయ్యిమీద పడిపోతే ఒళ్ళంతా కాలిపోయింది రాత్రి పన్నెండు గంటలవేళ అతడు భార్యను ఇక్కడికి తీసుకువచ్చి హాస్పిటల్లో చేర్పించాడు. మూడు నెలలకు ఆమె బయటపడ్డది. ఆ అపాయంలోనుంచి. కాని ఒక కన్ను పోయింది. ముఖమంతా కాలిన వంకాయలా అయిపోయింది. ఆ వికృతరూపం చూసి బిల్లయినా చెల్లించకుండా పారిపోయాడు పెనిమిటి."

"అయ్యో. నిజమేనా ఇదంతా పిన్నీ?" తెల్లబోయాడు చూడామణి.

"సూపరెన్టెంటు బిల్లుకు ఒత్తిడిచేశాడు. ఆమె ఏంచేస్తుంది పాపం? ఒంటిమీద ఉన్న పూసాపుస్తె తీసుకునే పెనిమిటి ఇక్కడ చేర్చాడు. గోడుగోడున ఏడుస్తూ ఆ గంగాబాయి డాక్టర్లందరికీ చెప్పుకున్నది. డాక్టరు నరేంద్ర అంటే ఇక్కడి కళ్ల డాక్టరు, మూడువందల రూపాయలకు పైగా ఉన్న బిల్లు చెల్లించాడు. ఆమె ఇక్కడే పురుడు పోసుకుంది. పిల్లవాడిని మిషనరీలో తీసుకుని శామ్యూల్ అని పేరు పెట్టారు. గంగాబాయి ఈ హాస్పిటల్లో ఆయాగా చేరిపోయింది."

"డాక్టర్ నరేంద్ర అంటే.."

"ఆఁ...ఆయనే నీకు రేపటినుంచీ వైద్యం చేయబోయే డాక్టరు. ఇక్కడ అందరికీ ఆయన దైవసమానుడు. ఎందరికి ఎన్నివిధాల సహాయం చేస్తాడో చెప్పలేము. తన చేతిలో ఉన్నంతవరకు మాట సహాయము ధన సహాయం చేస్తూనే ఉంటాడు. మెత్తటి మనసు కలవాడు డాక్టరెలా అయ్యాడా అని నా సందేహం. ఎవరు వచ్చి అడిగినా చేతిలో ఉన్నది లేనిది చూసుకోకుండా దబ్బిస్తాడు. మరునాడు తనకోసం అప్పుచేస్తాడు. బట్టలు కూడా అలాగే దానం చేస్తాడు." ముందుకు సాగించింది నడక పిన్ని.

ఇద్దరూ పార్కులోకి వచ్చి కూర్చున్నారు.

"ఈ చుట్టుప్రక్కల గ్రామాలనుండి జనం ఇక్కడికే వస్తారు. హాస్పిటల్ ఎప్పుడూ కిటకిటలాడుతూ ఉంటుంది. కాని ఇక్కడ లిఫ్టులేదు. కాన్వాసుబట్ట

బొంగులకు తగిలించిన స్ట్రెచర్ మీద రోగులను పైకీ కిందికీ తిప్పుతూ ఉంటారు.'' పిన్ని చటుక్కున స్వరం తగ్గించి పక్కకు తిరిగి "నమస్తే డాక్టర్" అన్నది.

చూడామణి తలఎత్తి చూశాడు. మనిషి ఐదడుగుల పొడుగున్నాడు. రంగు నలుపు. అయినా ఆ కళ్ళు తేజస్సును వెళ్ళగక్కుతున్నాయి. పెదవులమీద మధుర మందహాసం.

''ఎలా ఉన్నారు? అంతా కులాసా?'' అడిగాడు డాక్టరు ఇంగ్లీషులో.

రాధమ్మ తడుముకోకుండా జవాబిచ్చింది. డాక్టర్ని కొంతదూరం వెళ్ళనిచ్చి "అలా తెల్లబోయి చూస్తున్నావు. ఈ పిన్ని ఇంగ్లీషు ఎప్పుడు నేర్చిందా అని కదూ?" అన్నది.

"అవును. నాకంటె బాగా మాట్లాడుతున్నావు" అన్నాడు

''ఏం చెయ్యను మణీ. ఇక్కడందరూ డాక్టర్లు. వాళ్ళకు బాగా చదువుకున్న భార్యలు; అందరూ ఇంగ్లీషులో మాట్లాడుకుంటారు. మీ బాబాయికి నాకు ఇంగ్లీషు రాదని నామోషీగా ఉండేది. ఇక్కడికి రాగానే ఒక మిష్నరీ దొరసాన్ని పిలిచి మాట్లాడటం నేర్పించారు. అంతే-బాగా చదవటం రాయటమూ వచ్చుననుకునేవు" పకపక నవ్వింది.

రాధమ్మ దారిపొడుగునా డాక్టర్ నరేంద్రను గురించీ అతడి వితరణబుద్ధిని గురించీ వర్ణించి చెప్పింది.

చూడామణి హృదయంలో సంతోషం కెరటం వేసింది. అంత గొప్పడాక్టరు తనకు కంటి ఆపరేషన్ చేయబోతున్నందుకు ఎంతో తృప్తిగాఉంది. చిన్న పాము నయినా పెద్దకర్రతో కొట్టమన్నారు అనుభవజ్ఞులు. డాక్టరు కళ్ళలోని తేజస్సునూ వాత్సల్యాన్నీ మరొకసారి జ్ఞప్తికితెచ్చుకున్నాడు. మనసుకు కొండంత ధైర్యము కలిగింది. డాక్టరు ప్రసిద్ధుడయితే రోగం చేత్తో తీసేసినట్టుంటుందిరోగికి.

గేటులోపలికి కాలుపెడుతుండగా ఆనంద్ అనిల్‌లు కనబడి "రైల్లో కలిశాం-జ్ఞాపకమున్నదా?'' అన్నారు.

చూడామణి "లేకెం" అంటూ నవ్వాడు. అతడి కళ్ళకు నిసర్గ సుందరి సుమన-చిరునవ్వుల మంజు బొమ్మకట్టారు.

## 2

ఆందోళన, భయం వెలుగునీడల్లా ఒకదానివెనక ఒకటి తరుముకొచ్చినట్టుగా ఉంది సుమన ముఖం. టాంగా దిగి మంజునెత్తుకుని తడబడుతూ అడుగులు

వేసింది. ఆనంద్ అనిల్‌లు క్వార్టర్స్ నెంబర్లు చూసుకుంటూ గబగబా ముందు నడుస్తున్నారు సుమన తండ్రి పీక్కుపోయిన ముఖంతో డస్సినట్టు అడుగులు వేస్తున్నాడు.

ఆ లైనంతా రెండుసార్లు చుట్టువచ్చిన అనిల్ ఆనందులు ఒకయింటిముందర ఆగి బజర్‌నొక్కారు.

"డాక్టర్‌సాబ్ లేరు" నౌకరు తలుపు తెరుచుకుని బైటికి వచ్చాడు.

"ఎక్కడికి వెళ్లారు?" అనిల్ అడిగాడు.

"నాకు తెలియదు." వాళ్లను చూసి చుట్టాలు వచ్చారనుకుని తలుపులు తెరిచి సామాను లోపల పెట్టాడు. పాలు తీసుకువచ్చి అందరికీ టీ చేసి యిచ్చాడు నౌకరు.

సుమన ముఖం బిక్కచచ్చినట్టుంది. ఆనంద్ ఆమెను ఒక కుర్చీలో కూర్చోమని తనుకూడా పక్కనే కూర్చున్నాడు ఒక బల్లమీద. అనిల్ ఇల్లు నాలుగు మూలలా తిరిగి చూసివచ్చాడు. ఇంట్లో సామాను ఏమీలేదు. ఒక మనిషికి తగ్గ వంట సామానుంది. గదిలో ఒక మంచం — నీళ్ల గదిలో ఒక ప్లాస్టిక్ బకెటు.

అందరినీ ఇంట్లో ఉంచి నౌకరు సాధారణంగా డాక్టరు సాయంకాలపు వేళల్లో ఉండే చోట్లన్నీ చూశాడు. సుమారు ఎనిమిది గంటలకు డాక్టరు ఫిలిప్స్ ఇంట్లో కనబడ్డాడు.

నౌకర్ని చూడగానే డాక్టరు నరేంద్ర ఒక చీటీ ఇచ్చాడు.

దాన్ని చదువుకొని అనిల్ మండిపడ్డాడు తండ్రిమీద. "వద్దంటే మీరు కూడా వచ్చారు. ఇదేం తెగే సమస్యకాదని నేనప్పుడే చెప్పాను. మేము చిన్న వాళ్లం ఎలాగో తంటాలుపడతాంగా?" విసుక్కున్నాడు.

ముసలాయన కళ్ళు ఎర్రబడ్డాయి. కండువాతో కళ్లద్దుకున్నాడు.

అదిచూసి అనిల్ ఎందుకన్నానా అని పశ్చాత్తాపపడ్డాడు.

మంజు ప్రయాణబడలికవల్ల ఏడ్చిఏడ్చి నిద్రపోయింది.

అనిల్ హాస్పిటల్ కాంటీను నుంచి అందరికీ భోజనం తెప్పించాడు. తండ్రి ఏమీ తిననంటే తిననన్నాడు. సుమన కన్నీళ్ళు కారుస్తూ ఒట్టుపెట్టుకుని తండ్రి చేత కొద్దిగా తినిపించింది. వెంట తెచ్చుకున్న పక్కలు పరచుకొని అందరూ పడుకున్నారు.

ఎంత రాత్రయినా సుమనకు నిద్రపట్టలేదు. మెదడు మొద్దుబారిపోయింది.

ఆలోచనలు సాగటంలేదు. ఇంటి కప్పువంక చూస్తూ పడుకుంది. తెల్లవారి నౌకరు లేచి అందరినీ లేపాడు.

ఆనంద్ కేమీ పాలుపోవడంలేదు. తనేదో నిర్వాకంచేసి సుమన సంసారాన్ని నిలుపుతానని అనిల్‌కుచెప్పి ఈ ప్రయత్నం చేయించాడు. నరేంద్ర కనబడకుండాపోయాడు. ఎనిమిదిగంటల సుమారుకు స్నానంచేసి హాస్పిటల్‌కు బయలుదేరాడు. కనబడిన ప్రతి డాక్టర్ని అడిగాడు. ఎవరూ సరైన సమాధానం చెప్పలేదు. తిరిగి మొదట కనబడిన డాక్టర్నే వివరంగా అడగాలనుకుంటూ వెళ్ళుతుండగా ఎదురయిన డాక్టరు, ''ఆయన పనిమీద ఊరికెళుతున్నట్లు, వారం సెలవుపెట్టినట్టూ తెలిసింది. నేనొక కేసు ఒప్పగించుదామనుకున్నాను. ఆఫీసులో కనుక్కుంటే తెలిసిందీసంగతి'' అన్నాడు.

ఆనంద్ కాళ్లీడ్చుకుంటూ ఇంటికి వచ్చాడు. పన్నెండు గంటలు కావొచ్చింది. సుమన తండ్రికి దగ్గరగా పక్క పరిచి మంజును పడుకోబెట్టి విసురుతూ కూర్చుంది. అనిల్ ఇంట్లోలేడు

ఆనంద్‌ను చూడగానే సుమన లేచి ఏమయిందని అడిగింది.

జరిగిందంతా చెప్పాడు.

''ఇంకో వారంవరకూ రాడు. అప్పుడయినా వస్తాడని నమ్మకమేమిటి ?'' అన్నాడు

సుమన తలవంచుకుంది.

''ఎన్నాళ్లకీ రాకపోతే విసుగుపుట్టి వెళ్లిపోతారనుకున్నాడేమో ?''

సుమన మాట్లాడలేదు.

అంతలో విసురుగా వచ్చాడు అనిల్. "చూడు ఆనంద్. మనం వచ్చినట్టు నరేంద్రకు తెలిసే సెలవుపెట్టి వెళ్లాడు. ఎందుకయినా మంచిది, నాన్నను ఇంటికి చేరవేయటం మంచిది. ఆయనకు ఆదుర్దాతో రక్తపుపోటు హెచ్చుతుందని నాకు భయం.'' అన్నాడు.

''మరి సుమన ?'' ఆనంద్ ఏదో తప్పుచేసినవాడిలా కుంచించుకుపోతున్నాడు.

''నేనా ? ఏది ఏమయినా నేనీఊరినుంచి కదలను, అనిల్. నాన్నను తీసుకుని నువు ఇంటికి వెళ్ళు" అన్నది విసురుగా.

''ఇక్కడ ఏం చేస్తావు ? నీకు దిక్కెవరు ? ఎక్కడ ఉంటావు ? నీవిక్కడ కనబడితే నరేంద్ర నిన్నేదయినా చెయ్యవచ్చు. నిన్నిక్కడ దిక్కుమాలినచావు చావనిస్తానా ?" అనిల్ ముఖం కోపంతో ఎర్రబడ్డది.

ఆనందుకు ఎటూ తోచటంలేదు. గుడ్లు ఒప్పగించి వాళ్లిద్దరినీ చూస్తున్నాడు.

"మంచికో చెడ్డకో ఈ ఊరు వచ్చాను. హాస్పిటల్ ఆవరణంలో అడుగు పెట్టాను. అంతే. ఇక్కడినుంచి రాను'' మొండికెత్తింది సుమన.

ఇద్దరూ ఘర్షణపడ్డారు చాలాసేపు.

"అయితే ఎక్కడుంటావు ? నీకేదిక్కులేదు. నీ కోపిల్ల పైగా" అరిచాడు అనిల్. మంజు అంటే అనిల్‌కు ప్రాణం. అట్లా అన్నందుకు అతడి మనసెంతో బాధపడ్డది.

"ఈ హాస్పిటల్ చూస్తే చాలా పెద్దదిగా ఉంది. ఎందరో లేడీడాక్టర్లున్నట్టున్నారు. ఈ యింటిముందునుంచే ఎంతోమంది వెళ్లగా చూశాను. ఏఒకరింట్లోనో ఉంటాను. ఏదయినా ఒక చిన్న ఉద్యోగం చూసుకుంటాను."

''మంజు ? దాన్నేంచేస్తావు ?

''దాన్నా ? ఉండనీ. నాతోనే ఉంటుంది. వడ్లతో తట్ట ఎండక ఏంచేస్తుంది ?"

ఆమె మాటలు ఒక్కొక్కటే అతని గుండెల్లోనుంచి దూసుకుపోతున్నాయి తుపాకిగుండ్లలా. అనిల్‌కు ఆమెపట్ల ఉన్న ఆపేక్షలోనుంచి కోపము పుట్టుకొస్తోంది.

ఆనంద్ ఇక ఆగలేకపోయాడు. ఈ సంక్షోభమంతా తను చేతులారా తెచ్చిపెట్టాడు.

''అనిల్ ఇవాళ్టికి ఈ విషయాన్ని గురించి మరి ఆలోచించకు. రేపు ఆలోచిద్దాం.

అందరి హృదయాల్లో ఆందోళన సముద్రంలా పొంగుకంటూ మీదిమీదికి వస్తుంటే ఎవరు ఆపగలరు ?

మీరజ్‌లో హాస్పిటల్ కట్టటంవల్ల దానిచుట్టూ పళ్ళదుకాణాలూ, మందుల షాపులూ, కళ్లజోడు దుకాణాలూ అన్నీ వెలిశాయి. ఈ హాస్పిటల్ ప్రైవేటు దయినా సంగ్లీలో ఉన్న గవర్నమెంటు మెడికల్ కాలేజికి టీచింగ్ హాస్పిటల్ అయింది. మీరజ్‌లో ఉన్నవాళ్ళు ఏ వస్తువు కావాలనుకున్నా సంగ్లీ వెళ్తారు.

ఆనంద్ అనిల్‌కు దగ్గరగా కూర్చుని భుజంమీద చెయ్యేస్తూ, "ఈ సాయంకాలము మంచి పిక్చరుకెళ్దాం. మనసు కొంతవరకూ తేరుకుంటుంది. ఆ సమస్యను గురించి ఉద్రేకంతో కాక ప్రశాంతంగా ఆలోచించగలుగుతాము,'' తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో అన్నాడు.

"నాన్న ఎట్లా వస్తాడు ? ఆయనకింకా బడలిక తగ్గలేదు. ఇంట్లో ఒక్కరినీ ఎట్లా వదిలిపెట్టి వెళ్దాము ?" సుమనవంక చూశాడు అనిల్.

సుమన ముడుచుకుని గోడకానుకుని కూర్చుంది. ఆనాడు తలదువ్వుకోలేదు. ముంగురులన్నీ చిందరవందరగా ముఖమ్మీద నాట్యం చేస్తున్నాయి. ముఖాన ఉన్న బొట్టు తోకచుక్కలా సాగింది. ముఖం శోకభారంగా ఉన్నది.

అనిల్‌కు కడుపులో దేవినట్లయింది.

''సుమా. పిక్చరు ప్రోగ్రామ్ వేస్తున్నాడు ఆనంద్. ఏమంటావు ?'' అన్నాడు.

"నాన్న ?'' తండ్రివైపు కళ్లు తిప్పి సైగచేసింది.

వీళ్ల సంభాషణంతా వింటున్న ఆయన దిగ్గున లేచి కూర్చుని ''పదండి. నేనూ వస్తాను. ఈ ఇంట్లో పడుకుంటే దయ్యాలు వేటాడుతున్నట్టుగా ఉంది." ముసలాయన ఇరవైనాలుగు సంవత్సరాల క్రిందట పోలీసు ఇన్స్పెక్టరు మంగేష్‌రావు. కాని ఆయనను అంతా ఇంటిపేరుతో చందావర్కర్ అని పిలిచేవారు. తన ఏభైఅయిదో ఏటవరకూ ప్రజలను హడలగొడుతూ ఉద్యోగం చేసాడు. సర్వీసులో మచ్చలేకుండా తన శాఖలో పనిచేసేవాళ్లకు మేలుబంతిగా నడుచుకున్నాడు. ఆ పోలీసుతత్వం ఒంట జీర్ణించిపోయి-ఇప్పటికీ ఎవరయినా తప్పు చేస్తే సహించలేడు. కోపోద్రేకంతో ముఖమంతా ఎర్రబడిపోతుంది. సుమనకు సంబంధించిన సమస్య ఒక్కొక్కరోజు మరీ ఆయనను బాధిస్తుంది అటువంటి సమయాల్లో అనిల్‌పుట్టిన ఇరవైరోజులకు చనిపోయిన భార్యమీద విపరీతమయిన కోపం వస్తుంది.

'ఈ పిల్లలిద్దరి బాధ్యతా నా నెత్తిమీద పెట్టి హాయిగా వెళ్లిపోయావు' అంటూ పళ్లుకొరుకుతాడు. కాని – వెంటనే కళ్లనీళ్లు జలజలా రాలుస్తాడు.

చందావర్కరు అక్క కావేరి మరుగుజ్జు. ఆ కారణంచేత ఆమె అవివాహితగా తమ్ముడిదగ్గర ఉండిపోయింది. తమ్ముడికి ఎటువంటి బాధ కలిగినా చూడలేదామె. ఎప్పుడూ ఆయనను సాంత్వనపరుస్తూ ఉంటుంది. అసలు చందావర్కర్‌కు బదులు ఆమె సుమనతో ప్రయాణమయింది. తీరా బండి వచ్చి వాకిట్లో నిలబడ్డ తరువాత చందావర్కరు ఆమె పెట్టెతీసేసి, తన పెట్టెతీసుకుని బయలుదేరాడు.

''నాన్న జాగ్రత్తరా అనిల్'' కావేరి అనిల్‌భుజంమీద చెయ్యేసి చెప్పింది. సరేలే అన్నట్టు తల ఎగరేశాడు అనిల్.

దారి పొడుగునా ఏమనిపించలేదు కాని - ఇల్లు చేరుకున్న తరవాత చందా వర్కరు పడుతున్న తపన చూస్తుంటే అనిల్‌కు గాభరాగా ఉంది. 'ఈయనను ఇంటికి ఎలా చేరుస్తానా' అని అధైర్యపడిపోతున్నాడు.

ఆనంద్ వెళ్లి టాక్సీ తెచ్చాడు. మంజును ఒళ్లో కూర్చోబెట్టుకుని ముందు సీట్లో కూర్చున్నాడు చందావర్కరు. సుమన, అనిల్, ఆనంద్ వెనకసీట్లో కూర్చున్నారు. కారు సంగ్లీ వైపు పరుగుతీస్తోంది. అనిల్, ఆనంద్ దారివెంట పోయేవాళ్ల ముఖాలు పరిశీలనగా చూడటం మొదలుపెట్టారు

టికెట్లుకొని అందరినీ హాల్లో కూర్చోబెట్టి ఆనంద్ బైటికి వచ్చి అక్కడ ఉన్న జనాన్ని పరిశీలించి చూశాడు. ఎటూ తోచనివాడిలా లోపలికి వెళ్లి అనిల్ పక్కన కూర్చున్నాడు. సినిమా మొదలయింది. అందరూ కాలేజి విద్యార్థినీ విద్యార్థులు. పిక్‌నిక్కని రెండు బస్సులలో బయలుదేరారు. దారిమధ్యలో ఒక బస్సు చెడిపోయింది. చెడిపోయిన బస్సులో ఉన్నవాళ్లు రెండో బస్సును ఆపు చేసి వాళ్లను కూడా దిగమన్నారు. అక్కడ వందమందివరకూ పోగయిన విద్యార్థినీ విద్యార్థుల కోలాహలాన్ని ప్రేక్షకులు చాలా ఆసక్తితో కుతూహలంతో చూస్తున్నారు. వాళ్లని చూస్తున్న ప్రేక్షకలోకంలో ఉల్లాసమూ ఉద్రేకమూ కలుగుతోంది. కొందరు ఈలలు వేస్తున్నారు. కొందరు పగలబడి నవ్వు తున్నారు

ఇంటర్వెల్లో అనిల్ ఆనంద్ బైటికి వెళ్లి సిగరెట్లు కాల్చి లోపలికి వచ్చారు. సుమనకు చందావర్కరు ఫాంటా తెప్పించారు. అలవాటు ప్రకారం ఆనంద్ తన కళ్లను హాలు నాలుగు ప్రక్కలా కలయతిప్పాడు.

"ఆనంద్! మంజుకో పేలాల పాకెటు తీసుకురా." సుమన మాటలకు ఉలిక్కి పడి లేచాడు. హాలులో ఒకచోట అతడి చూపు నిలిచింది. పేలాల పాకెటు కొని సుమనకిచ్చి వెళ్లాడు.

సినిమా ముగిసింది. జనగనమన అవకముందే అనిల్ తండ్రీ అక్కతో బైటికి వచ్చాడు. ఇంటర్వెల్లో బైటికి వెళ్లిన ఆనంద్ ఇంతవరకు అంతులేడు. ప్రేక్షకు లందరూ బైటికి వచ్చేవరకు బైట నిలబడ్డారు ముగ్గురు.

సుమన దృష్టిలో నాయికీ నాయకులు ఇంకా మురిపెంతో దండలు మార్చు కుంటూనే ఉన్నారు. అందరూ ఇట్లాగే పెళ్లయ్యేవరకు ఉబలాటపడతారు కాబోలు. ఆ మరునాడు, ఆ మరునెల - ఆ మరుసంవత్సరం కూడా వాళ్లల్లో ఆ పొంగు అట్లాగే ఉంటుందా? ఉంటే ఎంతమందికి? తనవాడనుకున్న నరేంద్ర



ముఖం పెళ్ళినాడు ఎట్లా ఉన్నది? ఆ వయసు పెళ్ళికొడుకు తనలాంటి పెళ్ళి కూతురి పక్కన ఎటువంటి ముఖంతో కూర్చున్నాడు?

బంధువులు కొందరన్నారు — వధూవరులిద్దరూ బ్యూటీ అండ్ ది బీస్టులా ఉన్నారని. పెళ్ళికూతురు పెట్టాల్సిన పెదముఖం పెళ్ళికొడుకు పెట్టాడెందుకు అని కొందరు గుసగుసలాడారు.

పెళ్ళిచూడటానికి వచ్చిన వాళ్ళెవరో "పెళ్ళికూతురికి పెళ్ళికొడుకును ముందు చూపించారా లేదా" అని గట్టిగా అన్నారు.

తుళ్ళిపడ్డాడు నరేంద్ర, ఆ మాటకు.

తను కొంచెం కోపంగా అందరివంకా చూసింది.

నరేంద్ర ముఖంమీద కత్తివాటుకయినా నెత్తురుచుక్కలేదు. ముఖం మాడ్చుకునే పీటలమీద కూర్చున్నాడు. కనుబొమలు ముడుచుకునే మంగళసూత్రాలు

ఆమె మెడకు కట్టాడు. గుండెలో అలజడి రేగుతున్నట్లుగా అనీ ఆనకుండా పీట మీద కూర్చున్నాడు. పురోహితుడు చెప్పినట్లుగా యాంత్రికంగా తతంగమంతా ముగించాడు. ఇద్దరూ పీటలమీదనుంచి లేచి తలవెంట్రుకలలో చిక్కుకు పోయిన తలంబ్రాలను దులుపుకుంటుండగా తన స్నేహితబృందమంతా వచ్చి ఎదురుగా నిలబడ్డది. ముసిముసి నవ్వులతో తను ఒక్కొక్కరినే అతడికి పరిచయంచేసింది. కరచాలనంకోసం వాళ్లు చెయ్యిచాపితే నరేంద్ర విసుక్కున్నాడు. వాళ్లు తెల్లబోయి వెనకడుగువేశారు.

తన మనసెంతో చిన్నబోయింది. కాని వెంటనే అతడి కేదో చికాకుగా ఉందని సర్దుకుంది.

ఆ మూడురాత్రులు ముడుచుకునే ఉంటాడు కాబోలనుకుంది. అతడు ఉన్నది సరిగ్గా మూడురాత్రులు. ఆ మూడురాత్రులూ అతడే వధువులా ఉన్నాడు తల వంచుకుని.

అతడి పక్కన కూర్చుని తనే చెప్పింది ఎన్నో కబుర్లు. వాటన్నిటికీ అతడు ఊఁ అనలేదు ఆఁ అనలేదు. కాని – ఒక్కమాట అన్నాడు. "నేను రెండేళ్ల తరువాత పెళ్లిచేసుకుంటానంటే వినలేదు" గొణిగినట్టుగా.

"ఎందుకు ? ఎవరు వినలేదు ?" ఆదిరిపడ్డది తను. ఇష్టంలేకుండా పెదవి విరుచుకుంటూ అన్నాడు, "ఇంకా ఎవరున్నారు ? మా నాన్న."

"అలాగా !" అప్పటికే గొంతు తడారిపోయింది.

"ఎందుకు ? ఇంకా చదువున్నదా ? అయిపోయిందన్నాడే మా నాన్న ?" అతడి చేతిని తన చేతిలోకి తీసుకోటానికి ప్రయత్నించింది.

విసురుగా చెయ్యి లాక్కుంటూ అన్నాడు, "చదువుకోసంకాదు."

"మరి ఎందుకు ?"

"నా కిష్టం లేదంతే" మాట తుంచేసి లేచాడు.

"అయితే మనది ఇష్టంలేని పెళ్లా ?" రెండు చేతులతో కళ్లుమూసుకుంటూ లేచింది.

"ఒకవిధంగా."

ఆ రాత్రి అలాగే మూతిముడుపులతో తెల్లవారింది.

మరునాడూ అంతే. చాలా ముభావంగా ఉన్నాడు నరేంద్ర. మూడోనాడు రాత్రి పెదవి కదిపి రెండుంటే రెండు మాటలు మాట్లాడాడు.

"రెండు సంవత్సరాలవరకూ నీకూ నాకూ ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరగకూడదు. నేను నీ జీవితంలోకి రాలేదనే అనుకో "

"ఎలా అనుకోను ? పెళ్లికి సంబంధించిన ఉత్సాహోద్రేకాలు మనసుని నిలవనీయకుండా చేస్తుంటే పెళ్లికాలేదనుకోనా ? లేక ఇదంతా ఒకనాటి మురిపెమనుకోనా ?" తన కెందుకో అభిమానము దెబ్బతిన్నట్లనిపించింది. మాట కొంచెము కరుకుగానే ధ్వనించింది.

అతడు దెబ్బతిన్నట్టు తలఎత్తి చూశాడు

''జీవితంలోకి రాకపోవటమేమిటి ? అంతమంది ఎదుట – పవిత్రమయిన మంత్రాలుచ్చరిస్తూ నా మెడలో పుస్తెకట్టారు " అప్పటికే ముక్కుపుటా లదురుతున్నాయి గడ్డం వణుకుతున్నది. కళ్లు నీళ్లతో నిండాయి.

''ఇవన్నీ నేను భరించలేను. నీవన్న దేదీకాదు.'' తల అడ్డంగా తిప్పాడు. ఎంతో బాధపడుతున్నట్టు ముఖంపెట్టాడు నరేంద్ర.

"కన్నీళ్ళు చూడలేకపోవటమా ఇదంతా? లేక అడిగిన ప్రశ్నలకు జవాబులివ్వలేకపోవటమా?" తన పెదవులమీదికి నవ్వు రాబోయింది.

అతడు చూసీ చూడనట్టు ముఖంపెట్టాడు.

''అయితే మన మింకా భార్యాభర్తలం కాలేదుగా స్నేహితులుగా ఉందాం పోనీ ''

తల అడ్డంగా తిప్పాడు.

''దేనికి తలతిప్పటం? భార్యా భర్తలం కాలేదుగా అన్నమాటకా రెండోదానికా?''

అతడు తల దించుకున్నాడు.

"సరే పోనీయండి మనమధ్య ఎటువంటి బాంధవ్యం ఉంటేనేం ? స్నేహితులుగా విడిపోదామా ? పోనీ ఈ మాట ఇష్టమేనా ?''

తనముఖం కనబడకుండా గోడవైపుకు తిప్పాడు.

విసిగిపోయినట్టు కనబడకుండా ఆ ప్రసంగం అంతటితో ముగించింది తన జీవితభారమంతా దేవుడిమీద పెట్టినట్టుగా నిట్టూర్చి పడుకుంది.

కాని తెల్లవారుఝామున అతడు తన జీవితంలో అక్షరాలా అడుగు పెట్టాడు. మధురమయిన ముద్రలు వేశాడు. అంతలో తన ఆశలు మోసులెత్తాయి. మధుకలశం చేతికి చిక్కిందనుకుంది. ఆ మరుక్షణంలో నీవెవరివో అన్నట్టు చూశాడు. తనవైపు చూసీ చూడకుండా సెలవు లేదని వెళ్లిపోయాడు.

"అమ్మాయీ, ఇల్లు కుదిర్చి నేను ఉత్తరం వ్రాస్తానమ్మా, సిద్ధంగా ఉండు. నేను స్వయంగా వచ్చి నిన్ను తీసుకువెళ్తాను" అన్నాడు మామగారు. పాపం ఆయన నెలయినా తిరక్కుండా చనిపోయారు

నరేంద్రకు తనెన్నో ఉత్తరాలు వ్రాసింది. తండ్రి కాబోతున్నాడని తెలిపింది. పాప పుట్టిన తరువాత వచ్చి చూసిపొమ్మన్నది. పేరేం పెడదామని అడిగింది. పాప బోర్లా పడుతున్నట్టూ-కూర్చుంటున్నట్టూ పాకుతున్నట్టూ వ్రాసింది నవ్వు లొలకపోస్తున్న పాప ఫొటోలు తీసి పంపించింది. పేరు లేకపోతే బాగుండదని అంతా మంజుల అని పిలుస్తున్నారని వ్రాసింది. దేనికీ జవాబు లేకపోతే అక్కడ లేడేమోననుకుంది. కాని ఆనంద్ తెచ్చిన కబురు–మీరజ్ అమెరికన్ హాస్పిటల్లో కంటి వైద్యుడుగా ఉన్నాడని.

తీరా బిడ్డను ఎత్తుకుని గడపలో కాలుపెడితే ముఖం తప్పించాడు.

"పదకొండు గంటలు కావొచ్చింది. ఈ ఆనంద్ ఎటో వెళ్లాడు. ఇక్కడ ఒక్కళ్లకయినా బుర్రలు పనిచేయటంలేదు. పదండి మనం పోదాం" అనిల్ టాక్సీ తీసుకువచ్చాడు.

కలలో నడిచినట్టుగా వచ్చి కారులో కూర్చుంది సుమన బిడ్డతో. చందా వర్కరు విసుక్కుంటూ వచ్చి సుమన పక్కన కూర్చున్నాడు.

దారిలో ఎవరూ మాట్లాడలేదు. ఇల్లు చేరగానే ఎవరి పక్కలు వాళ్లు చేరుకున్నారు.

చీకట్లో కళ్లు చీలికలు చేసుకుని నరేంద్రతో గడిపిన మూడురోజులను జ్ఞాపకం చేసుకుంటోంది సుమన

అతడి పంతం రెండేళ్లా ? జీవితాంతమా ?

అంతలో మంజు లేచింది. పాలు తాగించి మంజును నిద్రపుచ్చేటప్పటికి రాత్రి ఒంటిగంట దాటింది. ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది సుమనకు.

## 3

సినిమా చూస్తూచూస్తూ ఎడమపక్కకు తిరిగాడు నరేంద్ర. దీపాలు లేకపోయినా తనపక్కన కూర్చున్నది ఆనంద్‌గా గుర్తుపట్టాడు. మనసు తుళ్లిపడ్డట్టయింది. ఆనంద్ చిన్ననాటి నేస్తం. ప్రాణం ఇస్తాడు. అతడిని చూస్తే తల్లి దండ్రులనూ అన్నదమ్ములనూ చూసినంత తృప్తి కలుగుతుంది. కాని పెళ్లయినప్పటినుంచీ ఆ తీయటి స్నేహబంధంలో కొద్ది మార్పు వచ్చింది. ఈ ఆనందే సుమన తన బంధువంటూ పెళ్లిమాటలు తన తండ్రితో నడిపాడు. పిల్ల

చాలా అందమయిందనీ తెలివైనదనీ తనను మురిపించటానికి ప్రయత్నించాడు. తను వైముఖ్యం చూపినా ఆగకుండా మాటలు సాగించాడు. కొన్ని సందర్భాలలో తననెదిరించాడు. తనకు మనసు విరిగిపోవటం మొదలుపెట్టింది. ఎంత స్నేహితుడయితే మాత్రం ఆంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకుంటుంటే ఏంచెయ్యాలి ?

ఆనంద్‌ను గుర్తుపట్టినా పట్టనట్టే ఊరుకున్నాడు.

"నరేందర్, నరేందర్" చేత్తో తట్టాడు ఆనంద్.

"నీవు ఊళ్లోనే ఉన్నావా ? లేవని హాస్పిటల్లో చెప్పారే ?"

"అయితే ఆరాలు తీశావన్నమాట! ఏం ? ఎందుకు కావలసివచ్చింది ?" తన పక్కగా కూర్చున్న కస్తూరి వినకుండా అన్నాడు.

"నీ సంగతి అడగకూడదా ? నీ సంగతి ఎవరికీ అక్కర్లేదనుకున్నావా ?"

"నాయనా–మనం సినిమా చూస్తున్నాం. గట్టిగా అరవకు."

"మరి నీవెక్కడ దొరుకుతావని ?"

"బాబ్బాబు, ఆపు. బైటికి పోదాం పద–అంతగా మాట్లాడాల్సిన విషయాలుంటే" బ్రతిమిలాడుతున్నట్టుగా ముఖంపెట్టాడు నరేంద్ర.

"అయితే పద" లేచాడు ఆనంద్.

"కస్తూరీ, ఇప్పుదేవస్తాను" లేచాడు నరేంద్ర. ముందు ఆనంద్–వెనక నరేంద్ర–మెల్లగా బైటికి వచ్చారు.

"ఏమిటి సంగతి ? సి. ఐ. డి. పని బాగానే చేస్తున్నావు" విసుక్కున్నాడు నరేంద్ర.

"చందావర్కరు, సుమన, అనిల్ వచ్చారు. నీ యింట్లో ఉన్నారు."

"తెలుసు."

"తెలుసా ! అందుకేనా సెలవుపెట్టి దాక్కున్నావు ?" నిలతీసినట్లుగా ప్రశ్నించాడు.

"ఇందులో దాక్కోవటమేముంది ? వాళ్లు వస్తారని నాకేంతెలుసు ? వచ్చినా నాకేం సంబంధంలేదు."

"ఎట్లా లేకుండా పోతుంది ? ఇదేం చాటుమాటు వ్యవహారమా ? పదిమంది చూస్తూఉండగా జరిగిన పెళ్లి. నీవు కాదంటే పోతుందనుకున్నావా ? కోర్టు ఉన్నది మన ఎదుట. మర్చిపోకు. కారణాలు చూపించాలి."

"నీకర్థంకాదులే" విసుకుగా పిక్చర్ హాల్లోకి వెళ్లిపోయాడు నరేంద్ర.

అతడు వెళ్లినవైపే పిచ్చివాడిలా చూసి పదినిమిషాల తరువాత వెళ్లి అతడి పక్కనే కూర్చున్నాడు ఆనంద్.

సినిమాఅయిపోగానే, నరేంద్ర కస్తూరి గుంపులను తప్పించుకుంటూ వెళ్లి స్కూటరెక్కారు. అంతవరకూ ఒకకన్ను వాళ్లమీదనే ఉంచిన ఆనంద్ ఒక టాక్సీ ఎక్కి సంగ్లీలో ఉన్న పినతల్లి యింటికి వెళ్లాడు.

"ఇంత రాత్రివేళ ఎక్కడినుంచి వస్తున్నావు" కళ్లు నులుపుకుంటూ వచ్చి తలుపు తీసింది.

"చందావర్కరు సుమన వాళ్ళు వచ్చారు. వాళ్లతో వచ్చాను" దగ్గరలో ఉన్న కుర్చీమీద కూర్చుంటూ మంచినీళ్లడిగాడు.

"నరేందర్ ఉన్నాడా ? మీకు కనబడ్డాడా ?" ఆమె మాట్లాడుతూనే ఆనంద్‌కు పక్క ఏర్పాటుచేసింది.

"భోజనం చేశావా ?"

"భోజనం కాకపోయినా అదీ ఇదీ చాలా తిన్నాను." అంటూ పక్కమీద వాలాడు.

ఆమె దీపమార్పి "నరేందర్ కలిశాడా ?" మళ్లీ ప్రశ్నించింది.

"వాళ్ళు వస్తున్నారని నరేందర్‌కు చెబితే ఇష్టపడడని చెప్పకుండా తీసుకు వచ్చాను. తీరా యింటికి వచ్చినతరువాత వారం రోజులు సెలవు పెట్టినట్లు తెలిసింది." అతడి ఉత్సాహమంతా నీళ్ళు కారిపోయినట్లు కంఠధ్వని పట్టిస్తోంది.

"నీవు అనవసరంగా తలదూర్చావు. నీకు మాట దక్కదనిపిస్తోంది."

"ఎందుకు ? నీకట్లా ఎందుకనిపిస్తోంది ?" ఉలిక్కిపడ్డాడు ఆనంద్.

"మన మేడమీద కాపురం ఉన్నవాళ్లమ్మాయి మెడికల్ కాలేజీలో చదువు తోంది కాలేజీలో అతడిని గురించి ఏమేమిటో చెప్పుకుంటూరట."

"ఏమని ?" దిగ్గున లేచి కూర్చున్నాడు ఆనంద్.

"నోటితో అనటానికి కూడా బాధగా ఉంది. కాలేజీలో చదువుకునే పిల్ల నెవరినో పెళ్లిచేసుకున్నాడట."

"ఎప్పుడంటావు ?" అదిరిపడ్డాడు.

"ఎప్పుడయిందో తెలియదు—కాని—అయిన మాట నిజమంటున్నారు."

ఆనంద్‌కు గుండెలో వేయి మేకులు దిగగొట్టినంత బాధ కలిగింది. తెల్లవార్లూ ఇంటికప్పుకేసి చూస్తూ గడిపాడు. అతడి చెవులలో నరేంద్ర అన్న కస్తూరి శబ్దం గింగుర్లెత్తిస్తున్నది. పెళ్లి చేసుకున్నాడా ? ఎప్పుడు ?

ఆనంద్ పొద్దున్నే లేచి పినతల్లి యిచ్చిన చపాతీ కూర తిని టీ తాగాడు. వాకిటిముందు వరండాలో కుర్చీలాక్కుని పేపరు పాతదయినా కొత్త పేపరు మాదిరిగా ఆద్యంతమూ చదవటం మొదలుపెట్టాడు. ఎనిమిది గంటలయిన తరువాత కాలినడకన బయలుదేరి ఆడపిల్లల హాస్టల్‌కు చేరుకున్నాడు.

"మా బంధువుల అమ్మాయి ఇక్కడ హాస్టల్లోచేరి చదువుతున్నదని తెలిసింది. పేరు కస్తూరి. నేనా అమ్మాయిని చూడాలి" అన్నాడు వార్డెన్‌తో.

"ఎన్నో సంవత్సరం చదువుతున్నది ?" అడిగింది వార్డెన్.

తల గోక్కున్నాడు ఆనంద్ అతడు ఆ సంగతి ఆలోచించలేదు.

"వివరాలు తెలియనిదే ఏ కస్తూరినని పిలవగలను ? పదిమంది ఉన్నారు."

"పెళ్లయిన కస్తూరి" అన్నాడు ఏదో దారి దొరికినట్టుగా.

"పెళ్లయిన కస్తూరా ? ఒక్క అమ్మాయికే పెళ్లయింది."

"ఆఁ ! ఆ కస్తూరేనండి. నేను చాలా దూరంనుంచి వచ్చాను. ఆమెను చూసి గాని ఇక్కడినుంచి వెళ్లను" అన్నాడు.

"మీరు కస్తూరి కస్తూరి అంటుంటే నా కర్థంకాలేదు! ఆమె కస్తూరి కోరట్కర్. మిసెస్ నరేంద్ర." ఏమనుకుంటున్నారో జాగ్రత్త అన్నట్టు చూసింది.

గుండె ఝల్లుమన్నది ఆనంద్‌కు. అయితే తను విన్నదీ - ఊహించిందీ నిజమేనన్నమాట. మనసు కలవరపడినట్టూ - ఆందోళనగా ఉన్నట్టూ పైకి కనబడనీయకుండా సర్దుకుని "ఆమెనే నేను చూడాలనుకున్నది" అన్నాడు

"వాళ్ల బాచ్ ఒక అరగంట క్రిందటే కాలేజికి వెళ్లింది. ఆమెను కలుసుకోవాలంటే సాయంత్రము మూడుగంటల తరవాత రండి" అని తనపని చూసుకోవటం మొదలుపెట్టింది.

తలవంచుకుని గేటుదాటి ఏంచేయటానికీ తోచక బజార్లన్నీ తిరిగి పన్నెండు గంటలకు ఇల్లుచేరుకున్నాడు ఆనంద్. భోజనం కాగానే నిద్ర ముంచుకుని వచ్చింది.

టీ కప్పు ఖాళీచేసి పింతల్లి చేతికిస్తూ "నరేందర్ పెళ్లిమాట నిజమే పిన్నీ. సుమన పెళ్లికాకముందే అయిందంటావా ?" అన్నాడు.

"ఎప్పుడయిందోగాని ఈ మధ్యనే బయటపడ్డది. ఈ అమ్మాయి తండ్రి ఇప్పుడు స్టేట్సులో ఉన్నాడు. ఈ చదువుకాగానే ఈ అమ్మాయినికూడా

పిలిపించుకుంటాడట. ఈ మధ్యనే అంటే నాలుగేళ్ల క్రిందటే వెళ్లాడు ఈ అమ్మాయిని హాస్టల్లో ప్రవేశపెట్టి. పిల్లకు తల్లిలేదు.''

''అయితే తండ్రి వెళ్లిన తరువాతనే పెళ్లయుందంటావా ?'' ఆశ్చర్యం వేసింది ఆనంద్‌కు.

''కోర్సు పూర్తికాకుండానే పెళ్లి చేస్తాడా ? ఈ కోర్సే కాకుండా పైచదువులు కూడా చెప్పించాలనుకున్నాడట తండ్రి. ఈ పెళ్లి ఆయన వెళ్లినతరువాత జరిగిందేననిపిస్తోంది.'' ఆమె తీరికగా గోడకానుకుని పీటమీద కూర్చుంది.

''తండ్రికి తెలియకుండా అయిందా ? ఆయన సమ్మతితో ఇక్కడ జరిగిందా? ఒక్కతే ఇంతపని చేసిందంటావా పిన్నీ ?'' మాటల్లోకి పింతల్లిని దింపాడు ఆనంద్.

ఇటువంటి కబుర్లు ఎవరికయినా రుచిగానే ఉంటాయి. కుతూహలాన్ని మనసు లోనే అదుముకుంటారు కొందరు. కాని ఆనంద్ పినతల్లి కుసుమాబాయి దాచుకో లేదు.

''ఆ మధ్య ఒక పుకారు బయలుదేరిందిరా. ఈ అమ్మాయి విషయంలో కాలేజిలో ఏదో గొడవ జరిగిందట. ఒక సాయంకాలపువేళ ఈ అమ్మాయి బజారునుంచి తన స్నేహితురాలితో వస్తుంగా నలుగురు విద్యార్థులు చెయ్యిపట్టి సందులోకి ఈడ్చుకుపోయారనీ, ఆ వెంట ఉన్నపిల్ల అరిచి నలుగురినీ పోగు చేసిందనీ, ఆ విద్యార్థులు ఆ పిల్లను వదిలిపెట్టి పారిపోయారనీ చెప్పుకున్నారు. ఇది జరిగాక నరేందర్ ఆ పిల్లను రిజిస్టర్ మ్యారేజి చేసుకున్నాడని అంటారు.'' అంతా చెప్పిన తరువాత ఆమెకు హృదయం తేలికపడినట్లయి గుండెమీద చేత్తో రాసుకుంది.

ఆనంద్‌కు తన సమస్యకు దారిదొరికినట్టూలేదు – దొరకనట్టూలేదు. సూత్రానికి మొదలూ చివరా అంతుపట్టలేదు. బరువుగా నిట్టూర్చి బట్టలు మార్చుకుని హాస్టలువైపుకు వెళ్లాడు.

ఆనంద్‌ను చూడగానే వార్డెన్ కస్తూరిని పిలిపించింది.

సామాన్యమైన వాయిల్ చీరె కట్టుకుని చెదరిన తలవెంట్రుకలతో కస్తూరి ''నమస్తే'' అంటూ ఆనంద్ ముఖంలోకి చూసింది.

రంగు చామనఛాయే గానీ ఆకర్షణీయమయిన కనుముక్కు తీరు – డాక్టరు కోటు పుస్తకాలు మోయగలదా అని సందేహం కలిగేటంతటి సన్నమూ – అంత



పొడుగూ కాక అంత పొట్టీ కానటువంటి దేహమూ - పెద్ద పెద్ద కళ్లతో ఆనంద్‌నే కన్నార్పకుండా చూస్తూ నిలబడ్డది కస్తూరి.

''కూర్చోండి'' తన కెదురుగా ఉన్న కుర్చీచూపించాడు ఆనంద్.

ముళ్లమీద కూర్చున్నట్టుగా కూర్చుంది కస్తూరి.

"నరేందర్ తల్లి నాకు అక్కవరస. ఇక్కడికి వస్తుంటే ఈ జాకెట్టు బట్ట, మిఠాయి నీకు ఇవ్వమని ఇచ్చింది'' ఆమె చేతికి అందించాడు.

కస్తూరి ముఖంలో అతడికి ఏ భావమూ గోచరించలేదు. నిర్వికారంగా ఉంది. వాటినందుకుని ఏమనాలో తెలియక "థాంక్స్'' అన్నది.

మీరింకా హాస్టల్లోనే ఉన్నారా ? మీరజ్ హాస్పిటల్లో ఆయన కౌక క్వార్టర్సు ఇచ్చారుగా. అక్కడే ఉంటారనుకుని వెళ్లాను. ఎవరూ లేరు.'' సామాన్యంగా అన్నట్లే అంటున్నాడుగాని ఆమె ముఖంమీదనే దృష్టినంతా నిలిపిఉంచాడు.

''నేనెప్పుడూ హాస్టల్లోనే ఉంటాను. నేనెప్పుడూ ఆయన క్వార్టర్సులోకి వెళ్లను." తలవంచుకునే మెల్లగా అన్నది.

''అయితే ఆయనే వస్తూంటారా ఇక్కడికి ?'' జవాబుకోసం అసహనంగా చూశాడు.

"ఇది ఆడపిల్లల హాస్టలు కదా. మగవాళ్లు లోపలికి రాకూడదు. విజిటర్సు వచ్చి ఈ గదిలో వార్డెన్ అనుమతితో మాట్లాడవచ్చు, అంతే. ఆయన కూడా నెలకొకసారి వస్తారు, పలకరించి వెళ్తారు" అన్నది. మళ్లీ ఆమె ముఖంలో కంఠ ధ్వనిలో నిర్వికారమే కనుపించింది ఆనంద్‌కు.

"అలాగా. మా అక్క ఇక్కడి సంగతులు అడుగుతుంది కనుక వచ్చాను. నేనేం శ్రమ ఇవ్వలేదు కదా, మరి వస్తాను" అంటూ లేచాడు ఆనంద్.

అతడికంటె ముందుగానే ఆ గదిదాటి గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్లి పోయింది కస్తూరి.

అనిల్ సుమన చందావర్కర్ తనను గురించి ఏమనుకుంటున్నారో ? క్వార్టర్సులో దించి ఎటో వెళ్లిపోయాడని తిట్టుకుంటున్నారేమో ? ఇప్పుడు వాళ్ల దగ్గరికి వెళ్లటమా లేక పినతల్లి ఇంటికి వెళ్లటమా అన్న ఆలోచన తెగక మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ హాస్టలు ఆవరణం దాటాడు ఆనంద్.

## 4

''డాక్టర్ నరేంద్ర లేకపోతే ఏం ? ముందు ఆయన అసిస్టెంట్సుకు నిన్ను చూపిస్తాను పద'' అన్నాడు డాక్టరు రమణ ఇంటికి వస్తూనే.

'తొందరంటావేం ? మణి వచ్చి నాలుగు రోజులయింది. నరేంద్ర సెలవు పెట్టాడని అంటున్నారు. ఈ లోపల అసిస్టెంట్సు చూస్తే ఏం ? సంగతేమిటో చెబుతారుగా." అన్నాడు అసహనంతో - ఎదురుగా వచ్చిన రాధమ్మతో

"ఏదో జబ్బని అక్కడ తేల్చారట కదా ?" అన్నది రాధమ్మ

"ఇదిగో ! వాళ్లమాట వీళ్లమాట నాతో చెప్పకు. అందరూ మెడిసన్ చదువుతారు కాని - కొందరే నికరమయిన డాక్టర్లుగా తేల్తారు. మణీ ! కాఫీ తాగి మూడుగంటలకు సిద్ధంగా ఉండు" అన్నాడు డాక్టరు రమణ.

మణిని నరేంద్ర అసిస్టెంట్సు ఇద్దరు పరీక్ష చేశారు.

"మీరనుకున్న జబ్బుకాదు. ఒక చిన్న ఆపరేషన్ చేయాలి" అన్నారు.

ఇంటికి రాగానే డాక్టరు రమణ రాధమ్మను పిలిచి "చూశావా ? నేనన్నంతా అయింది. ఏదో పెద్ద జబ్బని భయపడ్డాడు. ఇలాగే తెలిసీ తెలియక రోగులను భయపెడుతూ ఉంటారు డాక్టర్లు. మణీ, నరేంద్ర వచ్చేవరకూ హాయిగా ఇటూ అటూ తిరుగు. అతడు రాగానే ఆపరేషను చేయిస్తాను" అన్నాడు.

చూడామణి మనసు తేలికపడ్డట్టయింది. ఆపరేషన్ గురించి గంపెడు భయంతో వచ్చాడు. జబ్బు మాటేమోగాని తను కళ్లద్దాలతో బాగా కనబడక పోయినా చదవగలుగుతున్నాడు. ఈ ఆపరేషను చేయించుకుంటే బాగా చదువు కోగలుగుతాడు.

డాక్టర్ నరేంద్ర వచ్చేవరకూ నిశ్చింతగా ఇంట్లో ఉన్న పాత ఇంగ్లీషు వీక్లీలూ ఇతర పుస్తకాలూ చదువుతూ కాలక్షేపం చేస్తున్నాడు చూడామణి. విసుగుపుట్టినప్పుడు హాస్పిటల్ చుట్టుపక్కలంతా తిరిగివస్తూఉండేవాడు. బజార్లన్నీ తిరిగి భోజనంవేళకు ఇల్లుచేరుకునేవాడు.

హాస్పిటల్ పక్కసందుగుండా వెళ్లి అరటిపళ్లు బేరం చేస్తున్నాడు చూడామణి. భుజంమీద బరువు పడగానే వెనక్కు తిరిగిచూసి "మీరా" అన్నాడు ఇంగ్లీషులో.

"జ్ఞాపకం ఉన్నాను కదా. మీరింకా ఆపరేషను చేయించుకోలేదూ ?" అడిగాడు అనిల్.

"డాక్టరుగారు ఊళ్లోలేరట. రాగానే చూపించుకుంటాను" అన్నాడు చూడామణి.

"ఏమన్నా పని ఉన్నదా మీకు ? లేకపోతే అలా పోదాం రండి."

ఇద్దరూ నడుస్తూ బయలుదేరి సంగ్లీ వెళ్లారు. హోటల్లో టిఫిన్ తీసుకుని కాలేజి ముందుగా నడుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ల ముందుగా విద్యార్థిని బృందము కోట్లు చేతులమీద వేసుకుని నవ్వుకుంటూ హాస్టల్‌వైపుకు వెళ్లారు.

వాళ్లనొక్కొక్కళ్లనే పరిశీలనగా చూశాడు అనిల్.

"వీళ్లందరికీ ఉద్యోగాలు ? పెళ్లిళ్లు ?" అన్నాడు చూడామణి.

"ఉద్యోగాలూ వస్తాయి, పెళ్లిళ్లూ అవుతాయి." అన్నాడు ముఖము ఒక మాదిరిగా పెట్టి అనిల్.

"కొందరు డాక్టర్లకు పెళ్లి సమస్యేకాదు. మహాలక్ష్మి అని ఒక గొప్ప గైనకాలజిస్టు ఉంది మా ఊళ్లో. ఆమె డెబ్భైఏళ్ల కన్య" అన్నాడు చూడామణి.

"కన్యలూ ఉన్నారు, పెళ్లిళ్లు చేసుకున్న వాళ్లూ ఉన్నారు. ఈ పెళ్లిళ్లు ఉన్నాయే- అన్ని కాలాలల్లో ఒక్కమాదిరిగాలేవు. అందరికీ ఒక్క మాదిరిగాలేవు. కన్యను పెద్దలు ఇస్తామనటం పోయింది - ప్రేమ వివాహాలు జరగటం చూస్తున్నాము. కొన్నికొన్ని కక్కుర్తి వివాహాలు కూడా చూస్తున్నాము. మరి కొన్నిటిని అవసరముకోసం చేసుకున్న వివాహాలనూ చూస్తున్నాము. కొన్నాళ్లకు మనదేశంలో కూడా ఆడపిల్ల కనబడితే పెళ్లిచేసుకోమంటుందేమోనని మగ

పిల్లలు భయపడే రోజులు వస్తాయి చూస్తూఉండండి," అనుభవజ్ఞుడిలా ఉపన్యాసం దంచుతున్నాడు అనిల్

విరగపడి నవ్వాడు చూడామణి.

"ఎందుకా నవ్వు ?" తెల్లబోయినట్టు చూశాడు అనిల్

"ఎందుకా ? మనిద్దరం ఇంకా బ్రహ్మచారులం. పెళ్లిళ్లను గురించీ ఆడపిల్లలను గురించీ అలా మాట్లాడకూడదు."

"నేను సరేగాని మీరుకూడా బ్రహ్మచారులేనా ? నలభై సంవత్సరాలుంటాయేమో కదూ ?'' అన్నాడు ఆశ్చర్యపడుతూ అనిల్.

"అవును. ఇంకా పెళ్లి చేసుకోవటానికి తటపటాయిస్తున్నాను."

"ఎందుకు ?"

"ఎందుకేమిటి ? పెద్దవాళ్లు చేస్తే చటుక్కున అయిపోతుంది. మనమే వెతుక్కొని చేసుకోవాలంటే అన్నీ అనుమానాలే వస్తున్నాయి ఒకటిరెండు సంబంధాలు అంతా నిశ్చయమైన తరువాత చిట్లిపోయాయి" అన్నాడు చూడామణి పెదవులు చప్పరిస్తూ.

"కొందరు మంచి ఎన్నికే చేసుకుంటారు."

"ఆ పని నావల్ల కాలేదు "

అంతలో వాళ్లముందునుంచే టాంగాలో ఇద్దరమ్మాయిలు కబుర్లు చెప్పుకుంటూ వెళ్లారు.

"అదుగో చూడండి. అందులో కూర్చున్న అమ్మాయిలలో ఒకరు ఎమర్జన్సీ పెళ్లిచేసుకున్నారు." అనిల్ టాంగాలో కూర్చున్న కస్తూరివైపు చూపించాడు.

"అంటే ?"

"అంటే ఏంలేదు. ఆ అమ్మాయి ఏదో చిక్కులో పడ్డది. భర్త అనే అంగరక్షకుడు కావలసివచ్చాడు. ఒకమహానుభావుడు వచ్చి ఆదుకుని పెళ్లిచేసుకున్నాడు '' దూకుడుగా అన్నాడు అనిల్.

తిరిగి ఇద్దరూ ఏవో కబుర్లు చెప్పుకుంటూ మెల్లిగా మీరజ్ చేరుకున్నారు.

ఆ రాత్రి భోజనాలయిన తరువాత అక్క దగ్గర కూర్చుని తిరుగు ప్రయాణం సంగతి ఎత్తాడు అనిల్.

"ఇక్కడ పెద్ద డాక్టరమ్మ ఒకరు ఉన్నారు. ఆమె ఒంటరిగా ఉంటోందిట. సూపరెంటుతో మాట్లాడి నాకు రెండువందల రూపాయల ఉద్యోగమిప్పిస్తానంది. తన ఇంట్లో ఒకగదిలో ఉండమన్నది. చూడు అనిల్, నేనిక్కడ ఉద్యోగం

చేస్తూ కొంతకాలం ఉంటాను." తమ్ముడి తలనిమురుతూ కన్నీళ్ళతో అర్థించింది సుమన.

"ఎవరూ లేనట్టుగా ఆ డాక్టరుదగ్గర ఉంటావా?" తలఎత్తి అక్క ముఖంలోకి చూశాడు.

''నేను మళ్లా ఇంటికి రాలేనురా? నా ముఖంచూస్తున్నకొద్దీ నాన్నకు విచారం మరీ ఎక్కువవుతుంది. నేనది చూడలేను.'' ముఖం పక్కకు తిప్పుకుని కళ్లు చేత్తో తుడుచుకుంది.

అనిల్‌కు పట్టుదల ఎంత ఉన్నదో జాలి అంత ఉంది. సుమన కన్నీళ్లు చూడలేక మెలికలు తిరిగాడు.

పొద్దున్నే లేచి ఇద్దరూ సుమన చెప్పిన డాక్టరు ఇంటికి వెళ్లారు. ఆమె అప్పుడే కాఫీ టిఫిన్ తీసుకుని విరామంగా కుర్చీలో కూర్చుని మెడికల్ జర్నల్ తిప్పి చూస్తున్నది. వీళ్లిద్దరిని చూడగానే సాదరంగా ఆహ్వానించింది.

సుమన తమ్ముడిని ఆమెకు పరిచయం చేసింది. అనిల్ ఆమెతో కొంతసేపు మాట్లాడాడు. ఒకపోస్టు ఉన్నమాట నిజమేననీ సూపర్నెంటుతో చెప్పి ఇప్పిస్తానని అన్నది డాక్టరు. తన ఇల్లంతా చూపించింది. ఒక పక్కగా ఒక పెద్దగదీ దానికి ఆనుకుని నీళ్లగదీ ఉన్నాయి. ఆ ప్రత్యేకమయిన గది సుమనకు ఇస్తానన్నది డాక్టరు.

ఆమె ఆప్యాయంగా వాళ్లిద్దరికీ టీ బిస్కెట్లు ఇచ్చింది.

ఆమె ఆదరానికి కృతజ్ఞతలు తెలిపి సుమన అనిల్ బైటికి వచ్చారు.

కొంతదూరం వచ్చిన తరువాత ''ఈ డాక్టరు పరంజ్యోతిని చూస్తే నాకు మన ఊళ్లో మన యింటివెనక ఉన్న చుక్కమ్మ జ్ఞాపకం వస్తోంది. పొట్టిగా – చిన్న కళ్లు - పెద్దనుదురు - పొడుగు ముక్కు–చుక్కమ్మే అంతా.'' నవ్వాడు. సుమన కూడా అతడితోపాటు నవ్వింది

"చుక్కమ్మవంటి రూపమేగాని మనసు ఎవరికీ వద్దు బాబూ? - ఆమెకెంత తెలివి ఉన్నదో అంత క్రౌర్యము ఉన్నది." ఇద్దరూ నవ్వుకున్నారు

ఆ మరునాడు తండ్రితో అనిల్ ఊరికి ప్రయాణమయ్యాడు. సుమన స్టేషన్‌కు వెళ్లింది.

అంతవరకూ బిగబట్టుకుని ఉన్న చందావర్కరు రైలు ఎక్కబోతూ 'సుమా' అంటూ బిగ్గరగా ఏడ్చేశాడు.

రెప్పలతో కన్నీళ్లను అదుముకుంటూ తండ్రిని రైలెక్కించి సర్ది కూర్చోబెట్టింది. అనిల్ ముఖం ఎర్రగా చేసుకుని తండ్రి పక్కనే కూర్చుని ఆయన భుజంమీద చెయ్యివేశాడు ఆనంద్ జంకుతూ పక్కనే నిలబడ్డాడు.

"అనిల్ ! నిన్నిట్లా పంపిస్తాననుకోలేదు. నేనంతా పరిష్కారం చేస్తానని మిమ్మల్నందరినీ నమ్మించి బయలుదేరదీశాను నా చేతనైనంతవరకూ ప్రయత్నం చేస్తాను అనిల్ నన్ను క్షమించు'' గద్గం పట్టుకున్నాడు ఆనంద్

"నీవు సుమనక్కను కనిపెట్టుకుని చూడు. నా పరీక్షలు కాగానే నేను వచ్చేస్తాను మంజు జాగ్రత్త" మరీ మరీ చెప్పి కళ్ళు తుడుచుకున్నాడు అనిల్

చందావర్కరు కళ్ళు తెరచి సుమనను చూడనేలేదు. ఆమె కనబడకుండా కండువాతో కళ్ళు కప్పుకున్నాడు

రైలు కదిలిపోగానే సుమన, ఆనంద్ క్వార్టర్సుకు తిరిగి వచ్చారు. సుమన ఆనంద్‌తో తను డాక్టరు పరంజ్యోతి యింటికి మారుతున్నట్టుగా చెప్పింది ఆనంద్ ఆమెను సామాన్లతో డాక్టరు ఇంటికి చేర్చాడు, ఇంటికి తాళంవేసి నౌకరుచేతికిచ్చి—"అందరూ వెళ్లిపోయారని డాక్టర్‌సాబ్ వస్తే చెప్పు" అని సంగ్లీ బయలుదేరాడు ఆనంద్.

డాక్టరు పరంజ్యోతి చూపించిన గదిలో సుమన తన బెడ్డింగు పరుచుకొని మంజు పక్కన పడుకుంది. ఆ రాత్రికి భోజనాన్ని గురించిన సమస్యలేకుండా కాంటీనులో తను చపాతీ తీసుకుంది మంజుకు పాలు రొట్టె ఇప్పించింది తండ్రి ఇంటికి వెళ్లిన తరువాత సుమనకు మనసు ఒకవిధంగా తేలికపడ్డది. ఇప్పుడు తను ఇబ్బందులు పడుతుంటే చూసి కన్నీరుపెట్టేవారు లేరు. తండ్రి ఇచ్చిన ఆరువందల రూపాయలు భద్రంగా పర్సులో పెట్టుకుంది. డాక్టరు పరంజ్యోతి ఇంట్లో ఆ పెద్దదిక్కు చాటున ఏ చిన్న ఉద్యోగమయినా చూసుకుని కాలం గడపటమే ప్రస్తుత కర్తవ్యమనుకుంటూ కన్ను మూయటానికి ప్రయత్నిస్తోంది

చేతివేళ్లతో తలుపుకొట్టిన శబ్దమయితే లేచి తలుపు తీసింది

"సుమనా డియర్. రాత్రికి భోజనం నాతో చెయ్యాలి" అంటూ లోపలికి వచ్చింది డాక్టర్ పరంజ్యోతి

"క్షమించండి నేను వచ్చేటప్పుడే కాంటీనులో భోజనంచేసి వచ్చాను" చీరె సవరించుకుంటూ నిలబడ్డది సుమన.

''పాప ?"

పాపకూడాను."



"నో. నో. అలా వీల్లేదు. నాతోకూడా ఏదయినా తీసుకోవాలి. రా
బలవంతంగా సుమనను తీసుకువెళ్ళింది. ఇద్దరూ బల్లదగ్గర కూర్చున్నారు
నౌకరు డాక్టరు పరంజ్యోతికి ఆమె మామూలు భోజనం తీసుకువచ్చాడు. ఆమె
బలవంతమ్మీద సుమన కప్పుతో పాలు తాగింది. డాక్టరు చాలా ఉల్లాసంగా
కబుర్లు చెప్పింది. తనకు ఒక తమ్ముడు అక్క చాలా దూరదేశంలో ఉన్నారు.
వాళ్ళనుచూసి ఐదు సంవత్సరాలయిందని విచారంగా చెప్పింది. ప్రతి వారం
ఉత్తరాలు వ్రాసుకుంటారని గర్వంగా అన్నది.

ఇద్దరూ డ్రాయింగు రూములోకి వచ్చారు. డాక్టరు రేడియో ట్యూను చేసింది.
రాత్రి పడుకోబోయేటప్పుడు ఆమెకు తన డైరీ తెరిచి చూసుకోవటం అలవాటు.
డైరీ అంతా ఒకసారి తిరగేసి చూసుకుని పాకెటులోనుంచి ఒకచిన్న ఫోటో తీసి
తదేకంగా ఐదు నిమిషాలపాటు చూసి తిరిగి పాకెటులో పెట్టేసింది. దాని
తరువాత ఆమె ముఖం గంభీరంగా ఉండటం-కళ్ళలో తడి సుమన గమనించింది.

ఆ తరువాత డాక్టరు సుమన ఊరి సంగతులన్నీ అడిగి తెలుసుకున్నది
చివరకు సుమన ఆ ఊరు వచ్చిన కారణమడిగింది చాలా సున్నితంగా

"మార్పుకోసం ఈ ఊరు వచ్చాను. ఉన్నంతకాలం ఏదో చిన్నదయినా
ఉద్యోగం చేయాలని ఆశ "

ఇద్దరికీ సంబంధించని కబుర్లు ఎన్నో చెప్పుకున్నారు. లేచి తన గదిలోకి వెళ్ళబోయేముందు "నన్ను మమ్మీ అని పిలవరాదూ? నాకెంతో ఆనందంగా ఉంటుంది" అన్నది డాక్టరు వేడుకుంటున్నట్టుగా

"మీకంత కోరికగాఉందా మమ్మీ అని పిలిపించుకోవాలని?" కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా అడిగింది సుమన.

"అవును డార్లింగ్. నాకు నీ ఈడు కూతురు ఉండొచ్చు. మాకు వయసు బైటికి కనబడదు. ఎందుకంటే పెళ్ళిళ్ళు కాలేదు కనుక మీకట్లా కాదు. ఎప్పుడూ వయసు లెక్కబెట్టినట్టుగా పెళ్ళి-ఏటా ఏటా కాన్పులూ-పిల్లలనుబట్టి తల్లి ఏళ్ళు లెక్కపెట్టవచ్చు" తమ నాగరకత సంప్రదాయం నిస్సారమన్నట్టు పెదవులు వంకరగా తిప్పింది డాక్టరు.

ఆమెవంకే ఆశ్చర్యంగాచూస్తూ నిలబడిపోయింది సుమన. పెళ్ళిచేసుకుని తను ఏం సుఖపడింది కనుక? పెళ్ళిళ్ళు చేసుకోగానే సరా? జీవితాలలో పెళ్ళి అక్షరాలా అన్వయం కావద్దూ?

"చదువు కాగానే పెళ్ళిచేసుకుందామంటే...ఏదో...ఏదో...ఇలా జరిగి పోయింది కాలం." తల వంచుకుని ఇటునుంచి అటూ-అటునుంచి ఇటూ పచార్లు చేసింది డాక్టరు పరంజ్యోతి.

"మీకు స్వాతంత్ర్యము ఎక్కువకదూ డాక్టర్. పెళ్ళి విషయంలో మా కెక్కువ స్వాతంత్ర్యం లేదు. పెళ్ళి చేసుకుతీరాలి అంటారు తల్లిదండ్రులు. ఎన్నిక చేసుకునే స్వాతంత్ర్యం కొందరు తల్లిదండ్రులు ఇస్తారు. కొందరు అదీ ఇవ్వరు. ఏదయినా మొత్తమ్మీద ఆడపిల్ల పెళ్ళిచేసుకునే తీరాలంటారు, మాలో" అన్నది సుమన.

"ఒకవిధంగా చూస్తే అదే సరైన నిర్ణయమనిపిస్తున్నది. మనకు స్వాతంత్ర్యము ఉన్నప్పటికీ ఎంతమంది దాన్ని సద్వినియోగం చేస్తున్నారు? వ్యక్తి స్వాతంత్ర్యం అన్నమాట ఎంతమందికి అర్థమయింది? జీవితాన్ని చక్కబరుచుకోవటం అందరికీ చాతనవునా? సంప్రదాయాన్ని ఎగరగొట్టి పారవేయటం సులభం కాని--దాన్ని కాలదన్ని బాగుపడ్డవాళ్ళు చాలా తక్కువమంది కనిపిస్తారు నా కళ్ళకు." డాక్టరు పరంజ్యోతికి సిగరెట్లు తాగే అలవాటుంది. చాలా సేపటినుంచీ అణుచుకుంటున్నది. చివరకు- "డియర్, నేను సిగరెట్టు తాగితే నీకేమయినా అభ్యంతరమా?" బల్లమీదఉన్న పాకెట్ అందుకుంటూ అభ్యర్థనగా అన్నది.

"అయ్యో, డాక్టర్, మీకు నా అభ్యంతరమేమిటి?" సిగ్గుపడింది సుమన.

డాక్టరు పరంజ్యోతి సిగరెట్టు వెలిగించి రెండు దమ్ములు పీల్చి "అయితే డార్లింగ్, మీ ఆయన ఎట్లా ఉంటాడు? ఎక్కడున్నాడు?" ప్రశ్నించింది.

సుమనకు పిడుగుపడ్డట్టయింది. వణుకు పుట్టింది.

"పై చదువులకు విదేశాలకు వెళ్ళారు" తొణక్కుండా బెణక్కుండా నోటికి వచ్చినమాట అనేసింది.

"ఏమిటి? డాక్టరా? ఇంజనీరా?'' కుతూహలం పెరిగింది డాక్టరు పరంజ్యోతిలో.

"ఇంజనీరు'' మరో పెద్ద అబద్ధం ఆడేసింది.

కొంతసేపు ఏవో పిచ్చాపాటి మాట్లాడుకుని గుడ్‌నైట్ అంటూ ఎవరి గదులకు వాళ్ళు చేరుకున్నారు.

మరునాడు ఉదయం ఎనిమిదిగంటలకు సుమనను వెంటతీసుకుని డాక్టరు పరంజ్యోతి సూపర్నెంటు దగ్గరికి వెళ్లింది.

ఆ పోస్టులో పనిచేస్తున్న ఆయన ఆరునెలలు సెలవుపెట్టాడు కనుక ఆ ఆరు నెలలూ సుమనకు ఇస్తానన్నాడు. రెండువందల పాతిక జీతం. వాళ్ళతో మాట్లాడుతూ ఆర్డర్సు టైపు చేయించి ఇచ్చాడు.

సుమనకు కొండెక్కినంత సంతోషం కలిగింది. అందుకు బాధ్యురాలయిన డాక్టర్ పరంజ్యోతిపట్ల, అడగగానే ఉద్యోగమిచ్చిన సూపర్నెంటుపట్ల కృతజ్ఞత కొద్దీ ఎనలేని గౌరవము కలిగింది.

నాలుగు అంగల్లో గదికి చేరుకుని నౌకరు చేతిలోనుంచి బిడ్డను తీసుకుని ముద్దుపెట్టుకుంది. సంతోషంకొద్దీ గుండెకు హత్తుకున్నది. డాక్టరు పరంజ్యోతి వంటమనిషితో మాట్లాడి ఒక ఆయాను కుదుర్చుకున్నది. బజారుకు వెళ్ళి ఒక స్టౌ, వంటసామాన్లు కొనుక్కున్నది తన కాపరానికి తగిన ఏర్పాట్లన్నీ చేసుకుని మరునాడు డ్యూటీలో చేరింది.

సుమన ఉద్యోగము గుమస్తా ఉద్యోగం లాంటిది. ఆ హాస్పిటల్లోఉన్న రోగుల సంఖ్య, ఏ రోగికి ఎటువంటి ట్రీట్‌మెంటు జరిగినదీ, ఎన్ని ఆపరేషన్లు జరిగిందీ, ఎన్ని పురుళ్ళు అయిందీ, ప్రతి వార్డునుంచీ వివరాలు తెప్పించుకుని ప్రతినెలా పట్టిక తయారుచెయ్యాలి

వంటచేసుకుని పాపతోకూడా అన్నీ సర్దుకుని ఉద్యోగధర్మం నెరవేరుస్తూ, దినం విడిచిదినం తండ్రికి ఉత్తరాలువ్రాస్తూ ధైర్యాన్ని సడలనివ్వకుండా రోజులు గడుపుతున్న సుమన్న ఒకనెల జీతం అందుకున్నది.

హాస్పిటల్లో ఆమె పేరు సుమన చందావర్కరు.

ఒక్కొక్కరోజు డాక్టరు పరంజ్యోతి అంటుంది "డియర్, ఎందుకు బాధపడతావు? మా నౌకరుచేత పనిచేయించుకో నీవు నాతోపాటు భోజనం చెయ్యి" అంటూ బలవంతంచేస్తుంది.

"వద్దు డాక్టర్ వద్దు. నాకు ఇలాఉంటే కాస్త కాలక్షేపంగా ఉంటుంది. పని తక్కువయితే దిగులు ఎక్కువవుతుంది'' అంటూ ప్రాధేయపూర్వకంగా సుమన వాదిస్తుంది.

ఆ రోజు రాత్రి భోజనాలయిన తరువాత ఇంటిముందు కుర్చీలు వేయించుకుని కూర్చున్నారు. మంజు నిద్రపోయింది కనుక సుమన తీరికగా డాక్టరు పరంజ్యోతితో కబుర్లలోకి దిగింది.

పుచ్చపువ్వులా ఉన్నది వెన్నెల. ప్రకృతంతా చల్లదనం ఆవరించుకున్నది. ఆ ఇద్దరి హృదయాలలో తీయటి భావాలేవో మెదులుతున్నాయి. ఇద్దరూ చాలా సేపు గంభీరంగా కూర్చున్నారు.

ఉన్నట్టుండి "ఒక్కొక్కరోజు ఈ ఉద్యోగానికి రాజీనామా యిచ్చి ఎటైనా వెళ్ళిపోదామనిపిస్తుంది నాకు'' అన్నది డాక్టరు పరంజ్యోతి.

"మీ విజ్ఞానంతో - అనుభవంతో ఎంతోమంది రోగులకు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తున్నారు. ఎంతోమందికి ప్రాణదానం చేస్తున్నారు. మీ ఉద్యోగం అన్ని ఉద్యోగాలకంటె ఘనమైనది. అటువంటి ఉద్యోగాన్ని మానుకుని ఏంచేయాలని? ఎక్కడికి వెళ్ళాలని?" వయసుకు చిన్నదయినా మందలించపోయింది సుమన.

"ఎంతమందికి ప్రాణదానంచేసినా నా మనసుకు తృప్తిలేదు. ఏదో వెలితి పీడిస్తూఉంటుంది" పెదవులు మెలికలు తిప్పింది డాక్టరు.

ఆశ్చర్యంతో ఆమెవంకే చూస్తోంది సుమన.

"ఒకచిన్న పొరబాటువల్ల నా జీవితమే మారిపోయింది. అది నా అహంకారం కొద్దీ చేసిన పొరబాటు-ఇప్పుడు దాన్ని దిద్దుకొనే అవకాశం లేదు.'' బరువుగా నిట్టూర్చింది డాక్టరు.

ఇంకా కొంత సేపు అలాగే కూర్చుంటే డాక్టరు పరంజ్యోతి తన మనసులో ఉన్న కల్లోలాన్ని బైటపెట్టేదేమో. కాని మంజు లేచి ఏడ్చింది. సుమన లేచి లోపలికి వెళ్ళింది.

ఆమె వెళ్ళినవైపే చూస్తూ "చేతులారా జారవిడుచుకున్నాను అభాగ్యురాలిని" అనుకుంటూ లేచింది డాక్టర్ పరంజ్యోతి.

## 5

చూడామణికి మంచి పళ్ళతోటఉంది. సపోటా, మామిడి. నారింజ, నిమ్మ విరివిగా కాసి అతడికి మంచి ఫలసాయాన్ని అందించేవి. క్రమంగా ఆ చెట్లన్నీ ఇప్పుడు కాపు తగ్గి ఒక్కొక్కటే నిలువునా ఎండిపోవటం మొదలుపెట్టాయి. కొత్త రకాలయిన ఎరువులు వేసిచూసినా ఫలించలేదు. ఆ చెట్లన్నీ అతడి తాతగారు వేసినవి. బహుశః వాటి వయసు మీరిందేమోననుకుని వాటినన్నిటినీ క్రిందటి సంవత్సరము తీయించి తోటంతా దున్నించాడు. వ్యవసాయశాఖవారిని సంప్రతించి కొబ్బరి మొక్కలు తెప్పించి వేశాడు. ఆ పది ఎకరాల తోటలో ఒకచిన్న పూరిగుడిసె మాలీలకు వేశాడు. తండ్రీకొడుకులు తోటకు కాపలాగా ఉంటూ చెట్లకు మోట బావిలోనుంచి నీరు తోడిపోస్తారు. ఈ సంవత్సరము ఎలక్ట్రిసిటీ పెట్టించాడు. ఇంజను సప్లైచేసిన నీరు కాలవలగుండా ప్రతిచెట్టుకూ అందుతుంది. తను వెళ్ళినప్పుడు ఉండటానికి చుట్టుగుడిసె వేయించుకుని దానిలో ఆధునిక సౌకర్యాలన్నీ చేసుకున్నాడు.

చూడామణికి గ్రంథపఠనముంటే ఆకలిదప్పులు ఉండవు. లైబ్రరీలన్నీ అతడు ఎరిగినవే. వాటిలోఉన్న ఆంధ్ర ఆంగ్ల ఉరుదూ గ్రంథాలన్నీ చదువుతాడు. ప్రతి పుస్తకమూ చదివి నోట్సు తయారుచేస్తాడు. అన్ని విషయాలమీద ఉపన్యాసాలివ్వగల విజ్ఞానము ఉన్నది. ఇంగ్లీషు జర్నల్సుకు అప్పుడప్పుడు వ్యాసాలు వ్రాస్తూ ఉంటాడు. ఇటీవల జ్యోతిషములోకూడా పరిచయము సంపాదించాడు. ప్రాక్పశ్చిమ జ్యోతిశ్శాస్త్రిలను చదవటానికి గ్రంథాలు తెప్పించుకున్నాడు. అతడికి స్నేహితులు చాలా తక్కువ. తనతో సమానంగా మాట్లాడగలశక్తి ఉన్నవాళ్లవైపుకే అతడి మనసు మొగ్గుతుంది.

చూడామణికి మీరజ్ వచ్చినప్పటినుండీ గ్రంథపఠనంలేక ఏమీ తోచనట్టుగా ఇటూ అటూ తిరుగుతున్నాడు. చిన్న చిన్న పత్రికలూ జర్నల్సూ అతడికి ఆనటం లేదు. వచ్చిన వారంరోజుల్లో మూడు సినిమాలు చూశాడు.

ఇదిగో అదిగో అంటూ వారంరోజులు గడిచిన తరువాత డాక్టర్ నరేంద్రతో మాట్లాడి రమణ ఆపరేషన్ ఏర్పాటుచేశాడు.

ఆపరేషన్ చాలా చిన్నది. కాని పేరుమోసిన డాక్టరు చేశాడు. చూడామణి కెంతో సంతృప్తికలిగింది. డాక్టర్ నరేంద్రతో కరచాలనంచేస్తూ తన సంతృప్తి నంతా వ్యక్తంచేశాడు చూడామణి. హాస్పిటల్లోఉన్న నాలుగురోజులూ డాక్టర్

నరేంద్ర చూడామణి దగ్గరికొచ్చి మాట్లాడిస్తూ ఉండేవాడు. భుజంమ్మీద చెయ్యేసి ఎంతో ఆత్మీయంగా కబుర్లుచెప్పేవాడు.

"మీచేత ఆపరేషన్ చేయించుకున్నాను. మీ స్నేహాన్ని సంపాదించుకున్నాను! నన్ను మీరెప్పుడూ జ్ఞాపకం ఉంచుకునేటట్టుగా ఈ కలం ప్రెజంటు చేస్తున్నాను" ఇంటికి వెళ్లేనాడు డాక్టర్ నరేంద్ర చేతిలో ఖరీదయిన కలం పెట్టాడు చూడామణి.

"ఇదేమిటి? నాకెందుకీ కలం! మనం స్నేహితులమయ్యాం. ఎన్నో విషయాలమీద మాట్లాడుకున్నాము. ఇంకా నేను మిమ్మల్ని మాట్లాడనివ్వలేదు ఆపరేషను జరిగిందికదా అని. లేకపోతే ఎన్నెన్ని విషయాలు చెప్పేవారో మీరు? మీ స్నేహమే నా మనసులో నిలిచిపోయింది. ఇంకా కలమెందుకు"? మళ్లీ అతడికే ఇవ్వబోయాడు డాక్టర్ నరేంద్ర.

"కాదుకాదు. మీరు తీసుకోవాలి. నా కలంతోటే-నన్ను జ్ఞాపకం చేసుకుంటూ మీపేషెంట్లకు చీటీలు వ్రాయాలి. ఈ పళ్లబుట్ట ఇంటికి తీసుకువెళ్లండి మన స్నేహాన్ని తలుచుకుంటూ పళ్లు తినండి. మీ కుటుంబానికి కూడా చెప్పండి."

కుటుంబం అన్నమాటను చూడామణి పూర్తిచేయకముందే పగలబడి నవ్వాడు నరేంద్ర.

"నాకో కుటుంబం! హాయి! హాయి!" నవ్వినందువల్ల వచ్చిన కన్నీళ్లను చేతిరుమాలుతో తుడుచుకుంటూ "చూడామణిగారూ! నాకు కుటుంబంలేదు. ఒంటరిగాణ్ణి. తిన్నా తినకపోయినా అడిగేవాళ్ళు లేరు" అన్నాడు

"అలాగా!" అంతలోకి చూడామణి ముఖం గంభీరమయిపోయింది ఒక నిమిషం ఆలోచనలోపడ్డట్టు ముఖంపెట్టి- "పోనీ మీరు తీసుకోండి" అన్నాడు.

"మీరు కొన్నాళ్లిక్కడే ఉండండి. తరువాత చూసి కళ్లజోడు వ్రాసి ఇస్తాను నేను కనబడుతూ ఉంటానులెండి. ఇక్కడేగా-డాక్టర్ రమణ గారింట్లోనే ఉంటారుగా?" అన్నాడు.

చూడామణి ఇంటికి వచ్చినతరువాత రాధమ్మ అతడిని బాగా చూసుకుంటున్నది. దగ్గర కూర్చుని మధ్యాహ్నంవేళల్లో ఎన్నో కబుర్లు చెప్పేది. అప్పుడప్పుడు రమణకూడా వాళ్లతో మాట కలిపేవాడు వాళ్ల మాటల్లో డాక్టర్ నరేంద్ర మంచితనాన్నిగురించి ఎక్కువగా ఉండేది. "అతడి హృదయమొక

అమృతభాండం" అంటాడు రమణ. ఆ మాటనే తలాడిస్తూ ఆమోదిస్తాడు చూడామణి.

ఇంటిముందర ఉన్న పార్కులో కూర్చుని రాధమ్మతో కబుర్లు చెబుతున్నాడు చూడామణి. 'హలో' అంటూ వచ్చాడు డాక్టర్ నరేంద్ర. అతడిని చూడగానే రాధమ్మ లోపలికి వెళ్లింది, పళ్లరసం తీసుకురావటానికి.

"మీరు కళ్లద్దాలు కూడా ఇచ్చారు. ఇంక ఊరు వెళ్లాలనుకుంటున్నాను," అన్నాడు చూడామణి

"అయ్యో, అప్పుడే వెళ్లిపోతారా? అక్కడ ఏంచేస్తూఉంటారు?" బాధగా అన్నాడు నరేంద్ర.

"నేనా? అక్కడ కొబ్బరితోట వేయించాను. దాన్ని చూసుకోవటమూ, అందిన కొత్త పుస్తకమల్లా చదవటమూ, ఈ రెండే పనులు."

"అలాగా! అయితే మీరు ..." సందేహిస్తూ అతడి ముఖంలోకి చూశాడు నరేంద్ర.

"మీలాగే నేనూ ఒంటిరిగాణ్ణి. తిన్నావా లేదా అని మందలించేవాళ్ళు లేరు. ఆనాడు మీరన్నమాటే నేనూ అంటున్నాను." చూడామణి నవ్వాడు.

నరేంద్ర కామాటలకు నవ్వురాలేదు. ముఖం అదోలా అయిపోయింది. అంతలో రాధమ్మ నాలుగు గ్లాసులు ఆరంజి క్రష్ తెచ్చింది. అప్పుడే వచ్చిన రమణ వాళ్లతో మాటకలిపి ఒక గ్లాసందుకున్నాడు.

కొంతసేపటికి "మంచి పిక్చరొచ్చింది, వెళ్దాం రండి" అన్నాడు నరేంద్ర.

"మీకు తెలునుగా నేనాట్టే సినిమాలు చూడనని? మా మణిని తీసుకువెళ్లండి" అన్నాడు రమణ.

మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్యలో ఒకమాదిరిగా ముఖంపెట్టి అలా ఆలోచనలోపడిపోతాడేమిటి డాక్టర్ నరేంద్ర? నవ్వుతున్న ముఖం అంతలో గంభీరాకృతి దాలుస్తుందేమిటి? ఈ రెండు ప్రశ్నలూ చూడామణిని వేస్తాడు తున్నాయి. నరేంద్ర ఒంటరిగా దొరికితే అడిగెయ్యాలి. ప్రతిమనిషి జీవితంలోనూ కొండలూ లోయలూ ఉంటాయేమో? ఎవరు చూడవచ్చారు? కొందరి జీవితాలలో అన్నీ కొండలే ఉన్నట్టు చూశాడు కాని అరుదుగా కనబడుతుంది.

రేపు నరేంద్ర అంతరంగంతో పరిచయం చేసుకోవాలి!

దిగ్గునలేచి నిలబడి "డాక్టర్ నరేంద్ర! మీతో సినిమా చూడటమంటే నాకెంతో ఆనందం తప్పకుండా వస్తాను. స్కూటర్ తెస్తారుగా?" అన్నాడు, అతడి చేయందుకుంటూ.

## 6

డాక్టర్ పరంజ్యోతికి సుమన మంజుల రాకతో మనసు నిండుగా ఉన్నట్లనిపిస్తోంది. మంజుల నెత్తుకోవటానికి మనసు ఉవ్విళ్లూరుతూ ఉంటుంది ఉదయపు వేళ సుమనకూ తొందరే-డాక్టరికీ తొందరే. ఆ పనిఒత్తిడిలోకూడా రింగు రింగులుగా రేగిన మంజు జుట్టును సవరించి, బూరెల్లా ఉన్న బుగ్గలను తన చేత్తో ఒకసారి సున్నితంగా నొక్కి-, ఆ చిన్నగడ్డాన్ని తాకీతాకనట్టు తాకి-టా టా మంజూ అంటుంది డాక్టరు పరంజ్యోతి.

తనకున్న పళ్లన్నీ పైకి కనబరుస్తూ-తనఎత్తు రబ్బరు బొమ్మను చంకన బెట్టుకుని ఒక చేత్తో టా టా అంటూ చెయ్యాడిస్తుంది మంజుల.

ఈ దృశ్యాన్ని చూసి ఆనందంతో కళ్లు తుడుచుకుంటుంది సుమన.

పళ్లసంచీని బల్లమీద పెడుతూ, "ఇవాళ మొదటి జీతం అందుకున్నాను" అన్నది సుమన, డాక్టరు రెండుచేతులు పట్టుకుని.

"అందుకేనా ఈ పళ్లు ? నేను చేసిన సహాయానికి ఈ కాసిని పళ్లూ ఇచ్చి చెల్లగొట్టేద్దామనా ? అలా వీల్లేదు " గంభీరంగా ధ్వనించింది ఆమె కంఠం

మొదట తెల్లబోయింది సుమన తరువాత కలవరపడ్డది

"ఈ నాలుగు రూపాయల పళ్లతో చెల్లగొట్టాలని నా ఉద్దేశ్యంకాదు. కాని మొదటి సంపాదనతో నోరు తియ్యబడేద్దామని" అన్నది జంకుతూ

"అఁహా ' అది చాలదు. నీవు నన్ను మమ్మీ అని పిలవాలి" చేతులు చాపింది డాక్టరు.

తల్లి ప్రేమకు నోచుకోని సుమన-బాధాతప్త హృదయంతో క్రుంగిపోయే సుమన-రివ్వునపోయి ఆమె చేతులలో వాలిపోయింది. డాక్ట రామెను గుండెకు చేర్చుకుంది.

వెండితీగెల్లాంటి తలవెంట్రుకలతో వయసుమళ్లినా శరీరలావణ్యం తరగని క్రైస్తవజాతి అవివాహిత డాక్టరు పరంజ్యోతి-సంప్రదాయ కుటుంబంలో పుట్టి పరిత్యక్త అయినా భర్త రాకకోసం వేయికళ్లతో ఎదురుచూసే అతిలోకసుందరి, మహారాష్ట్రీ బ్రాహ్మణ యువతి-బిడ్డను కన్న తల్లి సుమన ఇద్దరూ తమతమ కుటుంబ చరిత్రలు మరచారు మమ్మీ అన్నది సుమన-బిడ్డా అన్నది డాక్టరు పరంజ్యోతి. తల్లీ కూతుళ్ల మధ్య ఉండే అనుబంధంలాంటిది పెనవేసుకోవటం మొదలుపెట్టింది వాళ్లమధ్య వాళ్లిద్దరూ సంభాషించే భాష ఇంగ్లీషు మంజు నోటా చిన్న చిన్న ఇంగ్లీషు మాటలే పలుకుతున్నాయి

ఆనాటినుంచే సుమన తను వేరే వంటచేసుకోవటం మానేసింది.



మధ్యాహ్నం ఒంటిగంటకు ఇల్లు చేరుకుంటూనే "సుమనా" అంటూ కేక పెట్టింది డాక్టరు

అప్పుడే ఇంటికి వచ్చి చీరె మార్చుకుని మంజుకు భోజనంపెట్టి చెయ్యి తుడుచుకుంటూ హాల్లోకి వచ్చింది సుమన. ఏమిటన్నట్టు చూసింది

"నీకూ డాక్టరు నరేంద్రకు ఎటువంటి పరిచయం ?" డాక్టరు ముఖం చాలా గంభీరంగా ఉన్నది.

సుమన బొమ్మలా నిలబడిపోయింది కళ్లు దించుకుంది.

"ఎటువంటి పరిచయం ? చెప్పు ?" మళ్లీ నిలదీసి అడిగింది.

"నా కెటువంటి పరిచయం లేదు" మెల్లగా జవాబిచ్చింది సుమన.

"ఇదిగో ఈ ఫొటో నాకు డాక్టర్ నరేంద్ర కోరేట్కర్ దగ్గర దొరికింది." విసిరి సుమనమీద పడేసింది డాక్టరు గది తలుపు బఢాలున తోసుకుంటూ గదిలోకి వెళ్లిపోయింది.

కిందపడ్డ ఫొటోను తీసి చూసింది సుమన. అది తన ఫొటో. దాని వెనక "విట్ లవ్-సుమన" అని తనే వ్రాసింది నరేంద్ర వెళ్లిపోయేనాడు-అతడు నిద్రపోతుండగా తన ఫొటో అతడి పర్సులో కనబడేటట్టుగా పెట్టింది ఆతడెక్కడ విసిరిపారేశాడో-ఈ డాక్టరికి దొరికింది నరేంద్రస్పర్శ ననుభవించిన తన ఫొటోను సుమన హృదయానికి హత్తుకొని ఆ పారవశ్యంలో కళ్ళు మూసుకుంది.

నౌకరు భోజనం తయారుచేశానని పిలిచాడు డాక్టరు పరంజ్యోతి మామూలుగా బల్లదగ్గర కూర్చున్న సుమనకోసం గంటకొట్టింది అడుగులో అడుగు వేసుకొంటూ సుమన వెళ్లింది. ఆమె ముఖం ఆందోళనతో వెల వెల్లాడింది.

ఏమీ జరగనట్టే ఇద్దరూ భోజనం చేశారు. ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్లారు.

ఐదు నిమిషాలయినా కాకముందే డాక్టరుకోసం టెలిఫోను వచ్చింది డాక్టరు గబగబా బట్టలు మార్చుకుని హాస్పిటల్ వైపుకు వెళ్లింది.

ఆ క్రిందటిరోజు మెడికల్ కాలేజి విద్యార్థినిని హాస్పిటల్లో చేర్చారు ఆమెకు విపరీతమైన కడుపునొప్పి తాత్కాలికంగా మందులిచ్చి నొప్పి తగ్గించారు నొప్పి కారణాలు పరిశోధిస్తున్నారు

"ఈ అమ్మాయి కన్య కడుపునొప్పి గర్భకోశానికి సంబంధించినది కాదనిపిస్తోంది" అన్నది డాక్టరు పరంజ్యోతి అసిస్టెంటు ఆమెను చూడగానే.

"ఈ అమ్మాయి కస్తూరి కోరట్కర్ నరేంద్ర భార్య నీవేమో కన్య అంటున్నావు" డాక్టర్ పరంజ్యోతి నిర్ధారణగా అన్నది

"కావచ్చు నా పరీక్షవల్ల తేలిన విషయం కన్య అని మధ్యాహ్నం పదకొండు గంటలకు మళ్లీ నొప్పి వచ్చింది. చాలా బాధపడ్డది."

"అయితే సర్జన్‌కు రిఫర్ చెయ్యి-కాదు నేనే చెప్తాలే" అంటూ వెళ్లింది

ఆ సాయంత్రమే నరేంద్రని పిలిచి ఆపరేషన్ ఏర్పాటు చేశారు ఎపిన్ డిసైటిస్ ఆపరేషను పెద్ద సర్జను చేశాడు

వార్డులోనుంచి బైటికి వస్తూ "డాక్టర్। నిన్న మీరు ఈ పేషంటును ఇక్కడ చేర్చిన తరువాత ఏమయినా పారేసుకున్నారా ?" అడిగింది డాక్టరు పరంజ్యోతి.

తెల్లబోయినట్టు చూస్తూ "ఏమీలేదే!" అన్నాడు నరేంద్ర

"బాగా జ్ఞాపకం చేసుకోండి "

పర్సుతీసి చూసుకున్న నరేంద్ర కేదో పోయినట్లనిపించి తలగోక్కుంటూ పైకి చూశాడు

"ఏమీ పోలేదా ?" మళ్ళీ అడిగింది డాక్టరు పరంజ్యోతి

"అవును ఒక చిన్న ఫొటో పడిపోయినట్టుంది. మీకు దొరికిందా ?" ఆశగా అడిగాడు.

"ఎవరి దాఫొటో ?"

"ఒక పిల్లది. ఆ పిల్లకు చిన్నప్పుడు నేను వైద్యం చేశాను అందుకని నా దగ్గర ఉంది." అనుకోకుండా అనేశాడు.

అబద్ధం అన్నట్లు చూసి "ఆఁ హాఁ ?" అన్నది.

"ఇస్తారా ఫొటో" చెయ్యిచాపాడు.

"నా దగ్గర లేదు ఆ పిల్లకే ఇచ్చాను," అంటూ గిరుక్కున తిరిగింది

ఆ రాత్రి ఆరుబయట కుర్చీలు వేయించుకుని మామూలుగా సుమన డాక్టరు పరంజ్యోతి కూర్చున్నారు. ఇద్దరిమధ్య నిశ్శబ్దము సంచారంచేసింది.

"డాక్టరు నరేంద్రను నీవు ఎరగనే ఎరగవా ?" డాక్టరు పరంజ్యోతి వేసిన ప్రశ్న ఖంగునమ్రోగింది

వెంటనే జవాబు చెప్పలేకపోయింది సుమన

"సుమనా ! నిన్ను చూడగానే నా బిడ్డవనిపించింది ఒంటరితనంతో మోడు బారిన మనసులో మమతలు పెరగటం మొదలుపెట్టాయి నా కూతురనుకోగానే నిన్ను తీర్చిదిద్దాలనే కాంక్ష బయలుదేరింది. నీ భర్త విదేశాలలో ఉన్నాడన్నావు ఇక్కడ డాక్టరు నరేంద్రకు ప్రేమతో నీ ఫొటో బహూకరించావు. ఇది పెళ్ళికాకముందు జరిగిందా ? నీ పెనిమిటి విదేశాలలో ఉండగా జరిగిందా ? ఇటువంటి నియమ భంగాలు నా మనసును చాలా బాధపెడతాయి' అన్నది వన్నె తరిగిన ముఖంతో

సుమన మనసు గిలగిల కొట్టుకుంది జరిగింది జరిగినట్టు చెబితే తన సంసారం బయటపడిపోతుంది. చెప్పకపోతే డాక్టరు తనను అపార్థంచేసు కుంటుంది తల్లిలా ఆదరిస్తూ పెద్ద దిక్కులా తనను కాపాడుతున్న డాక్టరికి

చెప్పుకుని బాధోపశమనం కావించుకుందా మనుకున్నది దిగ్గున లేచి డాక్టరు పరంజ్యోతి రెండుచేతులూ తన గుండె కానించుకుంటూ "మమ్మీ - నేను నిజం చెబుతాను" అంటూ గబగబా తన గదిలోకి పరుగెత్తి పెట్టెలో అడుగున భద్ర పరచిన పెళ్ళినాటి ఫొటోతెచ్చి ఆమె చేతిలో పెట్టింది.

వధూవరులు మెడనిండా పూలహారాలతో తీయించుకున్న పెళ్ళినాటి ఫొటో. బాగా దృష్టిసారించి చూసింది డాక్టరు డాక్టరు నరేంద్ర రూపం స్పష్టంగా కనబడుతున్నది.

"డాక్టరు నరేంద్ర నీ భర్తా?" అయోమయంగా ప్రశ్నించింది డాక్టరు. ఆమె మనసులో కస్తూరి కోరటర్కర్ మెదిలింది

"నీ పెళ్ళి ఎప్పుడయింది? నీ పెనిమిటి ఇంజనీరన్నావు విదేశాలలో ఉన్నాడన్నావు" అదొక మాదిరిగా చూసింది డాక్టరు

డాక్టరు కూర్చున్న కుర్చీ కానుకుని నిలబడి, ఆమె చేతిని తన చేతులతో పట్టుకుని, జరిగిందంతా పూసగుచ్చినట్టుగా చెప్పింది సుమన.

"ఆయన మనసులో ఏముందో నాకు తెలియదు. మంజు పుట్టిన తరువాత ఇంక అక్కడ ఉండలేకపోయాను. నన్ను చూసి మానాన్న పడేబాధ భరించలేక ఇక్కడికివచ్చి ఉండిపోవాలనుకున్నాను ఏ విధంగానయినా" సుమన కన్నీళ్ళు కారుస్తుంటే డాక్టరు పరంజ్యోతి గుండె కదిలినట్లయింది లేచి నిలబడి సుమనను గుండెకు హత్తుకుంది.

పదిహేనురోజులు బరువుగా గడిచాయి రోజుకు రెండు మూడుసార్లు డాక్టరు నరేంద్ర కనబడుతూనే ఉన్నాడు డాక్టరు పరంజ్యోతికి మామూలు పలకరింపులుతప్ప సంభాషణ ముందుకు పోలేదు సుమనతో కూడా మామూలు మాటలు సాగుతున్నాయి కాని ముందుకు సాగటంలేదు కాలం ఇంచుమించుగా స్తంభించినట్టుంది డాక్టరు పరంజ్యోతికి.

ఉదయం పదిగంటలవేళ సుమన సూపర్నెంటు గదిలోనుంచి కారిడర్ గుండా తన రూముకు వెళ్లుతున్నది చేతినిండా ఫైల్సు ఉన్నాయి. హాస్పిటల్ పాత బిల్డింగ్ ముందర పదిమంది మూగిఉన్నారు. మధ్య ఎవరిదో ఆర్తనాదము. స్త్రీ గొంతులా వినపడుతున్నది. డాక్టరు నరేంద్ర అటుదిక్కు వెళ్ళుతూ కారిడార్ లో ఒకక్షణ మాగాడు. అతడి ముఖం ఆ గుంపువైపున్నది. డాక్టర్ని చూడగానే ఆ గుంపులోనుంచి ఒకడు వచ్చి "సాబ్, మేడమీదినుంచి పడిపోయింది ఎముకలన్నీ విరిగాయి. పేదరాలు. ఇక్కడ చేర్పించి బాగుచేయిం

చండి" అంటూ చేతులు జోడించాడు. అక్కడ రోగులకందరికీ డాక్టరు నరేంద్ర పేరు రామస్మరణం వంటిది. ఎంతదూరంనుంచి వచ్చిన వాళ్ళయినా క్షణంలో ఈ విషయం తెలుసుకుంటారు.

డాక్టరు నరేంద్ర ఎక్కువ ఆలస్యం చెయ్యకుండా వాళ్ళను తనవెంట తీసుకువెళ్ళి ఎక్స్‌రే తీయించి విరిగిన ఎముకలకు ప్లాస్టరు వేయించాడు అందు కయే ఖర్చులో తను కొంత ఇచ్చాడు. తన మిత్రులచేత కొంత ఇప్పించాడు.

సుమన ఇన్నాళ్ళకు డాక్టరు నరేంద్రను చూడగలిగింది. ఇంతవరకూ అందరూ అతడి కరుణార్ద్ర హృదయాన్ని వేనోళ్ళ పొగుడుతుంటే విన్నది. ఇవాళ ప్రత్యక్షంగా చూడగలిగాననుకున్నది. ఆమె మనసు ఉద్రేకంతో పొంగింది. అది అతడిని చూడకలిగానన్న సంతోషమో - అతడి హృదయము లోని ఆర్ద్రతను చూడగలిగినందువల్లనో - అందరిపట్ల జాలిగల హృదయము తననెందుకు ఉపేక్షిస్తున్నదన్న వ్యథో - ఏదీ తెలియకుండా ఉన్నదామెకు.

అనాడే ఒంటిగంటకు తను యింటికి బయలుదేరుతుండగా ఆ కారిడార్‌లో నుంచే గబగబా అడుగులువేసుకుంటూ వెళ్ళిపోయాడు నరేంద్ర.

మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ ఇల్లుచేరింది సుమన.

## 7

ఇంటిముందర పార్కులో కూర్చుని చూడామణితో కబుర్లు చెబుతున్నాడు నరేంద్ర. రెండువందల గజాలదూరంలో టెన్నిస్ ఆడుతున్నారు కొందరు డాక్టర్లూ, నర్సులూ. ఆ సమీపంలో ఉన్న బెంచీలమీద కూర్చున్నారు ఆట చూడటానికి వచ్చిన కొందరు. నవ్వుతూ కేరింతలూ త్రుళ్ళింతలూ బిగ్గరగా వినబడుతున్నాయి.

"ఎట్లా ఉన్నారు? ఈ మధ్య నాకు రావటం పడలేదు" అన్నాడు ఆనంద్ వాళ్ళకు దగ్గరగా కూర్చుంటూ.

"డాక్టర్ సాబ్ ఆపరేషను చేశారు. కళ్ళజోడిచ్చారు. ఇంక ఇంటికి వెళ్ళ టమే తరువాయి" అన్నాడు చూడామణి.

"నిన్ను చూసికూడా చాలారోజులయింది నరేందర్. ఆనాడు సినిమాలో చూడటమే కదూ!! అన్నాడు వెన్నుతట్టి అనంద్.

"చూడామణిగారు నీకెట్లా తెలుసు ఆనంద్?" కలవరపడుతున్న మనసును అణచుకుంటూ ప్రశ్నించాడు నరేంద్ర.

"వీరినా ? అనిల్ - సుమన - చందావర్కర్ - మేమంతా ఒక్కరైలులోనే వచ్చాము ఇక్కడికి." తన ధోరణిలో చెప్పుకుంటూ పోతున్నాడు ఆనంద్

"అయితే మీకిద్దరికీ బాగా పరిచయముందన్నమాట. మాట్లాడుకుంటూ ఉండండి నేను వెళ్తా. పనుంది" లేచాడు నరేంద్ర.

"కూర్చో ఎప్పుడూ పని అంటే మేము నమ్మాలా - వద్దా ? నేను సంగ్లీ నుంచి వస్తున్నా. కస్తూరికి జ్వరం వచ్చింది తెలుసునా ?"

ఉలిక్కిపడ్డాడు నరేంద్ర. కస్తూరి సంగతి చూడామణి ఎదుట ఎత్తినందుకు అయినా మనసులోని ఆదుర్దాను ఆపుకోలేక "ఎవరు చెప్పారు ?" అన్నాడు.

"ఎవరు చెప్పగలరు కస్తూరి సంగతి ? వార్డెను చెప్పింది "

తలపంకించాడు నరేంద్ర. అతడికి ఆనంద్‌ను చూస్తుంటే భయము వేస్తోంది. ఈపాటికి చూడామణికి తన సంగతంతా చెప్పేఉంటాడు ఒక్క క్షణమయినా ఆలస్యంచెయ్యకుండా లేచాడు.

అతడు వెళ్ళగా చూసి ఆనంద్ మళ్ళీ కబుర్లలోకి దిగాడు

"డాక్టరు నరేంద్ర నాకు చాలా ముఖ్య స్నేహితుడయ్యాడు మేము అనేక విషయాలమీద మాట్లాడుకుంటూ ఉంటాము. ఎంత పొద్దుపోయిందో కూడా తెలియదు. ఆయన కిక్కడ ఎంత మంచిపేరుందో ! ప్రతి పేషంటూ ఆయనను పొగిడేవాడే అందరినీ అన్నివిధాలా ఆదుకుంటాడు. తను మాత్రం చాలా సింపుల్‌గా ఉంటాడు. ఆయనమీద నాకు రోజుకు రోజూ గౌరవం అధికమవు తున్నది. నాకే ఇట్లాఉంటే ఆ పేద ప్రజానీకం దేవుడిలా కొలుస్తున్నదంటే ఆశ్చర్యమేముంది ?" ఎంత చెప్పినా తనివి తీరక మాటలకు తడుముకుంటున్నాడే చూడామణి.

అతడి పొగడ్తలు వింటున్నకొద్దీ నిలువెల్లా మండినట్లయింది ఆనంద్‌కు. నరేంద్ర సంపాదించిన కీర్తిని కలుషితము చేయటానికి మూడు నిమిషాలయినా పట్టదు. కాని అతడిని గురించి ఏమనటానికీ సుమన ఆజ్ఞలేదు కాని నోరు ఊరుకోలేదు.

"మంచివాళ్లకు మితం కూడా తెలియదు. తమ మంచితనం ఎటు తీసుకు వెళ్లుతుందో కూడా తెలియదనుకుంటాను. అయితే మన నరేంద్ర మంచితనం మాటకాదు సుమా నేను చెప్పేది !'' ఆపుకోలేక అనేశాడు.

అంతలో వచ్చిన రమణ రాకతో సంభాషణ మళ్లీ కొంత సేపగింది

"మనకు రేపు సాయంకాలం డాక్టరు ఫిలిప్సు ఇంట్లో పార్టీ. ఆనంద్! మీరు డాక్టరు ఫిలిప్సుకు మిత్రులేకదా. వస్తారన్నమాట" అన్నాడు రమణ.

"నాకిప్పుడు ఇటువంటి పార్టీలంటే ఉత్సాహంగా ఉండటంలేదు. ఒకప్పుడవి నాకు చాలా సంతోషాన్ని కలిగించేవి." అన్నాడు ఆనంద్ పెదవి చప్పరిస్తూ.

"ఏమిటి మీబాధ?" మామూలుగా ప్రశ్నించాడు రమణ.

చూడామణి ఆనంద్ పగలబడి నవ్వారు ఆ ప్రశ్నకు.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"పేషంట్లను అడిగినట్టే అడిగారు" మళ్లీ నవ్వాడు ఆనంద్.

"అదిసరే. మీకెందుకింత నిరుత్సాహం కలుగుతోందని ప్రశ్నిస్తున్నాను."

"నా మనసులో కొన్నాళ్లనుంచీ ఒక సమస్య దూరి నన్ను తొలిచి పారేస్తున్నది. దాన్ని పరిష్కారం చేస్తానని వాగ్దానం చేశాను. కాని — ఆ సమస్య జటిలమయి కూర్చుంది. నేనా సమస్యను పరిష్కారం చెయ్యలేక పోతానేమోనని దిగులుగా ఉంది.'' బరువుగా నిట్టూర్చాడు ఆనంద్.

"భారమంతా దేవుడిమీద వేసి ప్రయత్నం చెయ్యాలి. పని అవుతుందా మంచిదే. కాకపోతుందా ఆ భారం దేవుడిది!" రమణ చేతులు దులుపుకుని లేచాడు.

ఈ పార్కులోనుంచి చూస్తే డాక్టరు పరంజ్యోతి ఇంటి ముందర ఉన్న పార్కులో వాళ్లందరూ కనబడతారు. ఆయా మంజును తీసుకుని వచ్చినట్టుంది. మంజు తప్పటడుగులు వేస్తూ గడ్డిపూలతో ఆడుతున్నది.

''మంజును చూశారుకదూ?'' ఎటో చూస్తూ ప్రశ్నించాడు ఆనంద్.

"ఎందుకు చూడలేదు? రైలు ప్రయాణంలో అందరికంటె ఆమెనే బాగా చూశాను" మందహాసం చేశాడు చూడామణి.

"అదిగో చిన్నమంజు, రండి అలా వెళ్దాము. అక్కడి పార్కులో అదికూడా ఒక పులాబీలా ఉంది'' అంటూ దారితీశాడు.

దిగ్గునలేచాడు చూడామణి. రమణతో చెప్పి బయలుదేరాడు. ఆనంద్‌ను చూడగానే మంజు నవ్వుతో చెయ్యూపింది. ఆమె బుగ్గలు నిమిరి ''అమ్మ ఇంట్లో ఉన్నదా'' అని ఆయా నడిగాడు.

కిటికీగుండా ఆనంద్‌ను చూసి సుమన బైటికి వచ్చింది. లానులో కూర్చుని తన ఉద్యోగం సంగతీ జీతం వచ్చిన సంగతీ చెప్పింది మహారాష్ట్ర భాషలో.

"నరేంద్ర కనబడుతున్నాడా ఎప్పుడయినా?"

సుమన జవాబు చెప్పకుండా కూర్చుంది గడ్డిపరకలు తుంచుతూ.

"ఇన్నాళ్లనుంచీ హాస్పిటల్లో పనిచేస్తున్నావు కదా! వస్తూ పోతూ కనబళ్ళేదా?' ఆమె ముఖంలోకి గుచ్చిగుచ్చి చూశాడు ఆనంద్.

తల తిప్పింది సుమన ఆనంద్ ఇంకా గట్టిగా అడగటానికి వీలులేకుండా డాక్టరు పరంజ్యోతి మంజును పలకరిస్తూ వచ్చి ఏపిల్ పండు చేతికిచ్చింది

సుమన ఆనంద్‌నూ చూడామణినీ డాక్టరు పరంజ్యోతికి పరిచయంచేసింది

''నేను మిమ్మల్ని డాక్టరు నరేంద్రతో మాట్లాడుతుండగా చూశాను" అన్నది డాక్టరు పరంజ్యోతి.

"చూసి ఉంటారు. అతడు మాకు బంధువు అన్నవరస'' అన్నాడు ఆనంద్ కొంతసేపు ఆలోచించి ' సుమన కూడా నాకు చుట్టమే'' అన్నాడు.

కొంచెమాశ్చర్యపడినట్టు డాక్టరు పరంజ్యోతి ముఖం కనుపించింది ఆనంద్‌కు.

సుమనకు గుండె అతివేగంతో కొట్టుకోవటం మొదలుపెట్టింది, ఆనంద్ గాని డాక్టరు పరంజ్యోతిగాని నరేంద్ర విషయం ప్రసంగంలోకి తీసుకువస్తారే మోనని. డాక్టరు పరంజ్యోతి మీరజ్ వాతావరణాన్ని గురించీ నీటి కరవును గురించి కొంచెంసేపు మాట్లాడి వెళ్లిపోయింది.

సుమన బరువుగా నిట్టూర్చింది అక్కడ కూర్చున్న వాళ్లందరి దృష్టిలో తనొక సమస్య అయి కూర్చున్నందుకు. డాక్టరు లేచి వెళ్లగానే ఆమె హృదయం తేలికపడ్డట్టయింది ఎవరూ తన సంగతి పైకి అనకుండా ఉన్నందుకు మనసు లోనే కృతజ్ఞతలు తెలిపింది.

"మనమిట్లా మాట్లాడుకుంటూ సంగ్లీ పోదాంరండి'' ఆనంద్ చూడామణిని చెయ్యిపట్టి లాక్కుని వెళ్లాడు కాని మెడికల్ కాలేజీ ఆడపిల్లల హాస్టలువైపుకు దారితీశాడు.

వార్డెను వెంటనే చెప్పింది కస్తూరి కోరట్కర్‌కు జర్వం - ఇంకా నార్మల్‌కు రాలేదనీ — అప్పుడే డాక్టర్ నరేంద్ర వచ్చిచూసి మందుపంపించాడని చెప్పింది. అటూ ఇటూ తిరిగి ఇద్దరూ రెండవ ఆట సినిమాకు వెళ్లారు.

"మా మంజునూ సుమననూ చూశారు కదూ ? వాళ్లను చూస్తే మీకేమనిపి స్తుంది ?" హఠాత్తుగా అడిగాడు చూడామణిని.

"వాళ్లకేం ? తల్లీ కూతుళ్లు మాణిక్యాల్లా ఉంటారు. వాళ్లను చూస్తుంటే సర్వం మరిచిపోతాం" అన్నాడు వాళ్లను అప్పుడు చూసినట్టుగా.



"మంజును చూడగానే నాకు కొండంత జాలి కలుగుతుంది. పాపం మంజు ఇంతవరకు తండ్రినెరగదు."

''అలాగా! ఎక్కడున్నాడు? ఇన్నాళ్లెందుకు చూడలేదు?''

''ఆ సంగతే నేను చెప్పలేను. ఎందుకు చూడలేవో ఆ దైవానికి తెలుసు. కాని - అతడుమాత్రం చాలా మంచివాడు. అందరిచేత కీర్తింపబడేవాడు.'' మాటను టక్కున ఆపేశాడు. నరంలేని నాలుక, ఏం జారుతుందో దానివెంట! అని.

''మీరు ఏదో చెప్తారు. పూర్తిచెయ్యరు, సస్పెన్సులో పెట్టేస్తారు మీతో ఇదొక విచిత్రం." అన్నాడు చూడామణి. అతడే కొంతసేపాగి" మంచివాళ్లకు కూడా అభిమానమనేది ఉంటుంది. అది దెబ్బతింటే ఓర్చలేరు. అటువంటి దేదయినా సంభవించిందేమో? కొందరు ఎంత మంచివాళ్లయినా అనుమాన పిశాచంతో ఓడింపబడుతూ ఉంటారు. అలాంటిదేదో...''

"మీరన్నటువంటివి కానేకాదు" గట్టిగా అరిచాడు ఆనంద్.

"పోనీలెండి. మీరే ఎప్పుడో చెప్తారు. అందాకా ఆగుతాను'' నవ్వాడు చూడామణి ఆనంద్ అసహనాన్ని చూసి.

# 8

డాక్టరు రంజన్ పరంజ్యోతి హావుస్ సర్జన్‌లుగా చేరి ఏడాది అయిపోయింది. మదరాసు స్టాన్లీ మెడికల్ కాలేజిలో మొదటి సంవత్సరంనుంచీ కలిసి చదువుకున్నారు. స్నేహాన్ని బాగా పెంచుకున్నారు. ఐదవ సంవత్సరం చదివేటప్పుడు వివాహం చేసుకుందామనుకున్నారు కోర్సు పూర్తికాగానే. ఇద్దరూ కలుసుకున్నప్పుడు పెళ్లిచేసుకున్న తరువాత ఇద్దరూ "పై చదువులు చదవాలని'' పరంజ్యోతి అనేది. ''చదువుదాం" అనేవాడు రంజన్. ఇద్దరం చెరొక సబ్జక్టులో ఎం. డి. అవుదాము. అయిన తరువాత ఏ నగరంలోనో ప్రైవేటుగా ప్రాక్టీసు చేద్దాం ' అనేది పరంజ్యోతి

"చేద్దాం, గాని..." నీళ్లునములుతున్నట్టుగా అనేవాడు రంజన్.

"అలా ఆగిపోతావేం చెప్పు ?" నిలవదీసేది పరంజ్యోతి.

"సరే సరే. ఎక్కడయినా ప్రాక్టీసు చేద్దాంలే'' సర్దేవాడు రంజన్.

ఇలా అనుకుంటూనే ఎం. ఎస్. పూర్తిచేశాడు రంజన్. పరంజ్యోతి గైన కాలజీలో ఎం. డి అయింది. ఫలితాలు తెలిసిన తరువాత ఇద్దరూ కలిసి స్నేహితులకు పెద్ద హోటల్లో విందుచేశారు.

మరునాడు ఇద్దరూ కలుసుకున్నప్పుడు రంజన్ "జ్యోతీ ! ఇంక చెప్పు మన ప్రోగ్రాం సంగతి ?'' అన్నాడు ఎంతో ఉత్సాహంతో.

"నువు చెప్పు'' అంది చిరునవ్వుతో.

అదివరలో ఇద్దరూ పెళ్లిచేసుకోవటాన్ని గురించి చాలాసార్లు మాట్లాడుకున్నారు. ఉండబోయే ఇల్లు ఎట్లా ఉండాలో - ఎటువంటి ఫర్నిచరు ఉండాలో- ఎంతమంది పిల్లలు కావాలో - లాంటి విషయాలన్నీ పదే పదే చర్చించుకుని ఒక నిర్ణయానికి వచ్చారు - పెళ్లినాడు ఇవ్వబోయే డిన్నర్ పార్టీని గురించీ అతిథులను గురించీ కూడా. పెళ్లి అయిన తరువాత డబ్బు ఎట్లా ఖర్చుచెయ్యాలో ఎంతెంత నిలవచెయ్యాలో-బ్యాంక్ ఎకౌంటు జాయింటుగా ఉండాలా విడివిడిగా ఉండాలా అన్నవి కూడా చర్చకు వచ్చి నిర్ణయమైపోయాయి కాని — మూడు రోజులకు పెళ్లి జరుగుతుందనగా - ఇద్దరూ కలుసుకున్నప్పుడు - అప్పటికి పెళ్లి డ్రెస్సులు కూడా తయారయ్యాయి - మామూలుగా పరంజ్యోతి అడిగింది"

"రంజన్, ఇంతకూ ఏ ఊళ్లో ప్రాక్టీసు పెడదాము చెప్పవూ ?"

నవ్వాడతడు "హనీమూన్‌కు ఎక్కడికి వెళ్లేదీ సెటిల్ అయిపోయింది కదా.

ఇంకాదేన్ని గురించి అడుగుతాననుకుంటున్నాను. ఇదా ? ఊరి సంగతి మనం నిర్ణయం చేసుకున్న వాటిల్లో లేదా ?" అన్నాడు మామూలుగా.

పరంజ్యోతి గబగబా నోటుబుక్కు తీసి చూసింది దానిలో అన్ని విషయాలనుగురించీ నిశ్చయమైనట్టుగా టిక్ చేసి ఉన్నది కాని - ఏ ఊరిలో ఉండబోయేదీ అనిశ్చితంగా ఉంది.

డాక్టరు పరంజ్యోతికి రంజన్‌పట్ల గౌరవమూ - ఆరాధనా - అపారమయిన ప్రేమా ఉన్నాయి అతడి నిర్ణయాలపట్ల అతడిమీద ఉన్నటువంటి గౌరవము కూడా ఉంది అతడు ఓకే చేసిన విషయం మరి తానింక ఆలోచించ నవసరం లేదన్నంత అతడిపట్ల ఆరాధన. కాని ఒక్క విషయములో అంటే డబ్బు విషయంలో అతడితో ఏకీభవించటానికి ఆమె మనసు వెనకడుగు వేస్తున్నది.

రంజన్‌కు ఎక్కడెక్కడి రోగులూ తనదగ్గరికే రావాలని ఉంటుంది అందరిలో పాపులర్ కావాలని ఉంటుంది. అంతవరకూ తనూ ఒప్పుకుంటుంది అయితే ఏ ఊళ్లో ప్రాక్టీసుపెట్టాలని ? ఎక్కడెక్కడి రోగులూ అతడిదగ్గరికి ఎక్కడ ప్రాక్టీసుపెడితే వస్తారు ?

అదే అడిగి తెలుసుకోవాలి తెలుసుకోవటంకాదు-ఒప్పందం కుదరాలి

"లేదు రంజన్ ఏ ఊరో చెప్పు ?" నోటుబుక్కు చేతిలో పట్టుకుని పెన్సిల్‌తో దానిమీద కొడుతూ అడిగింది

"దానిదేమిటి జ్యోతీ ? అది చాలా చిన్నవిషయం ఏ ప్రాంతంలో డాక్టర్లు లేరో-అక్కడ ప్రాక్టీసు పెడితే ఎక్కడెక్కడి వాళ్లూ మనదగ్గరికొస్తారు ఏమంటావ్ ?" అన్నాడు హుషారుగా

"అంటే పల్లెటూరనేగా నీ ఉద్దేశ్యం ?" కనుబొమలు పైకెత్తి ప్రశ్నించింది.

"అవును అక్కడే మనం రోగులకు బాగా సేవచేసే అవకాశం లభిస్తుంది నిపుణులయిన డాక్టర్లకు రోగులకు సేవచేసే భాగ్యం తప్ప కోరుకునేదేముంటుంది చెప్పు ?" అతడిలో ఉత్సాహం ఇనుమడించింది

చటుక్కున పరంజ్యోతి కనుబొమలు ఆశ్చర్యంగా కలుసుకున్నాయి గుండెలో చురుక్కుమన్నట్టుగా బాధ కలిగింది

రంజన్‌తో అభిప్రాయభేదం ఇంతవరకూ రాలేదు రాదనే గట్టి నిశ్చయంతో ఉన్నది పరంజ్యోతి. కాని ఇదేమిటి-ఇట్లా అంటాడు ? మనసెందుకో అదోలా అయిపోతున్నది ఆ ఉద్వేగంలో "పల్లెటూళ్లయితే రోగులు చాలామంది వస్తారు.

బాగా డబ్బు సంపాదించవచ్చునని కదూ ?" కొంచెం కరుకుగానే ధ్వనించిందామె కంఠం.

"అదేంమాట జ్యోతీ. డాక్టరనే వాడికి ఉండదా ? రోగులకు సేవచేయటమూ డబ్బు సంపాదించటమూ రెండూ సహజమయిన ఆశయాలేగా!'' అన్నాడు.

"కాని–ఆ పల్లెటూళ్లంటే నాకు నచ్చదు రంజన్. కేవలం డబ్బుకోసం ఆ పల్లెల్లో ఉండాలంటే కష్టం" అన్నది.

"డాక్టరనేవాడు ఇటువంటి చిన్నచిన్న కష్టాలను మనసులో పెట్టుకో కూడదు.''

"అబ్బ! ఆ పల్లెటూళ్లను తలుచుకుంటేనే నాకు ఒళ్లు జలదరిస్తుంది. నగరంలో ఉండే సౌకర్యాలలో ఒక్కటయినా ఉండదు. కనీసం ఉండటానికి మంచి యిల్లయినా ఉండదు.'' పెదవి విరిచింది పరంజ్యోతి.

''ఉండనిమాట నిజమే. కాని అలవాటు చేసుకోవాలి."

నా వల్లకాదు! నేను నగరాన్ని వదలి బ్రతకలేను" ఖండితంగా అన్నది.

ఇద్దరిమధ్య ప్రసంగం అరగంటవరకూ సాగలేదు. తరువాత పరంజ్యోతే అన్నది "నా జన్మలో నేను పల్లెటూళ్లో అడుగుపెట్టను. ప్రాక్టీసు బాగా లేకపోయినా నగరంలోనే ఉంటాను'' తలవంచుకుని.

''అయితే మరి మనిద్దరికి...''

"పెళ్లెట్లా అంటావు. అదేగా నీవడగబోయే ప్రశ్న !"

''అవును" నిర్వికారంగా అన్నాడు.

''ఎట్లా జరుగుతుంది ఆ కుగ్రామాలలో ఉండదలచుకుంటే ?"

"జ్యోతీ! దానికోసం పెళ్లి ఆగిపోతుందా ?'' ఆశ్చర్యం కలుగుతోంది అతడికి.

టప్పున కంటిరెప్పలు వాలిపోయాయి పరంజ్యోతికి. ''ప్రాణ సమానుడనుకున్న రంజన్‌ను వదలుకోవటమా ఆ చిన్నవిషయానికి ?" అనుకుని బేరమాడాలనుకుంది.

"దానికోసం పెళ్లి ఆగిపోవటమా ! హాస్యమాడటం లేదుకదా ?'' అన్నది తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

"మరి ?...నీకేదో పెద్ద అభ్యంతరంగా కనబడుతుంటే మరి ఏమవుతుంది?" కినుకవహించినట్టుందా కంఠధ్వని.

''పోనీ చూద్దాం ఒక సగానగిసాటు" సర్దబోయింది పరంజ్యోతి.

"చూద్దామంటే అర్థం? నేను ఒకసారి కాలుపెట్టానంటే మరి అక్కడినుంచి కదలను. ఆ సంగతి తెలుసుకో" ఖండితంగా అన్నాడు

"అదే నేనంటున్నాను. ఆ జీవితంకూడా ఒక సంవత్సరంపాటు చూస్తానని" విపులీకరించింది

"ఒక సంవత్సరంపాటు చూస్తావు. ఆ తరువాత నచ్చకపోతే?" నిలవదీశాడు

"నచ్చకపోతే...అదే నేను..."

"డైవోర్సా? అదొక్క కారణమే చాలా డైవోర్సుకు?" ఆమె ముఖంలోకి తీవ్రంగా చూశాడు.

"అటువంటిది వద్దనుకుంటే మరో మార్గముంది మనం కాంట్రాక్టు పెళ్లి చేసుకుందాము ఆ కాంట్రాక్టు ఒక సంవత్సరానికి ఆ సంవత్సరం మనిద్దరము సర్దుకుని బ్రతకగలిగితే కాంట్రాక్టు పొడిగిద్దాము. ఆ తరువాత పిల్లలు పుట్టటానికి అవకాశం కలుగుతుంది."

"అలాగా?" హేళనగా నవ్వాడు రంజన్ "జ్యోతీ, నాకు ఈ కాంట్రాక్టులూ, కండిషన్లూ నచ్చవు. పెళ్లి మంచి మనసుతో చేసుకోవాలి మంచి మనసుతో సర్దుకుంటూ జీవితాలు గడపాలి. ఎప్పుడు తుమ్ము వస్తుందో-ఎప్పుడు ముక్కు ఊడిపోతుందో అని భయపడుతూ జీవితం గడపటం నాకు నచ్చదు. బై బై" అంటూ చివాలున లేచి విసురుగా వెళ్లిపోయాడు.

"రంజన్! రంజన్! మాట" అంటూ లేచి గట్టిగా పిలిచింది పరంజ్యోతి.

"వీల్లేదు" అంటూ చెయ్యిత్రిప్పుతూ వెళ్లిపోయాడు.

రాత్రి పడుకోబోయేటప్పుడు జరగని తన పెళ్లినిగురించి పరంజ్యోతి సుమనకు చెప్పింది.

"నేను ఒక్క సంవత్సరం చూద్దామన్నమాటకు నాకు కాకుండాపోయాడు రంజన్. నా మనసు పెద్ద గాయమయింది. ఆ బాధ భరించలేక విదేశాలలో పదేళ్ల పనిచేసి వచ్చాను. ఎక్కడున్నా ఆ గాయం మానటంలేదు. నా మనసంతగా వశపరచుకున్న రంజన్ను నేను తెలివితక్కువతనంతో పోగొట్టుకున్నాను." ఎంతో బాధతో చెప్పింది పరంజ్యోతి

"ఇప్పుడెక్కడున్నాడు ఆయన?"

"తానునుకున్న చోటనే ఉన్నాడు. హాయిగా పెళ్లిచేసుకున్నాడు. ముగ్గురు పిల్లలు పుట్టారు."

"మీకెట్లా తెలుసు ?''

"ఉత్తరాలు వ్రాస్తాడు. మొన్న ఇక్కడ పరీక్షలకు ఎగ్జామినర్‌గా వచ్చిన డాక్టరుతో నన్ను చూడ్డానికి వచ్చాడు. కుశలప్రశ్నలు వేశాడు 'ఇంకా పెళ్లి చేసుకోలేదూ?' అంటూ గాయాన్ని కెలికాడు."

"అవును మమ్మీ. నేనూ అదే ప్రశ్న వేస్తున్నాను.'' ప్రేమతో ఆమె చేతిని తనచేతిలోకి తీసుకుంది సుమన

''జరిగితే రంజన్‌తోనే జరగాల్సింది పెళ్లి. ఒకరిమీద నిలిపిన మనసును మార్చుకుని ఇంకొకరిమీదికి మళ్లించటం నాకు నచ్చదు. అప్పటి మా యిద్దరి స్నేహాన్నీ ప్రేమనూ తలుచుకుంటూ బ్రతకలేనా? కక్కుర్తిపడటం నా స్వభావంకాదు'' కళ్లు తుడుచుకుని తిరిగి కళ్లజోడు పెట్టుకుని తలవెంట్రుకలు సర్దుకున్నది.

"కాని సుమనా! ఆ దెబ్బతో నాకు మనష్యుల విలువ అంటే ఏమిటో తెలిసింది. ఒకసారి పోగొట్టుకుంటే తిరిగి సంపాదించలేనివేమిటో తెలిసింది. పట్టుదల మనష్యుల జీవితాలను ఎట్లా పాడుచేస్తుందో-ఎట్లా చెలగాటమాడుతుందో తెలిసింది. కాని ఇప్పుడనుకుని ఏం లాభం! అంతా చెయ్యిజారిపోయింది'' పరంజ్యోతి కళ్లూ ముక్కూ వాచి ఎర్రబడ్డాయి.

ఆమెను చూస్తుంటే సుమన గుండె ఛిన్నాభిన్నమైపోయింది. కింద పడిపోతానేమో ననుకుంటూ కుర్చీని గట్టిగా కరిచి పట్టుకుంది.

"సుమనా, నిన్ను చూస్తుంటే-నీవు నేను చేసినటువంటి తప్పు చెయ్యలేదుకదా అనిపిస్తోంది." సుమన కళ్లల్లోకి దీర్ఘంగా చూసింది పరంజ్యోతి తడికళ్ళతో.

సుమన కడుపులోనుంచి తెరలు తెరలుగా దుఃఖం పైకి వస్తున్నది.

తడికళ్ళతో నవ్వుతూ ''సుమనా ఒక విచిత్రం చెప్పనా? మనకు చదువున్నది. సంపాదన ఉన్నది స్వాతంత్ర్యం ఉన్నది. అన్నీ ఉన్నా ఎందుకీ పరితాపం?'' సుమన భుజమ్మీద చెయ్యేసి కుదిపింది

ఎందుకు అన్నట్టు చూసింది సుమన.

''అదే సృష్టి రహస్యం! అదే స్త్రీ స్వభావం! ఎంత పైకిపోయినా ఇదే-ఇదే-ఇంతే-ఇంతే.'

మరికొంతసేపటికి పరంజ్యోతి "మొన్న నేనేం చేశానో తెలుసునా? రంజన్ ఊరికి వెళ్ళేనాడు కాంటీన్‌కు వెళ్ళి రంజన్‌కు ఇష్టమైన డిషెస్ ఆర్డరుచేసి అతడితోపాటు నేనూ తిని చెమర్చిన కళ్ళతో సాగనంపి ఇంటికి వచ్చాను'



ఆనాటి సంగతి సుమనకు బాగా జ్ఞాపకమున్నది. పరంజ్యోతి వస్తూనే తన గదిలోకి వెళ్ళిపోయింది తలుపు లేసుకుంటూ. తెల్లవార్లూ నిద్రపోనట్టుగా ఉంది ముఖం మరునాడు చూస్తే. ఒకరోజంతా పలకరిస్తే చాలు కన్నీళ్ళు కారేటట్టు కనబడ్డది.

ఆమె గొప్ప డాక్టరు. గొప్ప గైనకాలజిస్టు.

అయితే ఏం? అసలయిన ప్రేమ అగ్ని వంటిది. దానికి వయసుతో నిమిత్తం లేకుండా కాల్చివేస్తూ ఉంటుంది అనుకుంటూ లేచింది సుమన, గడియారం చూసుకుని.

## 9

పరీక్షలయ్యాయి. నరేంద్రకు కస్తూరి ప్యాసయినట్టు తెలిసింది. ఆ సంగతి చెప్పటానికి హాస్టల్‌కు వెళ్లాడు నరేంద్ర.

"నీవు పరీక్ష ప్యాసయ్యావు. రేపటితో మన కాంట్రాక్టయిపోతుంది. నీ ప్రోగ్రాం

చెప్పు. మీ నాన్నగారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందా ?'' కస్తూరిని పిలిపించి కుర్చీలో కూర్చోబెట్టి అడిగాడు నరేంద్ర.

కస్తూరికి దుఃఖం ముంచుకువస్తోంది. ఇతడు వచ్చి తనను కాపాడక పోయినట్లయితే తన బ్రతుకు వీధులపాలయ్యేది నరేంద్ర దేవుడిలా కనబడు తున్నాడు.

మీకు కృతజ్ఞత వట్టిమాటలతో చెప్పలేను. నాకోసం మీరు కష్టాలను కొని తెచ్చుకున్నారు. మీ అమూల్యమయిన జీవితంలో మూడు సంవత్సరాలపాటు నేను కంటకాలు పెంచాను. ఈ పాపానికి పరిహారమేమిటో నాకు తెలియటం లేదు.'' నరేంద్ర పాదాలను కళ్లకద్దుకుంది కస్తూరి

తెల్లబోయి చూస్తూ ఆమెను చేతులతో వారించాడు నరేంద్ర.

"నాకంతా తెలిసింది-నాకోసం మీరు మీ భార్యాబిడ్డలను కంటితోనయినా చూడలేదని, ఆ ఇల్లాలు కృశించిపోతున్నా పట్టించుకోలేదని నన్ను క్షమించండి'' జలజలరాలే కన్నీళ్లని తుడుచుకున్నది.

"నా సంగతి అట్లా ఉంచు. నీ సంగతి చెప్పు. నిన్ను ఒ దరికి చేర్చితేగాని నా సంగతి తేలదు'' తొందరగా చెప్పు అన్నట్టుగా అన్నాడు.

"నా సంగతి తేల్చుకుంటాను. మీకోసమయినా తేల్చుకుంటాను. మీకోసం నేనోదారికి చేరే మార్గం ఆలోచించాను "

"ఏమిటది ?''

"నాన్నదగ్గరినుంచి ఉత్తరం వచ్చింది. ఇక్కడే హవుస్‌సర్జన్ ముగించుకు రమ్మని నేనిక్కడే ఉండి పెళ్ళిచేసుకుందా మనుకుంటున్నాను" ఒక నిర్ధారణకు వచ్చినట్టుగా స్థిరంగా ఉంది కంఠధ్వని.

ఆశ్చర్యపడ్డాడు నరేంద్ర. ఆమెను రక్షించటం కోసమే ఆమెతో మూడేళ్ల కాంట్రాక్టుపెళ్లి రిజిస్టరుచేసుకున్నాడు. ఆ తరవాతనే సుమనతో పెళ్లి జరిగింది. తను పెళ్లికి కొంత వ్యవధి కోరితే తండ్రి ఒప్పలేదు. సుమనకూ తనకూ సంబంధంలేకుండా ఈ రెండేళ్లూ గడుపుదామంటే అనుకున్నట్టుగా కుదరలేదు. తన మనసును నిలుపుకోలేకపోయాడు. సుమన దృష్టిలో తానొక కఠినాతి కఠినుడిగా మారవలసి వచ్చింది కస్తూరికోసం. మనసులో పొర్లుతున్న బాధను ఎదుర్కొనలేకనే సుమన తనకెదురుగా కాపరంపెట్టింది. అందరూ ఎత్తుకుని మురిసిపోతున్న మంజును తాను కళ్లెత్తయినా చూడలేకపోతున్నాడు. దీనికి పరిహారము త్వరలోనే కావాలి.

''పెళ్ళికొడుకుని నీవే వెతుక్కుంటున్నావా ? ఎవరయినా చూస్తున్నారా ?" నవ్వొచ్చింది నరేంద్రకు.

''కసుకోవాలనుకుంటే దొరకరా ?" అమాయకంగా అడిగింది.

"మన మిద్దరం పెళ్ళికానట్టే ఉన్నామనుకో. కాని అందరి దృష్టిలో నీవు ఒక సారి పెళ్ళయినదానవు కదా. నీ సంగతి ఆమూలాగ్రంగా తెలిసినవాడు దొరకాలి."

"దొరక్కపోడు. ఏమంటారు ? ఇవాళ డాక్టరు ఫిలిప్సుఇంట్లో పార్టీకి నన్నుకూడా పిలిచారు. రానా మరి ?''

''నీ యిష్టం. జాగ్రత్తగా మసలుకో'' లేచాడు నరేంద్ర. అతడు స్కూటరు మీద ఒక ఫర్లాంగుసమారం వెళ్ళాడో లేదో - ఆనంద్ ఎదురుగా నిలబడి చెయ్యి పైకెత్తాడు ఆగమని అతడిని చూడగానే మామూలుగా గుండె దడక్కుమన్నది నరేంద్రకు.

''నన్ను హాస్పిటల్ కాంపస్‌కు తీసుకువెళ్ళవూ నరేందర్ ? చాలా అర్జంటు పని ఒకటి తగిలింది'' అన్నాడు. పరుగెత్తుకుంటూ వచ్చినందువల్ల వచ్చిన ఆయాసాన్నీ అలుపునూ సర్దుకోటానికి గుండెమీద చేత్తో రాసుకున్నాడు.

''ఏమిటా అర్జంటు పని ?''

"చెప్తానయ్యా చెప్తాను. ముందు నన్ను ఎక్కనీ నీ వెనకాల ?''

''ఉన్నమాట చెప్పొద్దూ? నేను హాస్పిటల్ వైపుకు పోవటంలేదు. పండరిపూర్ వెళ్తున్నాను. మా యింటిని గురించిన తగాదా ఏదో వచ్చిందట. అద్దెకున్న వాళ్ళు టెలిగ్రాం ఇచ్చారు. ఈ స్కూటరు స్టేషన్‌దగ్గరఉన్న నా స్నేహితుడి ఇంట్లోపెట్టి మధ్యాహ్నం బండి ఎక్కేస్తాను'' నరేంద్ర తలదించుకుని ఎటో చూస్తూ అన్నాడు.

''నిజమేనంటావా ఇదంతా ?" నోరు తెరిచాడు ఆనంద్.

"నేను ఏది చెప్పినా నీకు నిజమనిపించదు. అది నా దురదృష్టం." నొసలు కొట్టుకున్నాడు నరేంద్ర.

''జరిగినదాన్నిబట్టే నా కనుమానం. నేను మాత్రం ఏం చెయ్యను చెప్పు ? ఈ సంగతి అటుంచు. నిన్నొక విషయంలో సలహా అడుగుదామనుకుంటు న్నాను. చూడామణిని గురించి నీ అభిప్రాయమేమిటి ? మనిషి మంచివాడేనా?" నరేంద్ర భుజమ్మీద చెయ్యేశాడు.

"మంచివాడేనా అంటే ఏ విషయంలో ? ఎందుకు కావలసివచ్చిం దిప్పుడు?"

"మనిషి మంచివాడేనా అంటే పెళ్ళికి పనికొస్తాడా లేడా ? పెళ్ళికొడుక్కు కావలసిన మంచితనం ఉందా లేదా అతడి దగ్గర ?'' ఆనంద్ నరేంద్ర ముఖం లోకి చూశాడు.

నరేంద్ర తలవంచుకున్నాడు. ఆనంద్ ఏమాట మాట్లాడినా తనను ఎత్తి పొడిచినట్టుంటుం దీమధ్య.

"నా ఉద్దేశ్యం ఏమిటంటే వేరే దురభ్యాసాలు లేవుకదా అని. పెళ్ళి చేసుకుంటే భార్యను తన ఇంటికి తీసుకువెళ్ళి ప్రేమతో చూసుకునేవాడేనా అని.'' ఆనంద్ స్టాండువేసిఉన్న స్కూటరును ఆనుకుని మాట్లాడుతున్నాడు.

నరేంద్రకు గుండెమీద సుత్తెతో కొట్టినట్లయింది. రోడ్డుమీద ఆపుచేసి ఇటువంటి మాటలు మాట్లాడుతున్నందుకు కోపంవచ్చి ముఖం ఎర్రబడ్డది. ఆనంద్ మాట్లాడకుండా ఉండనిచ్చేటట్టులేడు.

"నాకేం తెలుస్తుంది ? భార్యను తన యింటికి తీసుకువెళ్ళేవాడి ముఖం ఎట్లా ఉంటుంది ? ముఖాన రాసిఉండదుకదా'' అన్నాడు వదిలించుకోవటానికి.

''అదికాదు నరేందర్. కోపం తెచ్చుకోకు. కస్తూరి నాకు చెల్లెలివంటిది. ఎక్కడయినా తనకో మంచి సంబంధం చూడమన్నది. చూడామణిని గురించి తెలుసుకోమన్నది. అందుకోసం నిన్ను సలహా అడుగుతున్నాను.'' ఇదంతా నిజమన్నట్టుగా అతడి చేతిలో చెయ్యివేశాడు.

"ఆనంద్. నన్నింకా చంపకు నే నొకరికి సలహాలిచ్చే స్థితిలో లేను. నన్ను పోనివ్వు."

"అహా ? అలా వీల్లేదు. నీ అంతటి మంచివాడు లేడనిపించుకుంటున్నావు. కస్తూరి నలా నడిరోడ్డుమీద వదిలిపెడతావా ? ఒక మంచివాడు–నీఅంత మంచి వాడి చేతిలో పెట్టటం నీ బాధ్యతకాదూ ?" చెయ్యిపట్టుకున్నాడు ఆవేశంతో.

"బాబూ నీ కోదండం. నన్నింతటితో వదలిపెట్టు." చెయ్యి విడిపించుకుని స్కూటరు స్టార్టుచేసి దూసుకుపోయాడు.

అతడు వెళ్ళినవైపే చూసి నవ్వుకున్నాడు ఆనంద్.

ఫిలిప్సు ఇంటిముందు కుర్చీలు వేశారు. బల్లలమీద తెల్లటి బట్టపరచి అక్కడక్కడ పూలతోనిండిన వాజులను పెట్టారు.

అప్పుడే చెట్లకుపోసిన నీరు నేలలోకి ఇంకి ఒక మాదిరి వాసనను వ్యాపింపచేసింద. రంగురంగులపూలు నయనానందకరంగా ఉన్నాయి. సాయంకాలము

చల్లగా అహ్లాదకరంగా ఉన్నది ఈ వాతావరణంలో అక్కడ చేరినవారంతా ఉల్లాసంగా కబుర్లు చెప్పుకోవటం మొదలుపెట్టారు

డాక్టర్లు ఒకళ్ళతో ఒకళ్ళు ఎప్పుడూ కేసులను గురించే మాట్లాడుకుంటారు. డాక్టరు పరంజ్యోతి అలిసిపోయినట్టుగా ఒక కుర్చీలో కూర్చుంది ఆమె పక్కన మంజునెత్తుకుని సుమన కూర్చుంది.

ఎక్కడినుంచో ఆనంద్ వచ్చాడు. అతడివెంట కస్తూరి సామాన్య వేషధారణతో వచ్చింది. డాక్టరు పరంజ్యోతి ఆమెను గుర్తుపట్టి కుశలప్రశ్నలు వేసింది. ఆనంద్ వెనక నడుస్తున్న కస్తూరినిచూసి అందరూ ఒక మాదిరిగా చూశారు అంతా గమనిస్తూనే ఆమె తలవంచుకుని ఒక చివరగావెళ్ళి కూర్చుంది ఆనంద్ చూడామణి, డాక్టర్ రమణల దగ్గర కూర్చున్నాడు.

అందరికీ ఐస్క్రీము ఫ్రూట్‌సలాడ్- మిక్స్చరు ప్లేట్లలో అందించబడ్డాయి. ఆఖరికి కోకాకోలాలు వచ్చాయి.

కబుర్లు — నవ్వులు - హాస్యాలు - ఆ దీపాల వెలుగులో కోలాహలంగా ఉంది.

ఆనంద్ చూడామణితో కస్తూరి కుర్చీదగ్గరికి వచ్చాడు. కస్తూరి లేచినిలబడ్డది. ఆమెను కూర్చోమని చూడామణిని పరిచయంచేశాడు ఆనంద్. కస్తూరి నమస్కారం చేసింది

కస్తూరిని గురించి ఆనంద్ అంతకుపూర్వం చెప్పినదంతా జ్ఞాపకం తెచ్చుకుంటూ ఆమెను పరిశీలనగా చూడటం మొదలుపెట్టాడు చూడామణి. తన వయసూ, ఆమె వయసూ లెక్కలుకట్టాడు ఆమెలోని అందచందాలు ఏ కోణాన్నుంచిచూస్తే బాగా ఉంటాయోనని ఆలోచిస్తున్నాడు. ఉద్యోగంలేని తనకు ఒక డాక్టరు మంచి ఇల్లాలు కాగలదా అని యోచిస్తున్నాడు.

''కస్తూరీ! చూడామణిగారు ప్రపంచ విజ్ఞానవేత్తలలో ఒకరనుకో నీకు మంచి వాతావరణాన్ని కల్పించి - నీ వైద్యవృత్తికి అన్నివిధాలా తోడ్పడతారు అయితే కొద్దిగా వయస్తారతమ్యము ఉంటుంది. ఏమంటావు ?'' ఆనంద్ ఇద్దరి ముఖాలూ చూశాడు

కస్తూరి నవ్వింది ఆ నవ్వులో అయసంత పొడగు నేనూ ఉన్నాను అన్న మాట గ్రాహ్యమయింది చూడామణికి.

అందరూ లేచారు డాక్టరు ఫిలిప్సు దగ్గర అందరూ కృతజ్ఞతలుచెప్పి సెలవు తీసుకుంటున్నారు.

హఠాత్తుగా అందరికీ జ్ఞాపకం వచ్చింది. 'ఏడీ డాక్టరు నరేంద్ర ? ఎక్కడున్నాడు ? రాలేదా ఏమిటి ?' ఈ ప్రశ్నలు ఒక రొదలా వినిపించాయి.

'ఎందుకు రాలేదు ?'

'ఎక్కడికి వెళ్లాడు ?'

"మంచివాడాయెను! ఏ మంచిపని చేయటానికి ఎక్కడికి వెళ్ళాడో ?" అనుకోకుండా ఆనంద్ అనేశాడు అందరూ నవ్వారు.

వచ్చినప్పటినుంచీ కళ్ళతో ఆ ప్రదేశమంతా వెదికింది సుమన ఆ మాటలతో రాలేదని రూఢిచేసుకుంది.

మంజు మెల్లగా తల్లిఒడిలోనుంచి జారి ఆ సందడిలో అందరి మధ్యగా వెళ్ళి ఒకచోట ఆగిపోయింది. అన్నీ కొత్తముఖాలు. మళ్ళీ వెనక్కు తిరగాలని ప్రయత్నించింది. దారి దొరకలేదు. రెండు చేతులతో జనాన్ని ఒత్తిగించుకుంటూ ముందుకు వెళ్ళింది. బల్లలూ, కుర్చీలు అడ్డం వచ్చాయి. బల్లకిందదూరి అవతలి వైపుకు చేరుకుంది. కాని తల్లిదగ్గరికి ఎటు వెళ్ళాలో తెలియక ఏడవటం మొదలుపెట్టింది

సుమారు రెండువందలమంది గుంపులు గుంపులుగా చేరినచోట ఒడిలో నుంచి జారి. తప్పిపోయిన మంజుకోసం సుమన లేచి దిగాలుపడ్డ ముఖంతో నీళ్లు ఊరుతున్న కళ్లతో వెదకటం మొదలుపెట్టింది.

ఒక్కొక్కరే వెళ్లిపోతున్నారు. కొంతసేపటికి ఆ ప్రదేశంలో పాతికమంది మిగిలారు.

మధ్య మధ్య సుమన డాక్టర్ పరంజ్యోతి దగ్గరికొచ్చి మంజు వచ్చిందేమోనని చూస్తున్నది. ఆమెకు కంగారెక్కువయిపోయి "మమ్మీ, మంజు కనబడటంలేదు" అన్నది కన్నీళ్లాపుకుంటూ.

గతరాత్రి కలలో డాక్టర్ రంజన్‌తో మధురసంభాషణలు జరిపి పరవశించిన డాక్టరు పరంజ్యోతి వాటిని తలుచుకుని ఉస్సురంటూ ఇంకా కుర్చీలోనే కూర్చుండిపోయింది సుమన మాటకు దిగ్గున లేచి "ఆఁ ?" అంటూ తనుకూడా వెదకటం మొదలుపెట్టింది.

ఫిలిప్సు ఎదురుగా వచ్చాడు వాళ్లిద్దరినీ చూసి అతడు కూడా వెతకటం మొదలుపెట్టాడు అందరూ కలిసి ఫిలిప్సు ఇంట్లోకి వెళ్లారు హాలులో ఫిలిప్సు నాలుగేళ్ల కొడుకుతో ఆటసామాన్లమధ్య కూర్చుని ఉంది మంజు.

పరుగెత్తుకుంటూ పోయి మంజును గుండెకు హత్తుకుని కన్నీళ్లు కార్చింది సుమన.

డాక్టరు పరంజ్యోతి, ''ఇదా తల్లిప్రేమ !'' కళ్లు పెద్దవిచేసి సుమన వీపుమీద తట్టింది.

''డాక్టర్ ఫిలిప్స్ ! వీళ్లిద్దరూ అదృష్టమనే దారి తప్పిపోయి, దానికోసం వెతుక్కుంటున్నారు. చూశావు కదూ ఈ అమ్మాయి బాధ పిల్లకోసం !'' వెళ్ల టానికి అనుమతి కోరుతూ నిలబడ్డది డాక్టరు పరంజ్యోతి.

ఫిలిప్సు తెల్లబోయి చూస్తుంటే, తరువాత చెబుతాను అన్నట్టు కళ్లతో సైగ చేసి సుమనతో ఇల్లు చేరుకుంది డాక్టరు పరంజ్యోతి.

అందరూ వెళ్లిపోయిన తరువాత ఫిలిప్సు లోపలికి వెళ్తుండగా నరేంద్ర వచ్చాడు, వేళకు రాలేకపోయినందుకు క్షమాపణ కోరుతూ.

నరేంద్ర చేతికి ఐస్క్రీమ్ ప్లేటు యిస్తూ పార్టీ ఎంత చక్కగా జరిగిందో వివరంగా చెప్పాడు ఫిలిప్సు. మధ్యలో అందరికీ ఒక్కసారే నరేంద్ర ఎలా జ్ఞాపకం వచ్చిందీ - అందరూ అతడికోసం ఎలా వెదికిందీ చెప్పాడు.

"చివరకు ఒక చిన్న అపశృతి ఏర్పడ్డది" అన్నాడు ఫిలిప్సు.

"ఏమిటది ? ఏమయినా ఏక్సిడెంటా ?'' డాక్టర్లు మామూలుగా అనుకున్నట్టు అన్నాడు నరేంద్ర.

''కాదు కాదు. పెద్దదేం కాదు. చిన్న సంఘటన. చివరకు నవ్వులతోనే ముగిసిందనుకో. ఒక చిన్నపిల్లను తీసుకుని మన ఆఫీసులో పనిచేస్తున్న ఆమె డాక్టరు పరంజ్యోతితో వచ్చింది. ఆ పిల్ల తల్లిఒడిలోనుంచి ఎప్పుడు జారిపోయిందో - అటూ ఇటూ తిరిగి మాయింట్లో అబ్బాయితో ఆడుకుంటోంది. ఈ లోపల పిల్లకోసం ఆతల్లి - డాక్టరు పరంజ్యోతి ఆదుర్దా చెప్పనలవి కాదనుకో. ఆ పిల్లకోసం నేనూ వెదికాను. కనబడ్డ తరవాత ఎత్తుకుని రెండు బుగ్గలూ ముద్దుపెట్టుకొని గాని వదలలేకపోయాను. పిల్ల కనబడ్డ తరువాత తల్లి ముఖంలో సంతోషం చూసి తీరాలి" ఎంతో సంతోషంతో చెప్పుకుంటూ పోతున్నాడు.

"అలాగా ?'' నరేంద్ర లేచి గుడ్నైట్ అంటూ గేటుదాటాడు. అతడి పాదాలు అక్కడికి నూరు గజాల దూరంలో ఉన్న డాక్టరు పరంజ్యోతి యింటివైపుకు దారితీశాయి.

గేటుముందర నిలబడ్డ నరేంద్ర మనసులో ఏమి మెదిలిందో - గిరుక్కున తన క్వార్టర్సు వైపుకు వెళ్లాడు.

# 10

రిజిస్ట్రార్ ఆఫీసునుంచి చూడామణీ కస్తూరీలతో నరేంద్ర ఆనంద్‌లు భవానీ హోటల్‌కు టాక్సీలో వెళ్లారు. అప్పటికే విందు ఏర్పాట్లు చేస్తున్నారు డాక్టర్ రమణా రాధమ్మాను మిత్రులుగాని, తోటి డాక్టర్లుగాని లేకుండానే చిన్న విందు జరిగింది

నరేంద్ర తను తీసుకువచ్చిన చీరె రవికలబట్టా పళ్ళూ పూలు కస్తూరి చేతిలో ఉంచుతూ "చిరకాలం అనురాగంతో వర్ధిల్లండి'' అంటూ దీవించాడు

"పిల్లలో ?" అన్నాడు ఆనంద్ నవ్వుతూ

"ఆఁ మరిచిపోయాను. పిల్లలతో చిరకాలం...'' అని పూర్తి చేశాడు నరేంద్ర, పళ్లు కనబడేటట్టు నవ్వుతూ.

నీళ్ల నిండిన కళ్లతో "నేను భ్రష్టను కాకుండా కాపాడేరు. మీ ఋణం ఎట్లా తీర్చుకోవాలో తెలియటంలేదు.'' నరేంద్ర పాదాలను కళ్లకద్దుకుంది కస్తూరి.

"అంతా మరిచిపో. బుద్ధిమంతురాలిగా చూడామణితో వెళ్లి ప్రాక్టీసుచెయ్యి. నాన్నగారికి ఈ విషయం వ్రాయి నా మర్యాద దక్కించినందుకు నీకు నేను కృతజ్ఞుడనై ఉండాలి.'' నరేంద్ర కస్తూరి తలమీద చేత్తోరాస్తూ అన్నాడు

"చూడామణిగారూ. మీకు కస్తూరి సంగతులు నేను వేరే చెప్పాల్సిన వేమున్నాయి ? కస్తూరిని మీలో ఒకభాగంగా చూసుకోండి. నా కెప్పుడైనా ఉత్తరాలు వ్రాస్తూఉండండి. సెలవుపెట్టటానికి మీరు ఉద్యోగస్థులు కారుగా. మీరిద్దరూ ఎప్పుడు రావాలనుకుంటే అప్పుడు రాగలరు. ఏడాది కొకసారయినా రండి.'' తండ్రి కూతుర్ని అప్పగించేటప్పుడు ఎంత బాధపడతాడో అట్లా బాధ పడిపోతున్నాడు నరేంద్ర.

నరేంద్రహృదయ మెటువంటిదో డాక్టర్ రమణకు బాగా తెలుసు ఈ పెళ్లి తలపెట్టారని తెలియగానే సంతోషించిన వాళ్లల్లో ప్రథముడాయన మొదట నరేంద్రతో రిజిష్టరయిన పెళ్లి ఉత్తుత్తిపెళ్లని ఆయనకు ముందే తెలుసు. రాధమ్మ చూడామణిని పెండ్లికొడుకుగా చూసి సంతోషించింది.

అందరూ కారెక్కిన తరవాత చూడామణి నరేంద్రచేతులు పట్టుకుని "మీ పేషంటుగా ఈ ఊరు వచ్చాను. ఇన్నాళ్లూ మీనం మేషం ఎంచుతూ ఆలస్యం చేసిన పెళ్లిని మీ చేతులతో జరిపించి నన్నొక గృహస్థును చేశారు. మీ మనసెంత మంచిదో నేనిక్కడికి వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను. మీరు నా



మనసులో కలకాలం నిలిచిపోతారు. మరి సెలవు" అని కారెక్కాడు నరేంద్రను వదిలిపెట్టి కారు మీరజ్ స్టేషన్‌కు వెళ్లింది

సుమారు మూడుగంటల ఆనంద్ నరేంద్ర క్వార్టర్సుకు వచ్చాడు. ఇల్లు తాళంవేసి ఉన్నది. నౌకరుకూడా లేడు. సుమన ఇంకా ఆఫీసునుంచి రాదనుకుంటూ ఆనంద్ బజారంతా తిరిగి తిరిగి ఏడుగంటలకు మళ్లీ నరేంద్ర యింటికి వచ్చాడు నరేంద్ర రాలేదు. లాను వైపుకు వెళ్లగా అక్కడ సుమన మంజు నాడిస్తూ కూర్చుంది. ఆమె పక్కగా కూర్చుని "సుమా! ఏమిటి కబుర్లు?" అన్నాడు.

''నువు చెప్పు ''

''మీ డాక్టరమ్మ క్షేమమా?"

''ఆహా ''

"నాన్న ఉత్తరాలు వ్రాస్తున్నాడా ? అనిల్ ఈ మధ్య వస్తానన్నాడు. రాలేదు కదూ ?"

సుమన నవ్వింది. "ఆనంద్ వీటన్నిటి జవాబులూ నీకు తెలుసు."

ఆనంద్ నవ్వకుండా ఉండలేకపోయాడు. సర్దుకొంటూ "సుమా ! నేనివ్వాళ ఒక గొప్పపని చేశాను. ఆ పని చేసిన తరువాత తలమీదినుంచి బరువు దింపుకున్నట్లయిందనుకో. కాని దానికి సంబంధించిందే ఇంకో పని ఉంది. దాన్ని చాల జాగ్రత్తగా నిర్వహించాలి. అదికూడా పూర్తి చేస్తే జీవితం ధన్యమైనట్లే" అన్నాడు గంభీరంగా.

"ఏమిటో పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నావు ఆనంద్. ఈ మధ్య నీవు ముసలివాడ వయిపోయినట్టుగా కనబడుతున్నావు. అవునుగాని ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నావా లేదా ?"

"లేదు సుమనా. నే ననుకున్న పని అయితే నాకు ఉద్యోగం వచ్చినంత ఫలమనుకో."

"ఏమిటాపని ? నీకింకా ఆ పిచ్చి వదల్లేదా ?"

"ఏ పిచ్చి ?"

"అదే – అదే – నన్ను గురించిన పిచ్చి."

విషాదంగా నవ్వాడు ఆనంద్.

"సుమా, నీ పెళ్లిని కుదిరించింది నేను. తరువాత చూద్దాంలే పెళ్లిసంగతి అని పట్టుపట్టి కూర్చున్న నరేంద్ర మెడలు వంచి పెళ్లికి ఒప్పించింది నేను. ఏదయినా ఒకపని చేస్తామనుకో – దాని ఫలితం అనుభవించాలనుండటము తప్పా ? చెప్పు సుమా."

అంతకంటె విషాదంగా నవ్వింది సుమన. "చేసిన పనికి ఫలితం కనబడకుండా ఎందుకుంటుంది ?" సూటిగా అతడి కళ్లల్లోకి చూసింది.

"సుమా ! అలా చూడకు. నేను భరించలేను. నా ఉద్దేశ్యమేమిటంటే చేసిన పనికి సత్ఫలితాలకోసం తాపత్రయపడటం తప్పుకాదు కదా ?" బరువుగా నిట్టూర్చాడు.

"ఊఁ..." దీర్ఘంగా మూలిగింది.

డాక్టరు పరంజ్యోతి గులాబీపువ్వు వాసనచూస్తూవచ్చి మంజును పిలిచింది. గంతులు వేస్తూ మంజు వచ్చి ఆ పువ్వందుకుని తను వాసనచూసి అందరికీ

చూపించింది. మంజు చిలిపిచేష్టలతో ఆ ముగ్గురూ మనసులలోని బరువు దింపు కున్నారు.

"మేడమ్ మీరు బడ్డకంగా ఉన్నారు. ఒంట్లో బాగా లేదా ?" ఆనంద్ అడిగాడు.

"రాత్రినుంచీ టెంపరేచర్ వస్తున్నది. తగ్గినట్లనిపించి ఇలా వచ్చాను" అన్నది డాక్టర్.

సుమన దిగ్గున లేచివచ్చి ఆమె చెయ్యిపట్టుకుచి చూసింది బాగా వేడిగా ఉంది. "మమ్మీ, బాగా జ్వరంగా ఉంది. లోపలికి పోదాం రండి." బలవంతంగా డాక్టరు పరంజ్యోతిని ఇంటికి తీసుకువెళ్లింది. మంచంమీద పడుకోబెట్టి, "మమ్మీ, మందు రాయండి, తెప్పిస్తాను" కాగితం కలం తీసుకువచ్చింది.

"మందు తీసుకున్నానమ్మా. ఏం ఫరవాలేదు." నీరసంగా పడుకుని కళ్లు మూసుకుంది డాక్టరు పరంజ్యోతి.

ఆనంద్ ఆ చుట్టుపక్కల ఉన్న డాక్టర్లకు ఫిలిప్సు - రమణలకు డాక్టరు పరంజ్యోతి జ్వరం సంగతి చెప్పి వస్తుండగా నరేంద్ర ఇంట్లోనుంచి బైటికి వస్తూ కనబడ్డాడు

''నరేందర్ ! డాక్టరు పరంజ్యోతికి జ్వరం వచ్చింది. వెళ్లి చూడు" అన్నాడు.

''ఎప్పటినుంచీ ?" ఆదుర్దాగా అడిగాడు నరేంద్ర.

"నే నిప్పుడే చూసివస్తున్నా. రాత్రినుంచీట."

నరేంద్ర గబగబా అడుగులు వేసుకుంటూ డాక్టరు పరంజ్యోతి ఇంటివైపుకు వెళ్లాడు.

ఆనంద్ నవ్వుతున్నాడు నరేంద్ర ఆదుర్దా చూసి. ఊరికే నలుగురినీ డాక్టరు పరంజ్యోతి ఇంట్లో సమావేశపరచాలనీ, సుమన పరంజ్యోతి మంచం పక్కగా ఉంటే నరేంద్ర ముఖం చూడాలనీ చెప్పాడు. అవకాశాన్ని జారవిడవలేదు.

అందరూ పరంజ్యోతి గదిలో కుర్చీలమీద కూర్చున్నారు సుమన ఆమె మంచాని కానుకుని స్టూలుమీద కూర్చున్నది.

తలక్రింద చెయ్యిపెట్టుకుని ఒత్తిగిలి పడుకున్న పరంజ్యోతి అందరితో నవ్వుతూ కబుర్లు చెబుతున్నది. మధ్య మధ్య తలవంచుకుని కూర్చున్న నరేంద్రను ఓరకంటితో చూస్తున్నది.

గంటసేపు కబుర్లు చెప్పి ఒక్కొక్కరే లేచారు. నరేంద్రను ఉండమని కళ్లతో ఆజ్ఞాపించింది,

అతడు ఉలిక్కిపడి సర్దుకున్నాడు

"డాక్టర్! ఇవాళ నేనొక శుభవార్త విన్నాను. ఒక హవుస్‌సర్జన్ పెళ్లి చేసుకుని వెళ్లిపోయిందట." అతడి ముఖంలోకి చూసింది పరంజ్యోతి

తలఎత్తి ఆమె ముఖంలోకి చురుగ్గా చూసి తలవంచుకున్నాడు నరేంద్ర.

"దానివల్ల మంచి ఫలితాలు కలుగుతాయని ఆశిస్తున్నాను."

పది నిమిషాలకు పైగా మౌనం సంచారంచేసిం దాగదిలో. రెండుచేతుల వేళ్లు కలుపుకుంటూ లేచి "గుడ్‌నైట్ డాక్టర్" ఆమె చెప్పిన గుడ్‌నైట్ వినకుండానే సాగిపోయాడు నరేంద్ర

ఆ రాత్రి భోజనంచేసి అతడు పక్కమీద పడుకున్నాడు కాని కన్ను మూత పడలేదు. సుమన గంభీరాకృతిని చూసి అతడి మనసు చలించలేదు. ఆమెపట్ల జాలికూడా కలుగలేదు. ఒకవిధమైన జంకు బయలుదేరింది ఆమెతో సమాగమానికి గల అవరోధాలన్నీ తొలగిపోయాయి మరి ఇప్పుడు మాట కలపటం ఎట్లా? ఆమెను తన ఇంటికి ఎట్లా తీసుకురావాలి? ఈ పని తనంతట తను చేయాలా? ఇతరులకు తన విషయంతో జోక్యం కలుగజేసే అవకాశం ఇవ్వాలా?

అతడి మనసు సుమన వైఖరి వైపుకు మళ్లింది. ఆమె గంభీరవదనం అతడి ఊహలను ముందుకు సాగనీయటంలేదు ఆమె కళ్లల్లో అతడికేభావమూ గోచరించటంలేదు. ఎట్లా? ఎట్లా? ముందడుగు వేయటం ఎట్లా? తెల్లవారు ఝామున కళ్లు మూతలుపడ్డాయి

## 11

జ్వరం తగ్గిపోయింనంటూ డాక్టరు పరంజ్యోతి హాస్పిటల్‌కు వెళ్లటానికి తయారయింది. టిఫిన్ తీసుకునే సమయంలో సుమన ఆమె ఒళ్లు పట్టిచూసి "మమ్మీ. ఈ ఒక్కరోజూ ఆగరాదూ? అలసటకు మళ్లీ జ్వరం రావచ్చు" బ్రతిమిలాడింది

"జ్వరం తగ్గిందిగా! పనిలేకుండా ఇంట్లో కూర్చుంటే పిచ్చెక్కినట్టుగా ఉంటుంది డియర్.

"ఎందుకూ పిచ్చెక్కటం?" హాండ్‌బాగ్ పట్టుకుని నాలుగైదు సంవత్సరాల పిల్లతో హాల్లో అడుగుపెట్టాడు డాక్టర్ రంజన్.

నీరసంగా ఉన్నా అతడిని చూడగానే వెయ్యిదీపాలవెలుగు డాక్టరు పరం

జ్యోతి ముఖంలో కనబడ్డది సంభ్రమంతో లేచినిలబడి "ఏమిటి హఠాత్తుగా ఇలా వచ్చావు ?" అన్నది పిల్లవంక చూస్తూ

"లిల్లీకి చెయ్యికాలింది పనివాడితో పోట్లాడి పొయ్యిమీద ఉన్న బంగాళాదుంప అందుకోబోయిందట. నిప్పులేదు గాని బూడిద చాలా వేడిగా ఉంది. చెయ్యి కాలింది వేళ్లు వంగటంలేదు. నీవు ఇక్కడ వైద్యం చేయిస్తావని తీసుకువచ్చాను" ఆ సమీపంలోఉన్న కుర్చీమీద లిల్లీని కుర్చోబెట్టి చెయ్యి చూపించాడు పరంజ్యోతికి

అతడిని చూసిన సంతోషంలో ఉక్కిరిబిక్కిరయిపోతోంది పరంజ్యోతి

సుమన లోపలికి వెళ్ళి వాళ్ళిద్దరికీ కాఫీ, టిఫిన్ తీసుకువచ్చింది వాళ్ళు కాఫీ తీసుకుంటూ ఉండగా సుమన పరంజ్యోతితో చెప్పి ఆఫీసుకు వెళ్ళింది దారిలో కనబడ్డాడు నరేంద్ర.

ఒక నిమిషంసేపు ఆగి - వెనక్కి తిరిగిచూసింది సుమన మాట్లాడుదామని విచ్చుకున్న పెదవులు ముడుచుకున్నాయి

నరేంద్రను చూడగానే రంజన్ లేచి కరచాలనంచేస్తూ "మీ ఫోను రాత్రి పదకొండుగంటలకు వచ్చింది. వెంటనే ఈ పాపను కార్లోవేసుకుని బయలుదేరాను" అన్నాడు.

పరంజ్యోతి తెల్లబోయింది. "నరేంద్ర ఫోన్‌చేశాడా? ఎందుకు ?" కళ్ళతోనే ప్రశ్నించింది

"మేడమ్, ఇతడు నాకు స్నేహితుడయి ఉండికూడా క్రిందటిసారి వచ్చినప్పుడు నన్ను చూడకుండా వెళ్ళిపోయాడు అందుకు శిక్షించాలని ఫోను చేశాను"

రంజన్ విచిత్రంగా నవ్వాడు

"నీకింకా చిన్నప్పటి చిలిపితనం పోలేదు" అన్నది పరంజ్యోతి

అంతలో మంజు పెద్ద రబ్బరుబొమ్మ నెత్తుకుని పరుగెత్తుకుంటూవచ్చి గడప దగ్గర ఆగిపోయింది. పరంజ్యోతి పిలవగానే ఆమె దగ్గరగావచ్చి నిలబడి అందరినీ ఒకసారి చూసి వెళ్ళిపోవాలని ప్రయత్నించింది రంజన్ మంజు చెయ్యి పట్టి దగ్గరికిరమ్మని పిలిచాడు. మంజు సందేహించింది. నరేంద్ర రమ్మని పిలిచాడు. తలతిప్పింది వెంటనే నరేంద్ర జేబులోంచి కలంతీసి రంజన్ ఆమెచేతికిచ్చాడు ఇటూ అటూ తిప్పిచూసి నైస్ అన్నది.

అంతా నవ్వారు

నరేంద్ర రంజన్‌తో బైటికివస్తూ "ఇతడు ఇప్పుడప్పుడే రాడు" అంటూ పరంజ్యోతితో చెప్పి తన ఇంటికి తీసుకువెళ్ళాడు. ఇద్దరూ డ్రాయింగురూములో కూర్చుని చెరొక సిగరెట్ వెలిగించారు.

"రంజన్, నాకు సలహా కావాలి. నేనేం చెయ్యాలి ?" అంటూ కస్తూరితో తన కాంట్రాక్టు మేరేజిని గురించీ, ఆ కాంట్రాక్టు పూర్తికాకముందే సుమనతో జరిగిన పెళ్ళినిగురించి చెప్పి "చూశావుగా ఆ చిన్న మంజును ?" అన్నాడు.

''ఏమిటి ? మంజు నీ కూతురా ? అయితే ఇంకేమిటి నీ సమస్య ?'' అన్నాడు రంజన్.

"ఇప్పుడే వచ్చింది సమస్య," అని జరిగినదంతా వివరించి చెప్పాడు.

"ఆమె చదువుకున్నది సున్నితమయిన హృదయం కలది. మనసు చాలా దెబ్బతిని ఉన్నది. నేనిప్పుడు ఏ మాట మాట్లాడితే ఏ మర్థంతీసుకుంటుందో ?" అన్నాడు దీర్ఘంగా ఆలోచిస్తూ.

రంజన్ అతడివైపే చూస్తున్నాడు.

"నేను ఆవేశంలో చేసిన పిచ్చిపని అది. నిజానికి కస్తూరిని కాపాడటానికి పెళ్ళే చేసుకోనక్కరలేదని, తరువాత పస్తాయించాను. పెళ్ళిచేసుకున్నా చెల్లెలి లాగ చూసుకున్నాను. సుమనను వెంటనే తీసుకువస్తే అపార్థాలకు అవకాశమిచ్చి నట్లవుతుందని జంకాను. గడువు తీరగానే సుమనను తీసుకురావాలనుకుంటే నా మౌనం భరించలేక ఈలోపలే సుమన వచ్చేసింది. కాని పరిస్థితులు తెలుసుకున్న ప్పటికీ చాలా గంభీరంగా ఉంటోంది" బరువుగా నిట్టూర్చాడు.

''ఆమెకు ఈ సంగతులన్నీ ఎవరయినా చెప్పారా ?" గంభీరంగా ఉంది కంఠం.

''ఆమెకు దగ్గర బంధువైన ఆనంద్‌కు తెలుసు.అత డంతా చెప్పేఉంటాడు." నరేంద్ర తలవంచుకున్నాడు.

''జ్యోతికి తెలుసా ?''

"సుమన నా భార్య అన్నంతవరకూ తెలుసు."

తల పంకించి లేచాడు రంజన్. ఇద్దరూ పరంజ్యోతి ఇంటికి వచ్చేసరికి మధ్యాహ్నం రెండయింది. అందరూ భోజనాలకు కూర్చున్నారు.

రంజన్ ఇటూ అటూ తలతిప్పిచూస్తుంటే "లిల్లీ భోజనం చేసింది. పద కొండు గంటలకు బర్న్‌ప్రాజెక్టుకు తీసుకువెళ్ళాను. ఆపరేషనుచేస్తే వేళ్ళు

వంగవచ్చునన్నారు. ఇదంతా కొన్నాళ్ళు ఇక్కడ ఉంటే కుదురుతుంది' అన్నది పరంజ్యోతి.

"నీ దగ్గర ఉంచి వైద్యం చేయించాలనే తీసుకువచ్చాను రెండునెలలపాటు ఉంచుకొని వైద్యం చేయించు" అన్నాడు ఆమెవైపుచూస్తూ చనువుగా.

"నీవిక్కడేఉండి చేయించుకుంటే బాగుండదూ!" అన్నది పరంజ్యోతి.

"నీవుంటే నేను ఉన్నట్టే" నవ్వాడు రంజన్.

"ఊఁ" దీర్ఘంగా మూలిగింది పరంజ్యోతి.

లిల్లీ, మంజూ చేతులు పట్టుకుని బల్లదగ్గరికి వచ్చారు.

రంజన్ లిల్లీతో మాట్లాడుతూ మంజును చూస్తున్నాడు. ఏపుల్ ముక్కలు అందిస్తే లిల్లీ తీసుకుని మంజుకు కూడా ఇచ్చింది.

నరేంద్ర మంజునే కన్నార్పకుండా చూస్తున్నాడు. ఆ పిల్ల ప్రతి కదలికా అతడిని తన్మయుణ్ణి చేస్తోంది.

"జ్యోతీ! మేమిద్దరం మళ్ళీ బైటికి వెళ్ళుతున్నాం. రాత్రి భోజనానికి వస్తాము." రంజన్ లేచాడు. నరేంద్ర స్కూటర్ మీద ఇద్దరూ బయిలుదేరి వెళ్ళారు. క్వార్టర్సు ముందరే ఆనంద్ కనబడ్డాడు.

నరేంద్ర స్కూటర్ దిగి ముఖంతిప్పుకుని పోబోతున్న ఆనంద్‌ను ఆపి తన యింటికి తీసుకువెళ్ళాడు. ముగ్గురూ కూర్చున్నారు. నౌకరు తెచ్చిన టీ తాగి సిగరెట్లు వెలిగించారు.

రంజన్ను నరేంద్ర పరిచయంచేశాడు ఆనంద్‌కు. ముగ్గురూ మాటల్లేకుండా బొమ్మల్లా కూర్చున్నారు. ఆనంద్ మాటలపోగు. అతడు సంభాషణ మొదలు పెడితే తనేమయినా కలుగజేసుకోవచ్చని నరేంద్ర చూస్తున్నాడు. వాళ్ళిద్దరూ మాట్లాడరేమని రంజన్ వాళ్ళ ముఖాలలోకి గుచ్చి గుచ్చి చూస్తున్నాడు.

"ఇవాళ మధ్యాహ్నం ఒక సంఘటన జరిగింది," అన్నాడు ఆనంద్.

"ఏమిటది ?" నరేంద్ర, రంజన్ ఒక్కసారే ప్రశ్నించారు.

"సుమన ఆఫీసునుంచి వచ్చేసరికి మంజుచేతిలో మెరూన్ రంగు గోల్డుకేపు పెన్ను కనబడింది. అది ఎక్కడిదంటే చెప్పదు. ఇవ్వమంటే ఇవ్వదు మంజు. ఎవరిది తీసుకువచ్చిందోనని సుమనకు భయమూ, ఆదుర్దాను. కోపంతో మంజు వీపుమీద రెండు దెబ్బలుకొట్టి-ఏడుస్తున్న మంజును ఎత్తుకుని తనూ ఏడ్చిందట సుమన. నేను వెళ్ళేటప్పటికి ముఖమంతా ఎర్రగా వాచిపోయింది."

"అయ్యయ్యో. ఆ కలం నరేంద్రది   నేనే అతడి జేబులోనుంచి తీసుకుని మంజు చేతికిచ్చాను" రంజను ముఖం పరితాపంతో చిన్నబోయింది

నరేంద్ర కనుబొమలు పైకెత్తి నోరు తెరిచి 'అబ్బ' అన్నాడు.

"అబ్బ అబ్బ అంటూ చాటుగా వగవకపోతే ఎదురుగా వెళ్ళి సుమనతో మాట్లాడి ఇంటికి తీసుకురాకూడదూ ? ఆ చిన్నారిపాప మంజునూ కళ్ళతో చూస్తూకూడా ఈ తటస్థభావ మెందుకు ? చేసిన పనులేమో అర్థంలేనివి శుష్కప్రియాలు ఎందుకయ్యా మాట్లాడటం ?'' దులిపి వదిలిపెట్టాడు ఆనంద్

నరేంద్ర చిన్నబుచ్చుకున్నాడు రంజన్ నొచ్చుకున్నాడు

మళ్ళీ మొదలపెట్టాడు ఆనంద్   "అంతా అయిపోయిందిగా   అవరోధాలన్నీ తొలగిపోయాయిగా ! కస్తూరి ఒక ఇంటిదయి వెళ్ళిపోయింది   ఇప్పటికయినా ఈ కథ సుఖాంతం కాకూడదా ? దానికి అడ్డం ఏమిటి ? ఊరందరి పట్ల జాలికలుగుతుండే నీకు ! ఎదటివాడి చిన్నకష్టమయినా చూడలేవే నీవు ! వెనకా ముందూ చూసుకోకుండా దానధర్మాలుచేస్తూ ఉంటావే ? ఇప్పుడు చెప్పు - నీ మౌనానికి కారణమేమిటి చెప్పు ?" ముఖం ఎర్రబడ్డది   ఆవేశంతో మాట్లాడటంవల్ల తలవెంట్రుకలు చిందరవందరగా ముఖంమీదపడ్డాయి

రంజన్ లేచి ఆనంద్ భుజమ్మీద చెయ్యివేసి తట్టుతూ "మంచి పిక్చరెక్కడయినా ఉంటే చెప్పండి వెళ్దాం" అన్నాడు

"ఈ పిక్చర్‌కంటె మంచివెక్కడుంటాయి ?" ముఖం ముడుచుకుంటూ లేచాడు.

'మనసు ఉద్రేకంలో ఉంటుంది కనుక మన పిక్చరు ఎంత బాగున్నదయినా మానసికంగా విశ్రాంతి లభించదు మనసు ఎంత ఉద్రేకంలో ఉన్నా పిక్చరు చూడగానే విశ్రాంతి లభిస్తుంది ఎదటి నమస్యలను మనము ఉద్రేకంతో చూడంకదా ఆదీ తేడా రండి పోదాం'' లేవదీశాడు రంజన్

"ఎన్నాళ్ళీ తప్పించుకు తిరగటం ?'' నసుగుతూ లేచాడు ఆనంద్

ముగ్గురు బైటికి వచ్చారు ముగ్గురికీ భోజనం కాంటీనునుంచి తెచ్చి ఉంచమని నౌకరుతో చెప్పి ఇల్లు తాళంవేశాడు నరేంద్ర.

ఉదయం లేవగానే డాక్టరు పరంజ్యోతి అందరినీ తనయింటికి కాఫీ టిఫిన్‌కు రమ్మని నౌకర్ని పంపించింది

వాళ్ళు రాకముందే సుమన బైటికి వెళ్ళిపోయింది.

అందరూ మాట్లాడకుండా కాఫీ, టిఫిన్లు ముగించి లేచారు మంజును తొడమీద



కూర్చోబెట్టుకుని కాఫీ టిఫిన్ తీసుకున్నాడు ఆనంద్. ఆ క్రిందటిరోజు కలం ప్రశంస ఆ రోజు రాలేదు.

లిల్లీని తీసుకుని రంజన్ పరంజ్యోతి బర్న్ ప్రాజెక్టుకు వెళ్లారు.

మధ్యాహ్నం ఒంటిగంటకు నరేంద్రను భోజనానికి రమ్మంటూ పరంజ్యోతి ఇంటినుంచి కబురు వచ్చింది. అతడు బయలుదేరి వచ్చేటప్పటికి అందరూ బల్ల ముందు కూర్చుని ఉన్నారు. సుమన పదార్థాలను వడ్డిస్తూ వెనక్కు తిరిగింది. తువాలుకోసం. నరేంద్ర నిలబడి ఉన్నాడు. అనుకోకుండా ఇద్దరికళ్లూ కలుసుకున్నాయి. ఆమె సోగకన్నులు సొంపుగా వెలుగులు చిమ్మాయి. ఆమె ఎర్రని పెదవులు ముద్దుగా ముడుచుకున్నాయి. రెండోసారి ఆమె ముఖంలోకి చూడటానికి జంకాడు నరేంద్ర.

పరంజ్యోతి మొదలుపెట్టమని అంటోంది.

అంతలో సుడిగాలిలా వచ్చాడు అనిల్.

"సుమనక్కా, నాన్న నిన్ను అర్జంటుగా తీసుకురమ్మన్నారు. మంజును చూడాలని ఉందట. కారు తీసుకువచ్చాను బయలుదేరు."

సుమన ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి నోరు తెరిచింది.

"జబ్బేం చెయ్యలేదుకదా! ముందీమాటచెప్పు?" ఆనంద్ దిగ్గున లేచాడు.

సుమన అనిల్ భుజమ్మీద చెయ్యేసి "నాన్న ఎట్లా ఉన్నారు?" బిక్క ముఖంతో వినీవినబడకుండా అన్నది.

కనుబొమలు చిట్లించి "బయలుదేరు, వెంటనే రమ్మన్నారు" అన్నాడు.

పరంజ్యోతి లేచి, "ముందు భోజనం చెయ్యండి. తరువాత ప్రయాణం. కమాన్ మిస్టర్ అనిల్! మీరుకూడా ఒక పళ్లెం తీసుకోండి" అతడిని బలవంతంగా కూర్చోబెట్టింది.

నరేంద్ర గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నాయి. భోజనాలు కాగానే సుమన ప్రయాణమై వెళ్ళిపోతుందేమో!

యాంత్రికంగా అందరూ భోజనంచేశారు. అంతా ఇంకా బల్లదగ్గర ఉండగానే వెళ్తానని నరేంద్ర లేచాడు.

రంజన్, పరంజ్యోతి తెల్లబోయి చూస్తున్నారు. అనిల్ రాకతో సుమన కథ మరో మలుపు తిరిగిందేమిటనుకుంటున్నారు.

ఆనంద్ అనిల్ సుమనగదిలోకి వెళ్లారు ఆమె బట్టలన్నీ సర్దుకుంది. సామాను కారులో పెట్టాడు అనిల్.

"మంజూ మంజూ" కేకలు పెడుతోంది సుమన. గదులన్నీ వెదికింది. లిల్లీతో ఆడుతున్నదేమోననీ ఇల్లూ పెరడూ అంతా వెదికింది. కళ్లు నీళ్లతో నిండుతున్నాయి ఆదుర్దాగా తిరుగుతున్నది.

"సుమనా! ప్రయాణమా! తొందరగా వచ్చెయ్యి." సుమన చెయ్యిపట్టుకుని అడిగింది పరంజ్యోతి.

"ఎందుకు మమ్మీ? నా ఉద్యోగమయిపోయింది నిన్నటితో. ఇవాళ వెళ్లి జీతం తెచ్చుకున్నాను. వెళ్తాను. వెళ్లి నాన్నను ముసలితనంలో కనిపెట్టుకుని ఉంటాను మమ్మీ! ఈ దీనురాలిని మరిచిపోకండి. ఎప్పుడయినా చూడాలనిపించి నప్పుడు నేను వస్తాను" కన్నీళ్ళు తుడుచుకున్నది.

పరంజ్యోతికి కళ్ళు చెమర్చాయి. "నిన్ను ఎప్పుడూ చూస్తూ ఉండాలనిపిస్తుంది

నాకు. నిన్నూ మంజునూ వదిలిపెట్టలేను. నీవు వచ్చినప్పటినుంచీ నా మనసు ప్రశాంతంగా ఉంది" సుమన తలను భుజానికి ఆనించుకున్నది పరంజ్యోతి.

దూకుడుగా వచ్చాడు అనిల్. "అక్కా, మంజు ఏదీ?" అదుర్దాతో ఇల్లంతా పరుగులు తీశాడు.

ఇల్లంతా వెతికిన ఆనంద్ ఒక్క పరుగున నరేంద్ర ఇంటికి వెళ్లాడు. పిల్లలిద్దరూ నరేంద్రగదిలో బిస్కట్లు తింటూ అతడిముందర కూర్చున్నారు.

"ఇక్కడ ఉన్నవా దొంగా! అమ్మ పిలుస్తోంది. రా" మంజును లేవదీశాడు ఆనంద్.

డిగ్గున లేచాడు నరేంద్ర. "ఆనంద్. మంజును నేను తీసుకువస్తాను పద" మంజును ఎత్తుకుని బయలుదేరాడు.

అందరూ కారులో కూర్చున్నారు సుమన చేతివేళ్లతో కళ్ళుమూసుకుని కూర్చుంది.

పరంజ్యోతి రంజన్ కారుదగ్గర నిలబడ్డారు తలుపుతెరచి పట్టుకుని.

ముందుగా వచ్చిన ఆనంద్ "నరేంద్ర పిల్లను ఇవ్వనన్నాడు" గంభీరంగా అన్నాడు.

"అదేమిటి?" తుళ్ళిపడ్డది సుమన.

"పిల్లను ఉంచుకోమను. తల్లి అక్కర్లేదుగాని పిల్లకావాలట!" కాల రుద్రుడయినాడు అనిల్.

నరేంద్ర కారును సమీపిస్తున్నకొద్దీ రంజన్ ఆత్రంతో చూస్తున్నాడు పరిస్థితులు ఎట్లా పరిణమిస్తాయోనని.

"పిల్లను తీసుకుంటే తల్లి తనంతటతానే వస్తుందని ఈ ఎత్తువేశాడు పాపం-అమాయకుడు! ఆడదానికయినా అభిమానం ఉండదనుకున్నాడేమో?" అనిల్ ముఖం ఎర్రబడిపోతున్నది.

సుమన ఉద్రేకిస్తోంది. అభిమానమంటే ఏమిటి? అదెట్లా ఉంటుంది? ఈ సమయంలో అభిమానాన్ని ఎంతవరకూ సాగనివ్వాలి?

పరంజ్యోతి మనసు పరవళ్ళు తొక్కుతోంది. ఈ దెబ్బతో సుమన సంసార శకటం టక్కున గాడిలో పడుతుందని గట్టిగా నమ్ముతోంది

సుమన మనసు ఘనీభవించిపోతోంది. తను తిరిగి ఇంటికి వెళ్ళిపోతున్నది. గంపెడాశతో ఇక్కడికి వచ్చింది. కొండంత నైరాశ్యాన్ని నెత్తిన వేసుకుని

తిరుగుముఖమవుతున్నది. ఇన్నాళ్లూ గుట్టుగా బ్రతికిన తన బ్రతుకు అనవసరంగా నలుగురి నోళ్లల్లో పడిపోయింది. కాని ఒక్కటిమాత్రం బాగా రూఢిగా తెలిసింది. నరేంద్ర మనసు నల్లరాయికంటె కఠినమయిందని

నరేంద్ర మంజును ఎత్తుకుని నడిచి వస్తున్నాడు. రెండు వందల గజాల దూరం నడవటానికి అరగంటకుపైగా పట్టిందతడికి. మంజును ఎత్తుకోగానే అతడి హృదయం పరవశించింది తన రక్తం-తనబిడ్డ-గుండెకు హత్తుకున్నాడు.

అందరికళ్లూ అతడిమీదనే కేంద్రీకరింపబడి ఉన్నాయని తెలుసుకున్నాడు. తన బ్రతుకు 'హాస్యాస్పదం కాదుకద !' మనసు శంకిస్తోంది.

''సుమా ! మంజును తీసుకో'' బిడ్డను అందించాడు.

నీళ్ళు నిండిన కళ్లతో ముఖం పక్కకు తిప్పి బిడ్డను అందుకుంది సుమన.

''ఆరి దుర్మార్గుడా !'' ఆనంద్ మనసులో తిట్టుకున్నాడు.

''పిల్లను ఇచ్చాడు నయమే'' శాంతించింది అనిల్ మనసు.

''సుమా'' నరేంద్ర ఆర్ద్రకంఠం అందరికీ వినిపించింది.

నరేంద్ర సుమనను రెండు భుజాలూపట్టి లేపి తన ఇంటివైపుకు నడిపించుకు పోతున్నాడు. కళ్ళు తెరిస్తే కల చెదరిపోతుందేమోన్నట్టు గట్టిగా కళ్ళు మూసుకుని నరేంద్ర భుజానికానుకుని నడుస్తున్నది సుమన.

''మంచివాడు. మాట్లాడకుండా ఎలా తీసుకువెళ్ళుతున్నాడో ? ఇంక ప్రేమించటం మొదలుపెడతాడు కాబోలు !'' క్రాపు సవరించుకుంటూ సంతోష పడుతున్నాడు ఆనంద్.

తను వచ్చినపని అయిందన్న సంతృప్తి కళ్లల్లో మెరుస్తోంది రంజన్‌కు. ''జ్యోతీ ! మంచివాడి మనసు అవకాశమున్నంతవరకూ మంచిపనులవైపే మొగ్గుతుంది గమనించు జ్యోతీ. లోపలికి పోదాం పద. నా ప్రయాణం రాత్రికి. సామాను సర్దుకోవాలి ' ఆమెను దాటుకుంటూ లోపలికి వెళ్లాడు.

పెట్టె సర్దుకుని రెండడుగులు ముందుకు వేస్తూ. ''అలా క్రుంగిపోకు జ్యోతీ కావాలంటే లిల్లీని నీదగ్గర ఉంచుకో. నేను మళ్లీ వారంలో వస్తానుగా !'' కరచాలనం చెయ్యటానికి చేయిజాచిన రంజన్ పరంజ్యోతి కళ్లల్లో బాష్పాలను చూసి నివ్వెరపోయాడు.

---



సుదర్శనధరంగారు సొంత ఊరు వెళ్లారు. అక్కడ ఇంద్రాణిని చూశాక ఒకకొత్త ప్రయోగాన్ని చేసి చూపించాలనే ఆలోచన తట్టింది ఇంద్రాణి అలాంటిది, అంతా మగతీరు

సుదర్శనధరంగారు ఏది తీసినా అది ఘనవిజయం సాధించి తీరాల్సిందే శేషపతిసుదర్శనధరం జంటనిర్మాతలుగా తీసిన మైలురాళ్లవంటి చాలా చిత్రాల తర్వాత వరసగా రెండు చిత్రాల్లో మరీ విశేష లాభాలు వచ్చాయి. ఈసారి నష్టం వచ్చినా ఫర్వాలేదనుకున్నారు.

సుదర్శనధరంగారు కొత్త చిత్రానికి కథ తయారుచేసుకున్నారు.

సంక్షిప్తంగా ఆ చిత్రకథ యిది:

శ్రీకాంతరావు శ్రీమంతుల బిడ్డ. అమాయకత్వం మూటకట్టినట్టుగా పెరిగాడు ఆడపిల్లలాగ అతినాజూకుగా ఉంటాడు. మేనమామ కూతురు, కాబోతున్న శ్రీమతి హేల కూడా అనేసింది, "బావా! నువ్వు వట్టి కుందేలు పిల్లవు సుమీ!" అని ఆడారివాడు అనే పేరు ఉండనేఉంది.

శ్రీకాంతరావు ఒక సాయంత్రం

షికారుగావెళ్ళి కాఫీపి, కాస్సేపు నడుద్దామని చిట్టడవి మార్గం పట్టాడు దారి కడ్డంగా ఒక యువకుడు తాగి పడున్నాడు లేతవయసు యువతి ఒకతె లేవనెత్తుతూన్నది ఆ లేచినవాడు చాలా మోటుగా, కండలు తిరిగి, బలంగా ఉన్నాడు ఎర్రటి కళ్ళతో శ్రీకాంత రావుని చూస్తూ పిడికిళ్లు బిగించి నిలబడ్డాడు శ్రీకాంతరావు భయపడుతూ దగ్గిరున్న డబ్బంతా తీసి కోటుతోసహా వాడికిచ్చాడు, "మరేంచెయ్యకు, ఇదీ వేళకి, రేపు మరికొంత తెచ్చిస్తాను,నన్ను పోనీ," అంటూ. ఆమొరటువాడు డబ్బునీ కోటునీ నిర్లక్ష్యంగాచూసి పెద్ద నవ్వు నవ్వి "వెళ్లు!" అన్నాడు. శ్రీ కాంత్ వెళ్ళినవేపేచూస్తూ హా హా హా అని నవ్వుతూనే ఉన్నాడు

వాడిపేరు మారన్న. మరలో పనిచేసేవాడు. అడివిమల్లెలాంటి ఆ యువతి పెంటమ్మ. చిన్నదేగాని మంచి ఏపు, బిగువు కలిగి చేవదేరిన ఇరిడికర్రతో చెక్కిన బొమ్మలాగున్నది. మగాడితో సమానంగా కాయకష్టం చేస్తుంది. పెంటి మారన్నకు వరసయిన పిల్ల.

* * *

అన్నట్లే మర్నాడు శ్రీకాంత్ డబ్బు తెచ్చాడు గొడ్డలితో కర్రలు నరుకుతున్న పెంటికి పొదలో అప్పుడే పూచిన చెంగల్వలాగ శ్రీకాంత్ ఎంతోముచ్చటగా కనిపించాడు. శ్రీకాంత్ పెంటిని చూసి తనలో తాను సిగ్గుపడ్డాడు. తనకంటే ఎంతోబలంగా, నిండుగాఉంది అంతలో మారన్న వచ్చాడు. డబ్బు అందిస్తున్న శ్రీకాంత్‌ను ఎగాదిగాచూసి ఒక్కపెట్టున నవ్వేస్తూ, "ఇంత అమాయకుడివి, యెలాగ బతుకుతావో పాపం!" అన్నాడు.

"అదే నేనూ బాధపడేదీ, నే నెలాగ నీలాంటి మనిషిని అవుతాను?" అన్నాడు శ్రీకాంత్

"ఓయి తెల్లనుగ్గున్నా! రా! నాతో నాలాగ కష్టపడు. పట్టుపరుపుల మీద దొర్లితేకాదు. ముళ్ళకంపమీద పడుకో సొమ్మసిల్లి. అప్పుడు మగతనం, మనిషితనం తెలుస్తుంది. వస్తుంది! పిచ్చమ్మా! నిన్న నిన్ను దోపిడిచేయాలనికాదు. నీలాంటి డబ్బుగల నీటుగాళ్ళంటే నాకు మహచెడ్డ కష్టమంట; అందులోనూ తాగున్నానేమో, నిన్ను నలిపి బురదలో తొద్దామనిపించింది. నువ్వు పాపం పిల్లి కూనలాగ అంతాతీసి చేత బెడితివి— చెడ్డ జాలేసింది సుమీ!" అన్నాడు మారన్న.

"నన్ను నీతో తిరగనియ్యి. మోటుదనం నేర్పు!" అన్నాడు శ్రీకాంతరావు, గురువు దొరికిన శిష్యుడిలాగ.

అది మొదలు వాళ్ళిద్దరూ స్నేహితులయ్యారు.

* * *

శ్రీకాంత్ మారన్న గుడిసెలో మకాం

పెట్టాడు. మారన్నకు ముసలితల్లి ఉంది. పెంటికీ మారన్నకూ పెళ్ళిచూసి కళ్ళు మూస్తానంటు ది. ఆ ఇంటి ముగ్గురూ తినే తిండీ, జీవిస్తున్నతీరూ చూసి శ్రీకాంత్ ఆశ్చర్యపోయాడు.

ఆ చిట్టడవిలో మనుషులు కలపకొట్టడం, మానులు రంపాలతో కోసి మరకు పంపడం మొదలైన పనులు కూలికి చేస్తూంటారు మారన్న ఆ మరలోనే పనిచేస్తున్నాడు. ఎంత కనా కష్టంగా బతుకుతున్న మనుషులుంటారో ఆప్రాంత మంతా తిరిగి చూశాడు శ్రీకాంత్.

శ్రీకాంత్‌కి పెద్ద ఆస్తిని విడిచి తల్లీ తండ్రీ గతించారు శ్రీకాంత్ ఆస్తి వ్యవహారాలన్నీ మేనమామ ధనరాజు చూస్తున్నాడు, చాలా కైంకర్యం చేశాడు. ఆ బాపతుతోనే పెద్ద కలప వ్యాపారం నడుపుతున్నాడు, కలపకోత మరపెట్టి. అందులోనే మారన్నకు పని.

మారన్నతో తిరిగి శ్రీకాంత్ చాలా తెలుసుకున్నాడు. కాకీబట్టలు వేసుకొని ఒక మర కూలీగా పనిచేశాడు కూలీల బతుకులెంత హీనాతి హీనంగా ఉన్నాయో చూశాడు యజమాని నయవంచనలు, ఎత్తులు, తాబేదార్ల మాయలు అన్నీ తెలుసుకున్నాడు.

మారన్న తాగకపోతే మళ్లా మనిషిని కాలేనంటాడు. ఆకలికి త్రాగుడు విరుగుడంటాడు. శ్రీకాంత్ తాగుతానంటే ఒప్పకోలేదు. అందుకోసం తన తాగుడు తగ్గించుకున్నాడు మారన్నకి శ్రీకాంత్ చదువు నేర్పాడు. వేషం మార్పించాడు. మంచి పద్ధతులు నేర్పాడు. మంచి మనిషిగా చేశాడు

పెంటికి శ్రీకాంత్ అందే ముచ్చట పెంటితో శ్రీకాంత్ అడివికి వెళతాడు. కాయకష్టం చేస్తాడు పెంటి చేసే పను లన్నీ తనకు నేర్పమంటాడు. పెంటి శ్రీకాంత్ అమాయకత్వాన్ని సౌకు మార్యాన్ని మెచ్చుకుంటుందే గాని ఏదీ చెయ్యనివ్వదు

శ్రీకాంత్ ఆ చుట్టుపట్ల చాలా హృదయ విదారకమైనవి చూశాడు.

ఒక కూలీ భార్య మందులేక, తిండి మంచిదిలేక చచ్చింది. మట్టి చెయ్యడానికి మరకెళ్ళి అడిగితే బకాయిఉన్న కూలీ డబ్బుకూడా యివ్వలేదు. చంటిబిడ్డ పాలకోసం శవంమీద పడి దేవుళ్లాడు తోంది.

కూలీల పిల్లలు బక్కచిక్కి పెద్ద వాళ్ళు చేసే కూలీపనులు చేస్తున్నారు. మెత్తటి రంపంపొట్టు బెల్లం కలిపి తినేస్తున్నారు అక్కడ బడిలేదు మందు లేదు. సరిగ్గా కూళ్ళు ముట్టవు. అప్పు లిచ్చి, తీర్చకపోతే గుడిసెలు లాక్కుని జాగా కలుపుకుంటున్నారు. అంతా ఒక అరణ్యరోదనం!

శ్రీకాంత్ మారన్న ఇంట్లోనే అంబలి తాగాడు. తవుడు రొట్టె తిన్నాడు. కంప పేర్చి గడ్డిపరిచి పడుకున్నాడు.

పెంటీపట్ల శ్రీకాంత్‌ని మారన్న అను మానించకపోలేదు. ఒకనాడు అడవిలో చిన్నవాగు దగ్గిర శ్రీకాంత్ పెంటితో, "మారన్ననూ నిన్నూ చూస్తూంటే యెంతో ముచ్చటేస్తుంది. మనుషులంటే మీరే, మారన్న నీకెంతో తగినవాడు. మీపెళ్ళి ఘనంగా జరగాలి!" అని అంటు న్నది విని మారన్న మరే అనుమానం లేకుండా వెళ్లాడు. తర్వాత పెంటి, "ఔనుగాని, శ్రీకాంతబాబూ! కల్లాకపటం లేని నీ మొగం సూస్తాఉంటే నా మనుసెంతో బాగుంటది సుమీ! నిన్ను సూత్తే ఆ శికుష్ణమూర్తిని సూస్తాఉన్నట్టే ఉంటాది సుమ్మీ!" అంటుంది.

* * *

శ్రీకాంత్ ఏమయ్యాడో చాలారోజుల వరకూ తెలియలేదు. ఏమైనా ధనరాజుకి ఫర్వాలేదుగాని, ఉన్నట్టుండి శ్రీకాంత్ వచ్చి, యెంతఉంటే అంత, తన ఆస్తి తనకు అప్పగించమని అడగవలసిన తీరులో అడిగేసరికి ధనరాజు విస్తు పోయాడు. శ్రీకాంత్‌లో వచ్చినమార్పుని, ధైర్యాన్నిచూసి, ఎక్కడికి పోతుందిలే! అని అప్పగించాడు, కైంకర్యశేషాన్ని.

* * *

కూలీలకోసం ఆస్పత్రికి, పిల్లల బడికి, వడ్డీలేకుండా అప్పులిచ్చే వసతికి పోగా మిగతాదాంతో లాభంవస్తే అందరికీ పంచే వ్యాపారాన్ని నడపడానికి మారన్నకు అప్పజెప్పాడు. మారన్నకు అవసరమైన వేషభాషలన్నీ నేర్పాడు మర పెట్టించాడు. పదిమందీ సుఖంగా బతికేందుకు వీలు కలిగించేదంతా చేయిం చాడు ఏదీ ఏ ఒక్కరిదీ కాకుండా, మారన్నను పదిమందికోసం పనిచేయ మన్నాడు. తానుమాత్రం కాషాయరంగు శాలువా కప్పుకొని కూలీల కూలీలాగ వాళ్లతల్లో నాలికై ఆ ఓట్లడవి మనుషులకు అంకితమయ్యాడు శ్రీకాంత్.

* * *

హేల శ్రీకాంత్‌ని చూడవచ్చింది శ్రీకాంత్ మతి పూర్తిగా చెడిందని నిర్ధా రణ చేసుకొంది. మనిషి మోటుబారినా అమాయకత్వం, అబలతనం అలాగే ఉంది. మంచి విలువైన దుస్తుల్లో ఉన్నప్పుడు ఆ గుణాలు కొంత నాజూకుగా కనిపించాయేమోగాని, సాదా మనిషి వేషంలో ఉన్నప్పుడు అవి మరీ హాస్యాస్పదంగా కనిపించాయి హేలకు.

అప్పుడే హేల మారన్నను చూసింది. ఆధునిక వేషంతో, ఠీవిగా, మగరాయు డిగా ఆకర్షించాడు హేలను. మారన్నతో పరిచయం కూడా ఏర్పడింది హేలకు.

పాత మరలోంచి కూలీలు కొత్త మరకు వచ్చేస్తున్నారు. అడివిలో పనికి కూడా మనుషులు దొరకడంలేదు. కొత్తమరలో యిచ్చే జీతాలు, కూళ్ళు యిస్తేనేగాని గత్యంతరం లేదు. పాత మర మూతపడే పరిస్థితి వచ్చింది. ధనరాజు వ్యాపారానికి పెద్ద దెబ్బ



తగిలింది. కిందామీదా ఆలోచించాడు ధనరాజు. మారన్నతో రాయబారాలు సాగించాడు, విందులిచ్చాడు, రంగు రంగు మత్తుకాంతుల్లో నృత్యాలు చూపించాడు. మారన్నకి బాగా స్వార్థం నూరిపోశాడు. మారన్న పేరును మారరాజుగా చేశాడు. హేలను చేసుకోమన్నాడు. 'మార్రాజుగారు'గా మారిన మారన్నకు హేలావిలాసాలు మైమరిపించాయి. తన అదృష్టానికి పొంగిపోయాడు.

* * *

ఇంటికే రావడం మానేసిన మారన్నను పిల్చుకొచ్చాడు శ్రీకాంత్. పెంటమ్మ మాటేం జెపుతావని అడిగింది తల్లి

"వర్గభేదాలు లేవు; అందరిలోనూ ఎర్రటి రక్తమే పారుతోంది. పైతోలు రంగుల్లో ఏమీలేదు; అని ఉట్టి కబుర్లు చెప్పకుండా, చేసి చూపించాలి; నాటు, మోటు అని చూడకుండా, పెంటిని శ్రీకాంత్ చేసుకుంటే కాదూ?" అన్నాడు మారన్న.

దానికి శ్రీకాంత్, "పెంటికి నేను తగను, అర్భకణ్ణి; అదీగాక ఏనాటి నుంచో పెంటి నీది! నేను అంత బలం, ఓపికా లేనివాణ్ణి కాబట్టీ, నీలాంటివాళ్ళు పదిమంది సుఖంగా బతకడంకోసం ఆజమాయిషీ చూసుకోగల సమర్థుడివని నీకు అప్పజెప్పాను ఇలాగ మారిపోతావనికాదు" అన్నాడు. మారన్న రెచ్చిపోయాడు, "ఇప్పుడు నీదన్న దేదీ లేదుపో!" అన్నాడు

"ఔను! నాదేదీ కాదనే, అక్కర లేదనే వొదిలిపెట్టాను. అది నీ ఒక్కడిదీ కాదు. ఇక్కడున్న కష్టజీవులందరిదీని! నువ్వు వాళ్ళ బాగుకోసం పనిచేయవల

సినవాళ్ళ సేవకుడివి మాత్రమే అని మరిచిపోవద్దు!" అన్నాడు శ్రీకాంత్.

"మావాః నా పెళ్ళిమాటకేంగాని, శ్రీకాంతబాబు చెప్పింది సెయ్యి!" అంది అంతా వింటున్న పెంటమ్మ.

* * *

మారన్న మరీ తెగించాడు. లాభ దృష్టి, స్వార్థమూ పెరిగిపోయింది. జీతాలు, కూళ్ళు బకాయి ఉంచి పని చేయించుకోవడం మొదలుపెట్టాడు. తియ్యటి కబుర్లు చెప్పడం నేర్చాడు. జీతాలు తగ్గించాడు. నంతర్పణలు పెట్టించి నోళ్ళు కట్టించాడు. పట్నం నుంచి మనుషుల్ని రప్పించి బెదురు పుట్టించాడు. అమ్మవారి జాతర చేసు కోండని డబ్బు వెదజల్లాడు. కలపషెడ్డులు పెంచాడు రూపాయికోసం పైస ఊరికే పూజలకీ భజనలకీ వొదిలేవాడు. నష్టం చూపించడం నేర్చాడు. ఎన్నియుక్తులు పన్నినా కూలీల అసంతృప్తి ఎక్కువైంది. పాత మరకంటే అధ్వాన్నంగా తయారు చేశాడు పరిస్థితి.

పాతమర ధనరాజు ఎప్పుడో ఆపే శాడు. కొందరు ధనరాజుతో మర మళ్ళీ తెరిస్తే పనివాళ్ళంతా అందులోకే వచ్చేస్తా రని చెప్పారు. కొత్తమర తగలబడి, నేలమట్టం అయింతర్వాతే నామర తెరుస్తా నన్నాడు ధనరాజు మీసం మెలివేస్తూ.

* * *

శ్రీకాంత్ కూలీలను పనిలోకి వెళ్లొద్దన్నాడు. మర అందరికీ చెందా లన్నాడు. పెంటి కూడా శ్రీకాంత్‌కి తోడుగా, అంతాకలిసి కట్టుగా అక్రమాన్ని ఎదిరించాలని చెప్పుకు తిరిగింది

అప్పులిచ్చే ఆధారం మూతబడింది. ఆస్పత్రిలో ఏదీలేదు బడి మూలబడింది. అన్నీ మారాజుగారి చెప్పుచేతల్లో ఉండి పోయాయి.

పని మానేస్తే రోజెట్లా గడుస్తుం దన్నారు కూలీలు లేదూ అంటే కార్ఖానా మీద పడతామన్నారు. కలప గొడౌన్లు కొల్లగొడతామన్నారు. శ్రీకాంత్ వాళ్ళ ఉద్రేకాల్ని శాంతపర్చాడు. అదే సమయంలో ఒక రహస్యం తెలిసింది.

చేజిక్కిన దాంతో మారన్న, ధన రాజుతో చేరి అల్లుడు కాబోతున్నట్లు, రాత్రి కలపషెడ్డుల్ని తగలబెట్టించి, ఆ నేరం కూలీలమీదే రుద్దబోతున్నట్లు తెలిసింది.

ఆ రాత్రి కూలీలు గుంపుగా వెళ్ళారు. మారన్న మనుషులు కర్రలు కత్తులుపట్టి నిలబడ్డారు షెడ్లుల్లో ఉంచిన మందు గుండు అంటుకోడానికి రంజకంతాడు చురచురమని మండుకుంటూపోతున్నది. శ్రీకాంత్ రొప్పుకుంటూ పరుగెత్తి అది ఆరిపోడానికి దానిమీద పడ్డాడు. ఎక్కడ్నుంచో పిస్తోలు పేల్చిన ధ్వని, శ్రీకాంత్ తలమీద కర్రలు పడ్డాయి. పెంటి పరిగెత్తి వెళ్ళి శ్రీకాంత్ మీద



పడింది. పెంటికి దెబ్బలు తగిలాయి. కత్తి గాయం చేసింది.

మారన్నలో సంచలనం రేగింది, పరివర్తన కలిగింది. ఆగమంటూ వెళ్ళబోతూంటే ధనరాజు పిస్తోలు గురిపెట్టి అటకాయించాడు. ఇద్దరూ పెనుగులాడుతూండగా కూలీలు విజృంభించి ధనరాజుని పట్టుకున్నారు. ఎలాగోతెలిసి, పోలీసు బందోబస్తు కూడా వచ్చింది.

* * *

పెంటి బాగా గాయపడ్డది. బతుకుతుంది

శ్రీకాంత్ ని గుండుదూసుకుపోయింది. తలమీద పెద్ద దెబ్బ.

"నేను ఎలాంటివాడినైతేనేం, నాకిప్పుడు ఆ చింతలేదు. ఎవరికెంత మగసిరి, బలిమి ఉన్నా దేనికి ? మనిషి ఎలాంటి వాడైతేనేం, పదిమంది కోసం ఏదైనా మంచి తలపెట్టాడా లేదా ? అదే కావలసింది! నాకు వీలైన ఏ కొంచమో మంచి జరగాలనే తలపెట్టాను. ఆ తృప్తి నాకు చాలు !... మారన్నా ! మరేం విచారించకు, పదిమందికీ మంచి చేయాలని మాత్రం మర్చిపోకు. మీకోసం మీరు బతక్కండి, నలుగురికోసం బతకండి!"

—అవి శ్రీకాంత్ మాటలు, చివరి మాటలు కూడ.

* * *

పదోనాటి రాత్రి పెంటి ప్రమిద వెలిగించి శ్రీకాంత్ పడుకొనేచోట దీపం పెడుతున్నది. మారన్న "పెంటీ! మరేం అనుకోకు, నిన్నే చేసుకోవాలనుకుంటున్నాను!" అన్నాడు.

"ఒద్దులే మావా! నాకిప్పుడు పెళ్ళిమీద లేదుకూడ. శ్రీకాంత్ బాబు చెప్పినట్టే జరగాలి ! అందుకనే బతికాను,

తెలుసా! అలా జరక్కపోయిందా, నేనూరుకోను. ఏమైనా చేయగల్ను. ఆ బలం నాలో చేరింది! పెళ్లాడమన్నావు గాని,నా మనసులో శ్రీకాంతబాబున్నాడు మొగుడులాగానో, మొగాడిలాగానో కాదు. శ్రీకాంతబాబులో దేముణ్ణి చూశాను!" అంది పెంటమ్మ. మారన్న దీపానికి చేతులెత్తి జోడించాడు— అదీ కథ; మిగతా పనులు పూర్తయ్యాక.

శేషపతి, సుదర్శనధరం మచ్చు చూపించే కపికేతనం వారి తాజా చిత్రం 'శ్రీకాంత్'లో ఒక క్రొత్త అద్భుతం ఉంటుంది. అంతా చూశాకగాని అది యేమిటో చెప్పనలవి కాదు!— అని పత్రికల్లో ఒక ప్రకటన వెలువడింది.

శ్రీకాంత్ పాత్రను 'మహేంద్ర,' మారన్న పాత్రను 'నరేంద్ర'— పోషిస్తున్నట్టు, తెరకు ఇద్దరు కొత్తహీరోలను పరిచయంచేస్తున్నట్టు చెప్పుకున్నారు. చిత్రం అంతా కొత్తవాళ్ళతో తయారైంది. మూడొంతుల ముప్పాతిక చింతపల్లి అడవుల్లోనే తీశారు. అటవికులే చాలా మంది పాల్గొన్నారు.

*　　*　　*

చిత్రం విడుదలైంది నష్టం వస్తుందన్న నమ్మకంతోనే సుదర్శనధరంగారు నిశ్చింతగాఉన్నా, శేషపతిగారు ఒప్పుకోలేదు. నూరో రోజు పోస్టర్లు అచ్చువేయించారు. నష్టంలో యిదొక నష్టం అనుకున్నారు సుదర్శనధరంగారు కాని అలా జరగలేదు. నూరు రోజులు కాగా యింకా ఆడుతూనేఉంది.

చిత్రం అంతా తయారయ్యాక ఒక్కసారి మాత్రమే శేషపతిగారు చూశారు. అంతవరకు ఆ చిత్రంగురించి ఆయన ఏమీ పట్టించుకోనేలేదు. ఏ కొంచెమూ తెలియనే తెలియదు. అయితే చిత్రంచూశాక, ఆయన నమ్మకం ఆయనదే! శేషపతిగారి ప్రత్యేకత అది!

అలాంటి కథ ఎలా విజయవంతం అయిందో అర్థంకాలేదు. ఒకొక్కరు ఒకొక్కటి చెప్పారు. మొత్తంమీద అందరూ శ్రీకాంత్ పాత్ర గొప్పగా ఉందన్నారు. దేశం మొత్తంమీద మహేంద్రను ఆకాశానికెత్తారు నిజం కూడా అంతే. శ్రీకాంత్ పాత్ర అద్భుతంగా పోషింపబడింది. ధనికవేషం తర్వాత శ్రీకాంత్ ఎప్పుడూ శాలువా దిట్టంగా కప్పుకొనే కనిపిస్తాడు. శ్రీకాంత్ నాజూకైన ముఖం, తియ్యని కంఠం లాలిత్యం చాలా ఆకర్షించాయి ఆడవాంని మరీని. ఆంధ్రుల అందాల ముద్దుల హీరో అన్నారు. అందమైన కుర్రాడు, ఉజ్వల భవిష్యత్తు ఉన్నది, అన్నారు రెండుమూడు చిత్రాల్లో హీరోగా ఆహ్వానాలు కూడా వచ్చాయి అయితే ఆ చిత్రంలో 'అద్భుతం' ఏమిటో ఎవరికీ అర్థంకాలేదు.

*　　*　　*



శత దినోత్సవంనాడు కార్యక్రమాల అనంతరం శ్రీకాంత్ పాత్ర ధరించిన మహేంద్ర, మారన్న పాత్రధారి నరేంద్ర ముందుకు వచ్చారు. వారిద్దరికీ చెరో పూలదండను సుదర్శనధరంగారు అందించారు. వారిద్దరూ మాలలను ఒకరి మెడలో ఒకరు వేసుకొని వివాహం చేసుకున్నారు.

శ్రీకాంత్ పాత్రను 'మహేంద్ర' అనే పేరుతో ఇంద్రాణిచేత వేయించారు సుదర్శనధరంగారు. ఏ పదిమందికో తప్ప ఆ రహస్యం ఎక్కడా పొక్కకుండా జాగ్రత్తలో ఉంచారు.

మరొకసారి ఘనవిజయం సాధించిన నిర్మాత లిద్దరినీ చిత్రభారతంలో కృష్ణార్జునులు అని అంతా అభినందించారు, మరొకసారి!

* * *

'ఇద్దరు హీరోలు ఒకర్నొకరు వివాహం చేసుకున్నారు!'— అని పత్రికల్లో వార్త.

"మహేంద్ర అసలు పేరు 'ఇంద్రాణి' —యువతి. ఇదే మా చిత్రంలో అద్భుతం!"—అనే నిర్మాతల చిన్న వ్యాఖ్యానంతో.



# నలుగురు ఫకీర్లు

(గత సంచిక తరువాయి)

రెండో ఫకీరు తన వింత అనుభవాలు చెప్పటం ముగించేసరికి రాత్రి గడిచి తెల్లవారింది. రాజు ఎవరికంటా పడకుండా చల్లగా రాజభవనానికి తిరిగి వచ్చాడు. ఆయన ప్రార్థన ముగించి, స్నానంచేసి, దుస్తులు ధరించి సభకు వెళ్ళాడు.

ఆయన ఒక సందేశహరుణ్ణి పిలిచి, ఫలానిచోట నలుగురు ఫకీర్లు ఉంటారనీ, వారిని సగౌరవంగా పిలుచుకురావలిసిందనీ ఆజ్ఞాపించాడు. రాజు పంపిన మనిషి వెళ్ళేసరికి నలుగురు ఫకీర్లు తమ కాలకృత్యాలు ముగించుకుని, ఎవరిదారిన వారు వెళ్ళిపోబోతున్నారు. అతను వారితో, "రాజుగారు మిమ్మల్ని నలుగురినీ ఆహ్వానిస్తున్నారు. మీ రంతా నావెంట రండి" అన్నాడు.

ఫకీర్లు ఒకరి మొఖాలొకరు చిత్రంగా చూసుకుని రాజుగారి మనిషితో, "బిడ్డా, మా చర్యలపై మేమే సర్వాధికారులం. ఇహలోకపు రాజులతో మాకేంపని?" అన్నారు.

"మహాత్ములారా. ఇందులో కీడు ఏమీలేదు. మీరు రావటం మంచిది" అన్నాడు రాజదూత.

ఫకీర్లకు దేవదూత మాటలు జ్ఞప్తికి వచ్చి, సంతోషంగా రాజుగారి మనిషి వెంట బయలుదేరారు. వాళ్ళు రాజును చూసి ఆశీర్వదించి, అతనికి శుభంకలగాలని దీవించారు.

రాజు తన అభ్యంతరమందిరానికి

వెళ్లి, ఇద్దరు ముగ్గురు అంతరంగికులను పిలిచి, ఫకీర్లను తనవద్దకు పంపమని ఉత్తరువిచ్చాడు ఫకీర్లు వచ్చారు రాజు వారిని కూర్చోమని, "మీరు ఎక్కడి వాళ్లు? ఎక్కడికి పోతున్నారు? ఏం వింతలు చూశారు? మీ కథలు చెప్పండి" అని అడిగాడు.

ఫకీర్లు రాజుకు దీర్ఘాయురైశ్వర్యాలు కలగాలని ఆశీర్వదించి, "రాజా, మేము ఫకీర్లం. ప్రపంచమంతా తిరిగాం. యాత్రికుడికి విశ్రమించే చోటే ఇల్లు. మేము చూసినదంతా చెప్పాలంటే ఎంతకాల మైనా పట్టుతుంది'' అన్నారు.

రాజు వారిపట్ల అత్యాదరం చూపి, వారికోసరం ఉదయపు భోజనం తెప్పించాడు. వారి భోజనం ముగిసినాక రాజు వారితో, "మీ కథలన్నీ చెప్పండి నేను మీరు కోరిన సహాయం ఏదైనా చేస్తాను" అన్నాడు.

"రాజు మమ్మల్ని క్షమించాలి. మా అనుభవాలన్నీ చెప్పటానికి మాకు శక్తి లేదు. చెబితే అవి మీకు రుచించవు,'' అన్నారు ఫకీర్లు.

రాజు నవ్వి, "నిన్నరాత్రి మీరు మీ అనుభవాలు చెప్పుకుంటున్నచోట నేను కూడా ఉన్నాను. ఉండి, మీలో ఇద్దరి అనుభవాలు పూర్తిగా విన్నాను. మిగిలిన ఇద్దరి అనుభవాలు కూడా వినాలని నా కోరిక. కొద్దిరోజులపాటు మీరు నా దగ్గర ఉండండి" అన్నాడు.

రాజు ఇలా అనేసరికి ఫకీర్లు వణికిపోయి, తలలు వంచుకొని, ఏమీ అనలేక పోయారు.

వారి భయమూ, మూగతనమూ గమనించి, రాజు వారికి ఉత్సాహం కలిగించటానికి, "వింత అనుభవాలు కలగనివాడు ఎవరూ ఉండడు. నేను రాజును అయినప్పటికీ, నేను విచిత్ర మైన దృశ్యాలు చూశాను. వాటిని మీకు చెబుతాను. అవి వింటే మీకు ఆత్మ విశ్వాసం కలిగి, సంకోచం తొలగి పోతుంది," అన్నాడు.

ఆయన కథను సంతోషంగా వింటామన్నారు ఫకీర్లు. రాజు వారితో ఇలా చెప్పనారంభించాడు.

మా తండ్రిగారు పోయి నేను సింహాసనం ఎక్కినప్పుడు నేను చిన్నవాణ్ణి. రొమానియాదేశం అప్పుడు నారాజ్యంలో చేరి ఉండేది.

ఒక ఏడు బుదుఖషాన్‌కు చెందిన ఒక వర్తకుడు నా రాజధానికి విస్తారంగా సరుకు తీసుకొనిరావటం తటస్థించింది. అంత గొప్ప వర్తకుడు ఈ నగరానికి ఎన్నడూ వచ్చిఉండలేదని చారులద్వారా నాకు తెలిసింది. నేనతన్ని పిలవనంపాను. అతను నాకు ఇవ్వటానికి అర్హమైన కానుకలు, అన్ని దేశాలకు చెందిన అపూర్వ వస్తువులు, ఇచ్చాడు. ప్రతి ఒక్క వస్తువూ అమూల్యంగానే కనబడింది. కాని అన్నిటికన్నా విలువైనది

ఒక పెట్టిలో ఉంచిన కెంపు. దాని బరువు దాదాపు రెండున్నర తులాలు. అది ఆకృతిలోనూ, రంగులోనూ ఎంతో అందంగా ఉండి, గొప్ప కాంతి గలిగి ఉన్నది.

కావటానికి నేను రాజునే గాని, అలాటి మాణిక్యాన్ని ఎన్నడూ చూసి ఉండలేదు నేను దాన్ని స్వీకరించి, వర్తకుడికి అనేక బహుమానాలిచ్చి, రహదారి పత్రాలు ఇస్తూ, నా రాజ్యంలో అతన్ని ఎవరూ ఎట్టి సుంకమూ అడగ రాదనీ, అతనికి ప్రతిచోట సమస్త సదుపాయాలూ, మర్యాదలూ జరగాలనీ, అతనికి రక్షకులు ఏర్పాటు కావాలనీ, ఎలాటి నష్టమూ కలగకూడదనీ ఉత్తరువు జారీచేశాను

ఆ వర్తకుడు రోజూ నా దర్శనం చేసుకునేవాడు. అతనికి రాచమర్యాదలు బాగా తెలుసును. మంచి మాటకారి. అతను చెప్పే కథలు శ్రవణపేయంగా ఉండేవి. నేను సభచేసినప్పుడల్లా ఖజానానుంచి ఆ కెంపును తెప్పించి, సభ జరుగుతూ ఉన్నంతసేపూ దాన్ని చూసి ఆనందించేవాణ్ణి.

ఒకనాడు సభలో కూర్చొని ఉన్నాను. నా చుట్టూ నా కొలువుచేసే ఉద్యోగులూ, ప్రముఖులూ, రాజునైనందుకు నన్ను అభినందించటానికి వచ్చిన విదేశీయ రాయబారులూ పరివేష్ఠించి ఉన్నారు. నేను నా అలవాటు ప్రకారం మాణిక్యాన్ని తెమ్మన్నాను. కోశాధికారి దాన్ని తెచ్చాడు. నేను మాణిక్యాన్ని నా చేతిలోకి తీసుకుని, మెచ్చుకుంటూ, చూడమని ఫ్రెంచి రాయబారికి ఇచ్చాను. అతను దాన్ని చూసి చిరునవ్వు నవ్వి, అమితంగా మెచ్చుకున్నాడు. తరవాత అది అందరిచేతుల్లోకి వెళ్ళింది. అందరూ ఏకగ్రీవంగా, అలాటి మాణిక్యం ఉండదని అన్నారు.

అప్పుడు నా తండ్రిగారికిందా, నా కిందా కూడా వజీరుగా ఉండిన బుద్ధిశాలి లేచి నిలబడి, "ఏలినవారు నాకు అభయం ఇచ్చిన పక్షంలో ఒక్క విషయం మనవిచేస్తాను" అన్నాడు.

నేను సరేనన్నాను.

"మహారాజా! తమరు ఒక రాజు. రాజులు రాళ్ళను అంత గొప్పగా పరిగణించటం ఉచితంకాదు. ఎంత అందంగా ఉన్నా, మంచి రంగూ, బరువూ, కాంతీ కలిగినా అది రాయే. పైగా ఈ సమయంలో సభలో అన్నిదేశాల రాయబారులు హాజరై ఉన్నారు. వాళ్ళు తమ తమ దేశాలకు తిరిగిపోయి ఈ సంగతి ఇలా చాటింపు వేస్తారు. ఎంత వింత రాజు! ఒక్కడో ఒక కెంపు సంపాదించాడు. రోజూ దాన్ని తెప్పించి, దాన్ని తానే మెచ్చుకుంటూ అందరికీ చూపిస్తాడు! ఈ మాట విని ఏ రాజు నవ్వడు? మహాప్రభూ, ఖురాసాన్‌లోని నిషాపూర్‌లో ఒక పేద వర్తకుడివద్ద మూడు



తులాలకన్న హెచ్చు బరువుగల మాణి క్యాలు పన్నెండున్నాయి: ఆయన వాటిని ఒక పట్టీకి కుట్టించి, తన కుక్క మెడలో కట్టాడు," అన్నాడు మా వజీర్.

ఈ మాటలు వినేసరికి నాకు ఎంతో అసంతృప్తి కలిగి, కో పం తో, "ఈ వజీర్‌ను ఖతంచెయ్యండి" అన్నాను

వెంటనే తలవర్లు వచ్చి ఆయనను పట్టుకుని, వధ్యస్థానానికి తీసుకుపోబో యారు. అంతలో ఫ్రెంచి రాయబారి నా ముందుకు వచ్చి, చేతులు జోడించి నిలబడ్డాడు.

అతన్ని ఏంకావాలని అడిగాను.

"వజీర్‌గారు చేసిన తప్పేమిటో నేను తెలుసుకోవచ్చుననుకుంటాను'' అన్నాడ తను.

"అబద్ధం చెప్పటంకన్న, అందు లోనూ రాజులదగ్గర అసత్యం చెప్పడం కన్న పెద్ద తప్పు ఏముంటుంది?" అన్నాను.

''ఏలినవారు ఆయన అబద్ధాన్ని ఇంకా రుజువుచేసుకోలేదే? ఒకవేళ ఆయన చెప్పినది నిజమేనేమో? నిర్దో షిని చంపించటం ధర్మంకాదు."

అతనికి సమాధానంగా నేను ఇలా అన్నాను: ''ఒక దేశంనుంచి ఇంకో దేశానికీ, ఒక నగరంనుంచి ఇంకో నగ రానికీ లాభంకోసం చెదతిరిగి వర్తకం చేస్తూ, ప్రతి చిల్లిగవ్వా భద్రంగా పొదుపుచేసుకునేవాడు వెలలేని మాణి క్యాలను కుక్క మెడపట్టీకి పొదుగు తాడంటే నేను నమ్మను."

"దేవుడి శక్తిలో ఏదీ అసాధ్యం కాదు. అలాటిది జరగనుకూడావచ్చు. దేశాలు తిరిగే వర్తకులకూ, యాత్రికు లకూ అపూర్వమైన వస్తువులు దొరుకు తాయి. వాళ్ళు వాటిని తమవెంట తెచ్చు కుంటారు. నా సలహా ఏమిటంటే మీరు మీ వజీరును కావాలంటే ఖైదులో ఉంచండి. జీవితాంతం భక్తితో కొలిచిన వజీరును ఆగ్రహావేశంలో చంపెయ్యటం

అధర్మం. చెరసాలలు ఉన్నదెందుకు? ప్రభువులకు ఎవరిపైనగాని ఆగ్రహం కలిగితే వారిని బంధించి, ఆగ్రహం తగ్గినమీదటనో, వాళ్ళు నిర్దోషులని రుజువైనమీదటనో విడుదలచేసి, రాజు అకారణ రక్తపాతం కలిగించకుండా ఉండటానికి," అన్నాడు ఫ్రెంచి రాయబారి.

ఆతని మాటలు కాదనటానికిలేక నేను, "మీ మాట తీసివెయ్యను. అతన్ని ఖైదుచేయిస్తాను. ఒక్క ఏడాదిలోపల అతనన్నది నిజమని రుజువైతే, అంటే ఏ కుక్కమెడకైనా కెంపులపట్టీ ఉన్నట్లు రూఢిఅయితే ఈ వజీరును విడుదలచేస్తాను. లేకపోతే తల తీయిస్తాను," అన్నాను.

ఈ వార్త తెలిసి వజీరు కుటుంబం శోకసముద్రంలో మునిగిపోయింది. ఆయనకు పదిహేనేళ్ళ కుమార్తె ఉన్నది. ఆమె చాలా చక్కనిదీ, తెలివిగలదీ, బాగా చదువుకున్నదీనూ. వజీరుకు ఆమె అంటే ప్రాణం. అందుచేత ఆయన ఆమెకోసం తన కచేరీభవనం వెనక ఒక అందమైన మందిరం కట్టించి, ఆమెకు చెలికత్తెలుగా గొప్ప ఇళ్ళకు చెందిన కన్యలనూ, అందమైన దాసీలనూ ఏర్పాటు చేశాడు. వారందరితోనూ కలిసి ఆమె కాలక్షేపం చేస్తూండేది.

వజీరును ఖైదులో పెట్టిననాడు ఆయన కుమార్తె తన చెలికత్తెలతో కలిసి బొమ్మలపెళ్ళి చేసుకుంటూ ఆనందిస్తున్నది. వాద్యసంగీతం మోగుతున్నది. మిఠాయిలు తయారవుతున్నాయి. ఇంతలో ఆమె తల్లి చెదిరిన దుస్తులతో ఏడుస్తూవచ్చి, "నా కడుపున నువ్వెందుకు పుట్టావే? ఇంతకన్న ఏ గుడ్డికొడుకుపుట్టినా తండ్రికి తోడయేవాడు!" అన్నది.

"గుడ్డికొడుకు నీకేం ఒరగబెట్టేవాడమ్మా? వాడేంచేసేవాడో నేనూ అది చెయ్యగలను," అన్నది కూతురు.

"అభాగ్యురాలా! నీవల్ల ఏమవుతుందే? నీ తండ్రి నోరుజారి రాజు దగ్గిర ఏదో అనేసరికి రాజు ఆయన్ను ఖైదుచేయించాడు," అన్నది వజీరు భార్య.

"నాన్న ఏమన్నాడో చెప్పు."

"నిషాపూర్‌లో ఎవడో ఒక వర్తకుడు తన కుక్కమెడపట్టీకి పన్నెండు కెంపులు పొదిగాడని మీ నాన్న అన్నారుట. రాజు ఆ మాట నమ్మలేక, మీ నాన్న అబద్ధమాడారని ఖైదులో పెట్టించాడు. ఆయనకే కొడుకుంటే, తన తండ్రిమాట రుజువుచెయ్యటానికి ఎన్నిపాట్లయినా పడిఉండును ఎలాగో తండ్రిని ఖైదునుంచి విడుదల చేయించేవాడు."

"అమ్మా, విధిని ఎదిరించలేం. నిర్దోషికి కష్టాలు సంప్రాప్తమైనప్పుడు



దైవంమీద భారంవేసి, ఓరిమి వహించాలి. దేవుడు దయామయుడు. కష్టాలు తొలగిస్తాడు. ఏడ్చి మొత్తుకోవటం మంచిది కాదు. మన శత్రువులు మన శోకం గురించి మరొకవిధంగా వ్యాఖ్యానించి రాజుగారి ఆగ్రహాన్ని రెచ్చగొట్టవచ్చు. ఏడుస్తూ కూర్చునేకన్న రాజుగారి క్షేమంకోసం ప్రార్థనలు చెయ్యటం మేలు. మనము బానిసలమూ, ఆయన యజమానీనూ. ఆయన యోగ్యుడు. దయదలుస్తాడు," అంటూ కూతురు తల్లిని తన మృదువచనాలతో నమ్మించింది. వజీరు భార్య శాంతపడి, తన మందిరానికి తిరిగివెళ్ళింది.

ఆ రాత్రి వజీరుకుమార్తె తన దాది భర్తను పిలవనంపి, అతని కాళ్ళమీద పడి విలపిస్తూ, "నేను మా తండ్రిని చెర విడిపించటానికీ, మా అమ్మ నాపైవేసిన నిందను కడిగివేసుకోవటానికీ ఒక పథకం ఆలోచించాను. అందుకు నీ సహకారం కావాలి. నేను బయలుదేరి నిషాపూర్ వెళ్ళి, కుక్క మెడకు మాణిక్యాలపట్టీ కట్టిన వర్తకుణ్ణి చూసి, నా తండ్రిని విడిపించుకోవాలి," అన్నది.

ఆ మనిషి తప్పించుకోజూశాడు గాని ఆమె ఎంతో ప్రాధేయపడినమీదట ఆమెకు సహాయపడటానికి అంగీకరించాడు.

"చడీ చప్పుడు కాకుండా, రహస్యంగా ప్రయాణ సన్నాహం చెయ్యి. రాజులకు కానుకలుగా ఇయ్యదగిన వర్తక సరుకులు కొన్ని కొను. అవసరమైనంత మంది బానిసలనూ, నౌకర్లనూ చేర్చు. కాని నా పథకం గురించి మటుకు ఎవరికీ చెప్పకు," అన్నదామె అతనితో.

అతను ఆమె చెప్పినదంతా చేసి, సరుకులన్నీ కంచరగాడిదలమీదా, ఒంటెలమీదా ఎత్తి, బయలుదేరాడు. వజీరు కుమార్తె మగవాడివేషం ధరించి, తన ప్రయాణం గురించి ఎవరికీ తెలపకుండా, తానుకూడా అతనివెంట బయలుదేరింది. మర్నాడుదయం వజీరు ఇంట ఆపిల్ల కనిపించలేదు అయితే లోకానికి వెరిచి, ఆమెతల్లి తన కూతురు కనపడ

కుండా పోయిన సంగతి రహస్యంగా ఉంచింది

వజీరు కుమార్తె తానొక వర్తకుడి కుమారుణ్ణని చెప్పుకుంటూ, అనేక మజిలీలు దాటి నిషాపూర్ చేరింది. ప్రయాణం ముగిసినందుకు ఆమె పరివారం ఎంతో సంతోషించి, ఒక బిడారు చావడిలో దిగి, తమ సరుకులు దించుకున్నారు. వజీరు కుమార్తె ఆరాత్రి అక్కడే గడిపి, మర్నాడు ఉదయం స్నానంచేసి, రొమానియా ఆచారం ప్రకారం మేలిదుస్తులు ధరించి, నగరం చూడటానికి బయలుదేరింది. ఆమె పోయి పోయి, నాలుగు రాజవీదులు కలిసే కూడాలి (చౌక్) చేరి, అక్కడ నిల బడింది. ఒక పక్కన ఆమెకు ఒక నగల దుకాణం కనబడింది. అందులో రత్నాలు కుప్పలుపెట్టి, అమ్మకానికి ఉన్నాయి. చాలా ఖరీదైన దుస్తులు ధరించిన బానిసలు చేతులు కట్టుకుని నిలబడి ఉన్నారు. వర్తకుల పెద్దలాగా కనిపిస్తున్న యాభై ఏళ్ళ వయసుగల వ్యక్తి ఒకడు కూర్చుని, తనచుట్టూ కుర్చీపీటలమీద కూర్చునిఉన్న ధని కులతో మాట్లాడుతున్నాడు.

వజీరుకుమార్తె ఆ దుకాణంలో ప్రదర్శనకు పెట్టిన రత్నరాసులనుచూసి ఆశ్చర్యపడి, తనకు పనిఉన్న వర్తకుడు ఆ దుకాణం యజమానేనేమో నను కున్నది. ఇలా అనుకోగానే ఆమెకు ఎంతో సంతోషం కలిగింది. తన ఊహ నిజంకావాలని ఆమె దేవుడికి ప్రార్థన కూడా చేసింది.

ఆమెచూపులు పక్కకు తిరిగేసరికి పక్కదుకాణంలో రెండు ఇనపకట కటాల బోనులూ, వాటిలో బంధించి ఇద్దరు మనుషులూ వేళ్ళాడుతూఁడటం కనబడింది. వాళ్ళిద్దరూ "మజ్నూ" ల లాగున్నారు వాళ్ళ శరీరాలలో చర్మమూ, ఎముకలూతప్ప ఏమీలేవు. వాళ్ళ జుట్లూ, గోళ్లూ తెగపెరిగిపోయి ఉన్నాయి. వాళ్ళు తలలను రొమ్ముల మీదికి వేళ్ళాడేసుకుని కూర్చుని ఉన్నారు బోనులకు - రెండు వైపులా ఇద్దరు వికారమైన నీగ్రోలు ఆయుధాలు ధరించి నిలబడి ఉన్నారు. వజీరు కుమార్తె ఈ దృశ్యంచూసి అమిత ఆశ్చర్యపోతూ, "ఓయి దేవుడా!" అనుకున్నది.

మరో పక్కకు చూసేసరికి ఆమెకు ఇంకొక దుకాణం కనిపించింది. అందులో తివాసీలు పరిచిఉన్నాయి. వాటిమీద ఒక దంతపుబల్ల ఉన్నది. బల్లమీద మఖ్మల్ మెత్త పరిచిఉన్నది. ఆ మెత్తమీద ఒక కుక్క ఉన్నది దాని మెడపట్టీలో రత్నాలు పొదిగి ఉన్నాయి. ఆ కుక్క ఒక బంగారు గొలుసుతో కట్టిఉన్నది. ఇద్దరు అంద మైన నౌకర్లు దాన్ని చూసుకుంటున్నారు. ఒకడు వింజామరతో ఈగలను తోలు

తున్నాడు; ఆ వింజామరపిడి రత్నాలు పొదిగి, బంగారంతోచేసి ఉన్నది. రెండో వాడు బుటేదారీపనిచేసిన రుమాలుతో కుక్క మూతీ, పాదాలూ తుడుస్తు న్నాడు.

వజీరు కుమార్తె కుక్కను పరికించి చూసేసరికి, దాని మెడపట్టీలో తాను విని ఉన్న ప్రకారం పన్నెండు పెద్ద మాణిక్యాలు పొదిగి ఉన్నట్టు స్పష్ట మయింది. ఆమె దేవుడికి ధన్యవాదాలు అర్పించి, తాను ఆ కుక్క మెడపట్టీని తీసుకుపోయి రాజుగారికి చూపేమార్గ మేమిటా అని యోచనచేసింది. అలా చేస్తేగాని ఆమె తండ్రి విడుదలకాడు.

ఆమె ఈ సమస్యను గురించి మధన పడుతూఉండగా దారేపోయేవాళ్ళు ఆమె సౌందర్యానికి అచ్చెరువొంది, "ఇంత అందగాళ్ళు కూడా ఉంటారా ?" అను కున్నారు. వర్తకుల పెద్ద కూడా ఆమెను చూసి ముగ్ధుడై, తన నౌకరుతో, "ఒరే, నువుపోయి, ఆ వర్తక యువకుణ్ణి నేను పిలుస్తున్నానని పిలుచుకురా!'' అన్నాడు. నౌకరువచ్చి ఆమెకు ఆ మాట చెప్పాడు

అలాటి ఆహ్వానాన్నే కోరుకుంటున్న వజీరుకుమార్తె ఒప్పుకున్నది. ఖాజా (వర్తకుల పెద్ద)కు ఆమెను దగ్గిరగా చూడగానే హృదయం పొంగిపోయింది. ఆయన ఆమెకు ఎదురువెళ్ళబోయి తబ్బిబ్బుపడిపోయాడు. అది గ్రహించి వజీరుజాదీ (వజీరు కుమార్తె) ఆయ నను కౌగలించుకున్నది. ఖాజా ఆమెను నుదుటిమీద ముద్దుపెట్టుకుని, తన సరసనే కూర్చోబెట్టుకుని, ఆమె పుట్టు పూర్వోత్తరాలు అడిగాడు.

"నేను రొమేనియా నివాసిని. మా పూర్వీకులు అనేక తరాలుగా కాన్‌స్టాంటి నోపుల్‌వాసులు నా తండ్రి వర్తకుడు. ఆయన పెద్దవాడై పోయాడు. వర్తకం మీద దేశాలు తిరగలేడు. ఇంతకాలమూ నేను ఇల్లు కదిలి ఎరగను ఇప్పుడు మొదటిసారిగా బయలుదేరాను. నేను పడవమీద రావటంపడలేదు. నేలమార్గాన వచ్చాను. కాని తమ పేరు పర్షియా అంతటా మారుమోగుతూ ఉండటంచేత, తమ పరిచయభాగ్యంకోసమే ఇంత దూరం వచ్చాను. దైవానుగ్రహంచేత నా వాంఛ ఈడేరింది. తమ దర్శనం అయింది. నాకు తృప్తి కలిగింది. ఇక సెలవిప్పించండి," అన్నది వజీర్‌జాదీ.

ఈ ఆఖరుమాటకు ఖాజా తుళ్ళిపడి, "బాబూ, ఎంత అశుభం పలికావు! నా దగ్గిర కొన్ని రోజులుండు. నీ వస్తు వులూ, సరుకూ, నౌకర్లూ ఎక్కడ ?" అన్నాడు.

"నేను బిడారుచావడిలో దిగాను. మిగిలిన వారిని అక్కడనే ఉండమని, నేను తమర్ని వెతుక్కుంటూ వచ్చాను," అన్నది వజీర్‌జాదీ.

"నీలాటివాడు చావడిలో బస చెయ్య

రాదు. నేను ఈ నగరంలో పరువు ప్రతిష్ఠలున్నవాణ్ణి. నీ సరుకులన్నీ తెప్పించు. వాటికి ఒక ఇల్లు ఏర్పాటు చేస్తాను. నీ సరుకు చూసి, నీకు అత్యధికంగా లాభంవచ్చేటట్టు చూస్తాను. నువు పదిచోట్లు తిరిగే పనికూడా ఉండదు. నువు కొన్ని రోజులపాటు నా అతిథివిగా ఉంటే నాకు సంతృప్తిగా ఉంటుంది," అన్నాడు ఖాజా.

వజీర్ జాదీ ఏవో అభ్యంతరాలున్నట్టు నటించింది. కాని ఆయన వాటిని తోసి పుచ్చాడు ఆమె వర్తకసరుకులు తీసుకు రావటానికి మనుషులు చావడికి వెళ్ళారు. ఆమె సాయంకాలందాకా ఖాజావెంట ఉన్నది.

చీకటిపడి, దుకాణంమూసేసి, ఖాజా తన ఇంటికి బయలుదేరాడు. అప్పుడు ఇద్దరు బానిసలలో ఒకడు కుక్కను ఎత్తుకున్నాడు. రెండోవాడు కుర్చీ పీటనూ, తివాసీనీ తీసుకున్నాడు. నీగ్రో బానిసలు కటకటాల బోనులను కూలీల నెత్తినపెట్టి మోయిస్తూ, వెంట బయలుదేరారు. ఖాజా వజీర్ జాదీతో చెట్ట పట్టాలు పట్టుకుని కబుర్లు చెబుతూ తన ఇల్లు చేరాడు. అది చిన్న రాజభవనం లాగా ఉన్నది

భోజనాలకు ఏర్పాట్లు జరిగాయి. తివాసీలు పరిచి, పరుపులువేసి, వాటి చెంత ఆహార పదార్థాలు తెచ్చిపెట్టారు. కుక్కకు కుర్చీపీటవేశారు. ఖాజా, వజీర్ జాదీలు పరుపుమీద కూర్చుని, పానీయాలు సేవించారు. తరవాత ఖాజా భోజనాలకు ఉత్తరువు ఇచ్చాడు. రకరకాల దివ్యమైన వంటకాలు వారిముందు వడ్డించారు.

ముందుగా ఒక గిన్నెలో కొంత మాంసంకూర పెట్టి కుక్కవద్దకు తీసుకుపోయి, ఒక గుడ్డపరిచి, దానిమీద ఆ కూరగిన్నె ఉంచారు. కుక్క ఎత్తుపీట మీదినుంచి దిగి, తనకు కావలిసిన మాంసంకూర తిని, ఒక బంగారు గిన్నెలో నీరు తాగి, తిరిగివెళ్ళి పీట ఎక్కింది. బానిసలుదానిమూతీ, పాదాలూ తుడిచారు. తరవాత కుక్క తిని విడిచి పెట్టిన మాంసమూ, తాగి విడిచిపెట్టిన నీరూ బోనులవద్దకు తీసుకుపోయి, ఖాజా ఇచ్చిన తాళపుచెవులతో వాటిని తెరిచి, అందులోఉన్న ఇద్దరు మనుషులనూ కర్రలతో తెగబాది, వారిచేత కుక్క ఎంగిలి తినిపించి, తాగించి, మళ్ళీ వాళ్ళను బోనుల్లో బంధించారు.

ఇదంతా ముగిసినాక ఖాజా భోజనం చెయ్యనారంభించాడు. జరిగినదంతా చూసి జుగుప్సచెందిఉన్న వజీర్ జాదీ తన ముందున్న ఆహారాన్ని తాకనైనా లేదు ఖాజా ఎంత బలవంతంచేసి కూడా లాభంలేకపోయింది.

"నువు భోజనం చెయ్యకపోవటానికి కారణం ఏమిటి ?" అని ఖాజా ఆమెను అడిగాడు.



"మీ ప్రవర్తన నాకు హేయంగా కనిపిస్తున్నది. కారణం చెబుతాను. భగవంతుడి సృష్టిలో ఉత్తమోత్తముడు మనిషి. అందుచేత భగవంతుడు సృష్టించిన ఇద్దరు మనుషులకు కుక్క ఎంగిలి పెట్టటం ఏ మతమూ సహించదు. వాళ్ళను ఖైదులో పెట్టటంతో సరిపోలేదా? ఇతరత్రా వాళ్ళుకూడా మీతో సమానులే గద. మీరు ముసల్మానులని నాకు నమ్మకం కలగకుండా ఉన్నది. నా ఈ సందేహం నివృత్తిఅయితేనేగాని నేను మీ భోజనం తాకలేను," అన్నది వజీర్‌జాదీ.

ఖాజా ఇలా అన్నాడు : "నాయనా, నీ సందేహం నాకు అర్థమయింది. నీలాగే నన్ను చాలామంది విమర్శిస్తారు. ఈ నగరవాసులు నన్ను కుక్కలను పూజించేవాడని కూడా అనుకుంటారు. నన్ను అలా పిలవటమేగాక, నన్ను గురించి ప్రచారం కూడా చేశారు. పాపులూ, నాస్తికులూ అల్లా శాపానికి గురిఅగుదురుగాక !" అంటూ ఆయన దైవధ్యానం చేశాడు.

అతను ముసల్మానేనని వజీర్‌జాదీ తృప్తిపడి, "మీరు ముసల్మాన్ అయి ఉండికూడా ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నారు ? నలుగురిచేత ఎందుకు మాట పడుతున్నారు ?" అని అడిగింది.

"నాయనా, నేను అందరిచేతా మాట పడుతున్నమాట నిజమేకాని, నా ప్రవర్తనకు కారణం బయటపెట్టటం ఇష్టంలేక పన్నులు రెట్టింపు చెల్లిస్తున్నాను. అసలు సంగతి వింటే ఎవరికైనా దుఃఖమూ, ఆగ్రహమూ కలుగుతాయి. నేను ఆ రహస్యం నీకు చెప్పనందుకు క్షమించాలి. చెప్పే మనోదార్ఢ్యం నాకు లేదు, వింటే నీకు మనశ్శాంతి ఉండదు," అన్నాడు ఖాజా.

"అయితే పోనివ్వండి చెప్పకపోవ

టమే మంచిది,'' అని వజీర్ జాదీ భోజ నానికి ఉపక్రమించింది.

వజీర్ జాదీ ఖా జా వెంట రెండు మాసాలున్నది. అయితే ఈ కాలంలో ఆమె ఎంత యుక్తిగా మసలుకున్న దంటే, ఆమె ఆడదన్న అనుమానం ఖాజాకు కలగనేలేదు. తన అతిథి మగ వాడేనని నమ్మికూడా ఖాజా ఆమెపట్ల అంతకంతకూ అధికమైన అనురాగం చూపి, ఆమె కొద్దిసేపు కనిపించకపోతే ఆందోళనపడుతూ వచ్చాడు.

ఒకనాడు ఇద్దరూ కూర్చుని తాగే టప్పుడు వజీర్ జాదీ ఏడవ నారంభిం చింది. ఖాజా ఆమెను ఓదార్చుతూ, తన చేతిరుమాలుతో ఆమె కన్నీరు తుడుస్తూ, ఆమె దుఃఖానికి కారణం అడిగాడు.

"నాయనగారూ, ఏం చెప్పను ? నేను మిమ్మల్ని చూసిఉండకపోతే మీ అపారమైన దయకు గురికాకపోదును. నే నిప్పుడు రెండు చిక్కులమధ్య ఇరు క్కున్నాను. మిమ్మల్ని వదిలివెళ్ళటం ఇష్టంలేదు, నేనిక్కడ ఉండనూలేను. నేను వెళ్ళితీరాలి. కాని ఆ తరవాత నాకు మీ పితృవాత్సల్యంలాటిది లభి స్తుందన్న ఆశ లేదు," అన్నదామె.

ఈ మాట విని ఖాజా గొంతుకు బొంగురుపోయేలాగా ఏడిచి, "నాన్నా, ఈ ముసలాడిమీద అప్పుడే విసు గెత్తిందా ? వెళ్ళిపోతా నంటున్నావు ! అలాటి ఆలోచనే వద్దు. నేను బతికి నన్నాళ్ళూ ఇక్కడే ఉండు. నువు పోయిన తరవాత ఒక్కరోజు బతకను, అకాలమృత్యువువాతపడిపోతాను. నువు నమ్మకమైన నౌకరును పంపి, నీ వస్తు వాహనాలన్నీ తెప్పించుకో. నీ తల్లి దండ్రులను పిలిపించుకో. ఆ తరవాత హాయిగా ఇక్కడనే నీ వర్తకం సాగించు. నేను కూడా ఎన్నో కష్టాలూ, బాధలూ పడి, ఎన్నో దేశాలు తిరిగిన వాణ్ణి. ఇప్పుడు పెద్దవాణ్ణి అయి పోయాను. నాకా పిల్లలు లేరు. నువు నాకు కొడుకుకన్న ఎక్కువైనవాడివి. నిన్ను నా వారసుణ్ణి చేస్తాను. నా వ్యవ హారాల బరువంతా నువే మీదవేసుకుని, నాకింత తిండిపెట్టు. నేను పోయినాక నన్ను పాతేసి, నా ఆస్తి అంతా అనుభ వించు," అన్నాడు.

వజీర్ జాదీ ఇలా అన్నది : "మీరు నాకు తండ్రికన్న ఎక్కువగానే ఉన్నారు. నేను నా తల్లిదండ్రులను కూడా మరిచిపోయాను. కాని నాకు నా తండ్రి ఒక్క సంవత్సరం గడువే ఇచ్చాడు. నేను గడువులోపల తిరిగి రాకపోతే ముసలితనంలో ఆయన కుళ్ళి కుళ్ళి చచ్చిపోతాడు. అందువల్ల, నేను మా తండ్రిమాట నిలబెట్టటానికి మీరు దయచేసి అనుమతించాలి. మీరు నాకు చూపిన దయను ఎన్నటికీ మరవను. దేవుడి అనుగ్రహం ఉంటే మనం మళ్ళీ కలుసుకోవచ్చు.''



యు :

ఆమె చెప్పినది కాదనటం ఖాజాకు సాధ్యంకాలేదు. చివరకు ఆయన, "నువు వెళ్ళే తీరాలంటే నేను కూడా నీ వెంట వస్తాను," అన్నాడు.

ఆయన వెంటనే ప్రయాణ సన్నాహం చేయించాడు. ఆయన ప్రయాణం వార్త విని ఆయనవెంట నగరంలోని వర్త కులు అనేకమంది తాము కూడా ప్రయాణం కట్టారు. ఖాజా తన వెంట బోలెడు రొక్కమూ, రత్నాలూ, అనేక మంది సేవకులూ, బానిసలూ, అపూర్వ వస్తువులూ, వస్తువాహనాలూ తీసు కున్నాడు. మిగిలిన వర్తకులు తమ తమ శక్తికొద్దీ వర్తకపు సరుకులు వెంట బెట్టుకుని వచ్చారు. అంతా కలిసి ఒక పటాలంగా తయారై, మంచి ముహూర్తం చూసుకుని బయలుదేరారు. వర్తకపు సరుకులన్నీ ఒంటెలమీదా, నగదూ, రత్నాలూ కంచరగాడిదల మీదా వేశారు. బిడారుకు రక్షణగా అయిదు వందలమంది సాయుధ భటులు ఏర్పాటయారు. అందరికీ వెనకగా ఖాజా, వజీర్ జాదీలు మేనాలలో ఎక్కి వచ్చారు. ఒక ఒంటెమీద డోలీలాటిది అమర్చి, అందులో కుక్కనూ, ఖైదీల బోనులనూ ఉంచారు. బిడారు దారిలో అనేక మజిలీలుచేస్తూ, క్షేమంగా కాన్ స్టాంటినోపుల్ శివార్లు చేరుకుని, నగరం వెలపల మజిలీ చేసింది.

వజీర్ జాదీ ఖాజాతో, "మీ అను మతి అయితే నేను వెళ్ళి నా తల్లిదండ్రు లను కలుసుకుని, మీ కోసం ఒక ఇల్లు బసగా ఏర్పాటు చేస్తాను మీకు సౌకర్యం కలిగినప్పుడు వచ్చి నగ రంలో నివాసం ఏర్పాటు చేసుకోండి," అన్నది.

"నేను నీ కోసమే గదా ఇంతదూరం వచ్చాను. నువు వెళ్ళి నీ తల్లిదండ్రులను కలుసుకుని, నీకు దగ్గరలో ఉండేటట్లుగా నాకు బస ఏర్పాటు చేయించు." అన్నాడు ఖాజా.

వజీర్ జాదీ ఆయనవద్ద సెలవు పుచ్చుకుని తన ఇంటికి తిరిగివచ్చింది ఆమెనుచూసి వజీర్ ఇంట అందరూ ఆశ్చర్యంతో, "ఎవరీ మనిషి, ఇలా లోపలికి వచ్చేస్తున్నాడు!" అను కున్నారు.

వజీర్ జాదీ పరిగెత్తుకుంటూ వెళ్ళి తల్లి కాళ్ళమీదపడి, "నేను నీ బిడ్డనే నమ్మా!" అని చెప్పుకున్నది.

తల్లి ఆమెను మందలిస్తూ, "ఎంత జిత్తులమారివే, పొగరుబోతుదానా! నీకూ, నీ వంశానికీ ఎంత అప్రతిష్ఠ తెచ్చావు. నువు పోయావే అనుకుని, ఇన్ని కన్నీళ్ళు కార్చి ఊరుకున్నాను," అన్నది.

వజీర్ జాదీ తలపాగా తీసేస్తూ, "అమ్మా, నేను అనుచితమైన చోటికి పోలేదు. అనుచితమైన పని ఏదీ చెయ్య లేదు. నువు కోరినట్టు నాన్నను చెరవిడి

పించటానికే అంతా చేశాను. దేవుడి దయవల్ల నా పని నెరవేరింది. నేను నా వెంట ఆ నిషాపూర్ వర్తకుణ్ణి, మెడ పట్టీలో పన్నెండు మాణిక్యాలుగల కుక్కనూ తెచ్చాను. ఈ పని చెయ్యటానికి మగవేషం వేసుకోవలిసివచ్చింది. నాకు ఇంకొక్కరోజు పనిమాత్రమే ఉన్నది. ఆ తరవాత నాన్నను చెర విడిపించి, నేను ఇంటికి తిరిగి వస్తాను," అన్నది.

తన కూతురు చేసిన ఘనకార్యం పూర్తిగా అర్థంచేసుకుని, ఆమె మానానికి ఎలాటి కళంకమూ కలగలేదని తెలుసుకున్నాక తల్లి దేవుడికి ధన్యవాదాలు చెప్పుకుని, కుమార్తెను కౌగలించుకుని, ముద్దుపెట్టుకుని, ఆమె మళ్ళీ వెళ్ళటానికీ, ఆమె ఇష్టప్రకారం చెయ్యటానికీ అనుమతి ఇచ్చింది.

ఆమె ఖాజావద్దకు తిరుగు ప్రయాణమయింది. కాని ఆమె ఎంతకూ తిరిగి రాలేదని ఆందోళనపడి, నగరంకేసి బయలుదేరిన ఖాజా ఆమెకు ఎదురుపడ్డాడు. ఆయన ఆమెనుచూసి, "బాబూ, ఈ ముసలాణ్ణి ఒంటరిగా వదిలేసి ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగాడు.

"మా ఇంటికి మీతో చెప్పే వెళ్ళాను గద. మీరు ఒంటరిగా ఉంటారనే వెంటనే బయలుదేరి వచ్చేశాను," అన్నది వజీర్‌జాదీ.

నగర ద్వారానికి సమీపంలో, సముద్రతీరానికి చేరువగా ఒక తోట కనబడింది. ఖాజా అక్కడ గుడారాలు వేయించి, బస ఏర్పాటు చేయించాడు. అక్కడ వాళ్ళు భోజనంచేసి, సాయంకాలం అవుతూండగా, ఆరుబయలులో ఎత్తుకుర్చీలమీద కూర్చున్నారు.

ఆ సమయంలో రాజుగారి వేటగాడు అటుగాపోతూ వారినీ, వారి బిచాణానూ చూసి ఆశ్చర్యపడుతూ నిలబడ్డాడు. ఖాజా నౌకర్లు వాణ్ణి దగ్గిరికి పిలిచి, నువు ఎవరివని అడిగితే తాను రాజుగారి వేటగాళ్ళ పెద్దనని వాడు చెప్పాడు.

నౌకర్లు ఖాజాకు ఈ మాట చెప్పారు. వేటగాడు కావాలంటే తమతోపాటు కాఫీ సేవించవచ్చునని ఖాజా తన నీగ్రో బానిసద్వారా కబురుపంపాడు. వేటగాడు ఖాజాపేరు విని ఆశ్చర్యపోతూ వచ్చి, ఖాజా వైభవం చూశాడు. కుక్క వైభవంచూసి వాడికి మరింత దిగ్భ్రమ కలిగింది. వాడు ఖాజా ఇచ్చిన కాఫీ తీసుకుని సెలవు పుచ్చుకునేటప్పుడు ఖాజా వాడికి కొన్ని బట్టలూ, ఇతర బహుమానాలు ఇచ్చాడు.

మర్నాడు ఉదయం వేటగాడు నా దర్బారుకువచ్చి, ఖాజా గురించీ, అతని పరిస్థితులను గురించీ చెప్పాడు. వాడు నాకు తాను చూసినదంతా చెప్పాడు. ఖాజావద్ద ఉన్న కుక్కను గురించీ, బోనుల్లో ఖైదుచేసిఉన్న మనుషులను గురించీ వింటూనే నాకు ఆగ్రహంవచ్చి,




"ఆ దుర్మార్గపు వర్తకుడికి మరణ దండన విధించాలి!' అని, ఆ దుర్మార్గుడి తల నరికి తెమ్మని ఇద్దరు భటులను పంపాను.

యాదృచ్ఛికంగా ఫ్రెంచి రాయబారి అక్కడే ఉన్నాడు. అతను చిరునవ్వు నవ్వేసరికి నా ఆగ్రహం రెట్టింపు అయింది "రాజు సమక్షంలో అకారణంగా ఇకిలించి, పళ్ళువెళ్ళబెట్టటం గొప్ప అపచారం. కారణంలేక నవ్వే కన్న ఏడవటం మేలు," అన్నాను.

రాయబారి, "మహారాజా, నా నవ్వుకు కారణాలు అనేకమైన ఆలోచనలు రావటమే. మొదటిది, వజీరు నిజం చెప్పాడు; ఆయనను చెరవిడిపించాలి. రెండవది వజీరురక్తం కళ్ళ చూసిన అపకీర్తి మీకు రాదు. మూడవది ఏలినవారు అకారణంగా, ఏ నేరమూ చెయ్యని వర్తకుణ్ణి చంపమని ఉత్తరువిచ్చారు. ఈ చివరి విషయంలో, తమరు ఎవడో ఊసుపోనివాడి మాటలు నమ్మి మనుషులను చంపమని ఉత్తరువు లియ్యటం నాకు అమిత ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఈ వర్తకుడు ఎటువంటి వాడో ఈశ్వరుడికి మాత్రమే తెలుసు. అతన్ని తమ సమక్షానికి రప్పించి, అతని గాథ చెప్పమనండి. అతను నిజంగా దోషి అయితే తమ ఇష్టంవచ్చినట్టు చేయవచ్చు" అన్నాడు.

రాయబారి ఇలా అన్నమీదట వజీరు అన్నమాటలుకూడా జ్ఞాపకంవచ్చి, ఆ వర్తకుణ్ణీ, అతని కొడుకునూ, కుక్కనూ, ఖైదీలున్న బోనులనూ వెంటనే నా ముందు హాజరుపెట్టమని ఉత్తరువులిచ్చాను నా భటులు తక్షణమే బయలుదేరి వెళ్ళి, నా ఆజ్ఞ నిర్వర్తించారు.

ఖాజా, అతని కొడుకూ మొదట నా ముందుకువచ్చి నిలబడ్డారు. ఇద్దరు వెలలేని దుస్తులు ధరించి ఉన్నారు. కుర్ర

వాడి చక్కదనానికి అందరూ ముగ్ధులయారు. ఆ కుర్రవాడు ఒక బంగారు పళ్లెంలో అమూల్యమైన రత్నాలుపోసి తెచ్చి సింహాసనం ముందుపెట్టి, వందనం చేసి, వినయంగా నిలబడ్డాడు. ఆ రత్నాల కాంతులు సభాభవనమంతా ప్రకాశమానం చేశాయి. ఖాజాకూడా నాకు అభ్యుదయంకోరుతూ ఆశీర్వదించాడు. ఆయన మాటలు మృదుమధురంగా ఉన్నాయి.

ఆ మాటలు విని లోలోపల హర్షించి కూడా పైకి ఆగ్రహం నటిస్తూ, "ఓ నరరూప రాక్షసుడా ? నీ మాయాజాలం అంతా ఏమిటి ? నువు ఏ నరకకూపం కేసి పోతున్నావు ? నీ మతాచారాలేమిటి? నువు ఏ పైగంబరును కొలుస్తావు ? నువు నా స్తికుడివే అనుకున్నా నీ ప్రవర్తనకు కారణం కనపడదే!" అన్నాను.

ఖాజా ప్రశాంతంగా ఇలా అన్నాడు: "ఏలినవారి ఆయురైశ్వర్యాలు వృద్ధి అగుగాక. తమ దాసివాడి మత విశ్వాసం ఇదీ. దేవుడు ఒకడే. ఆయనకు సాటిలేరు. నేను పవిత్రుడైన మహమ్మద్ ప్రార్థననే నిత్యమూ జపిస్తాను. రోజూ అయిదుసార్లు ప్రార్థిస్తాను. ఉపవాసా లుంటాను. తీర్థయాత్రలు చేస్తాను. నాకున్న సంపదలో అయిదోవంతు దానధర్మాలకింద ఖర్చుచేస్తాను. నేను ముసల్మానును. తమకు ఆగ్రహం కలిగించిన లక్షణాలు నాలో ఉన్నాయి. అందుకు కారణాలు బయటపెట్టలేను. అందుకే నన్ను అందరూ గర్హిస్తారు; నన్ను శునకారాధకు డంటారు. నేను రెట్టింపు పన్నులు కూడా కట్టుతున్నాను. నాలోని లోపాలను నేను ఒప్పుకున్నాను. కాని వాటికి కారణం మటుకు ఎవరికీ చెప్పలేదు."

ఈ మాటలు విని నేను మరింత మండిపడి, "నన్ను మాటలతో మభ్యపెట్టుతున్నావు. నీ అక్రమ ప్రవర్తనకు కారణాలేవో స్పష్టంగా వివరించి, నాకు నమ్మకం కలిగేటట్టు చేస్తేనేగాని నేను నీ మాటలు నమ్మను. అలా అయితేనే నీ ప్రాణాలు దక్కుతాయి. లేకపోతే మహమ్మదుగారి మతాన్ని అతిక్రమించినందుకు నీ డొక్క చీల్పించి, అందరికీ గుణపాఠంగా ఉండేటట్టు చేస్తాను," అన్నాను.

"రాజా, ఈ అభాగ్యుడి రక్తం కళ్ళ చూడవద్దు. నా యావదాస్తీ తీసుకోండి– అది తక్కువేమీకాదు; నన్నూ, నా కొడుకునూ ప్రాణాలతో వదలండి," అన్నాడు ఖాజా.

నేను నవ్వి, "మూఢుడా, నాకు నీ సంపద లంచం పెడదామనుకుంటున్నావా ? నిజం చెబితేనేగాని నిన్ను విడిచిపుచ్చను," అన్నాను.

ఈ మాట వింటూనే ఖాజా కళ్ళ వెంట అశ్రుధారలు కారనారంభించాయి.



"మహారాజా, తమరు నాకు మరణ శిక్ష కాకుండా ఏ చిత్రహింస విధించినా భరించి ఉండేవాణ్ణి, కాని నా కథ చెప్పి ఉండను. కాని అన్నిటికన్నా ప్రాణం ప్రియమైనది. తెలిసి ఎవడూ బావిలో దూకడు. ప్రాణం కాపాడుకోవటం పరమధర్మం. ఆ ధర్మాన్ని ఉల్లంఘించటం దేవుడి ఆజ్ఞను ఉల్లఘించటమే. తమరు కోరుతున్నారు గనక నా గత చరిత్ర వినండి. కాని ముందు ఖైదీలను బంధించి ఉంచిన ఆ రెండు బోనులూ తెప్పించి, తమకు దగ్గిరగా ఉంచుకోండి. నా కథ చెప్పబోతున్నాను. నేను అసత్యం చెప్పిన పక్షంలో వాళ్ళను నాపై నేరారోపణ చెయ్యమని, న్యాయం అమలుచెయ్యండి," అన్నాడాయన.

నేను అందుకు ఒప్పుకుని, రెండు బోనులూ తెప్పించి, ఖైదీలను బయటికి తీయించి, ఖాజా సమీపంలో వారిని నిలబెట్టాను. (సశేషం)




**నే**ను గవర్నమెంటు ఉద్యోగంకోసం తపస్సుచేసి, చచ్చీచెడి ఒక పెద్ద సైజు బడిపంతుల్ని కాగలిగాను. మా జగపతి 'ద హెల్ విత్ ద గవర్నమెంట్' అన్నాడు. అని ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీ ముకుందంగారి పర్సనల్ సెక్రెట్రీగా చేరాడు. అప్పటి వరకూ వాడి చొరవని తక్కువ అంచనా కడుతున్న నేను వాడి ధైర్యాన్ని మనసారా అభినందించలేకుండా వుండలేకపోయాను. మూడవ తరగతి యం. ఏ. గాడయితేనేం? ఎయిర్ కండిషన్డ్ ఆఫీసు, ముకుందంగారి ఖర్చుతో చిన్న సైజు బంగళా, పెట్రోలుతోసహా కారు. నెలకు పన్నెండు వందల జీతం. ఒత్తి కర్రపెత్తనం ఉద్యోగం. ముకుందంగారి బిజినెస్–కం–పర్సనల్ వ్యవహారాలు నేర్పుగా చేసుకుపోవటమే వాడి ఉద్యోగం. వాడి అదృష్టానికి నేను అసూయపడకుండా వుండలేకపోయాను.

జగపతీ నేనూ ఒకే కంచంలో తిని ఒకే మంచంలో దొర్లాము. మా ఇద్దరి మధ్యా ఎలాంటి దాపరికాలూలేవు. నేను విశాఖపట్నం. వెడితే పెళ్లాంపిల్లల్ని మరచిపోతానని మా ఆవిడా, వాడు విజయవాడ వచ్చినా అంతేనని వాడి భార్యా కలిసికట్టుగా వాపోవడం మా ఇద్దరికీ తెలుసు.

యూనివర్సిటీలో ఏదో పనిమీద వచ్చి జగపతిఇంట్లో దిగాను రెండు.

రోజుల్లో నా పని పూర్తయినా వీడు వదలండే! కదిల్తే తంతానన్నాడు వైజాగ్ ఇన్ ద నయిట్ చూపెడతాట్ట. ఏ లండనో, ప్యారిస్సో చూపెడతాన న్నంత ఉత్సాహంతో.

జగపతి ఆఫీసురూములో ఎదురు బొదురుగా కూర్చున్నాం. వాడి దర్జా చూసి అసూయపడటం స్నేహధర్మం కాదేమోనని తర్కించుకుంటున్న సమయంలో

"నువ్వు దయ్యాల్ని నమ్మతావా?" బాంబులాంటి ప్రశ్న వేశాడు. అదిరి పడ్డాను.

"నమ్మను..." అన్నాను.

"ఎందుకు నమ్మవు?" మళ్లీ ప్రశ్న.

"నీ పిండాకూడులా వుంది ప్రశ్న. నా ఇష్టం. నేన్నమ్మను" అన్నాను మొండిగా.

"పోనీ దేవుడున్నాడంటావా?"

"సరే! వున్నాడనుకుందాం. వుంటే?..."

"దేవుడున్నప్పుడు దయ్యాలెందు కుండవోయ్?"

వీడి రీజన్ మండినట్లుగావుంది.

"తోటకూరవుంటే బచ్చలకూర వుండాలని ఎక్కడుందోయ్?" అన్నాను.

"ఉరే! మొండివాదం చెయ్యకు..." అనినావంక కోపంగా చూశాడు జగపతి.

"అసలు సంగతేమిట్రా?" అన్నాను.

"ఇదివర్లో నీకంటే ఎక్కువ మొండి గానే వాదించేవాణ్ణి కాని నా కంటితో చూశాను..."

"ఏమిటి చూసింది?..." రెట్టిం చాను.

"దయ్యాన్ని..."

'వీడికేం పోయేకాలం చెప్మా'? అని పించింది. మళ్లీ అదే ప్రసక్తి? అయినా వాదం పెంచాలనిపించింది నాకు.

"అసలు నువ్వు చూసింది దయ్యం అని దాఖలా వుందా?"

"ష్యూర్..."

"నేను నమ్మను. నువ్వే మనిషినో చూసి దయ్యం అనుకుని వుంటావు" అన్నాను సాగదియ్యాలని. అసలు దయ్యాలమీదా, భూతాలమీదా, ఆ మాట కొస్తే దేవుళ్లమీదా, నాకో ఖచ్చితమైన అభిప్రాయమంటూ లేదు. కేవలం వాదం కోసమే అలా అన్నాను.

"మైగాడ్! దయ్యానికీ మనిషికీ తేడా తెలియనంత మూర్ఖుణ్ణను కున్నావా?"

"నేను మూర్ఖుణ్ణే! ఆ తేడా ఏమిటో నాకు తెలీదు. నువ్వు చెప్పు. నేను విన డానికి సిద్ధం..." అన్నాను. జగపతి మరీ రెచ్చిపోయాడు. చేతిలో వున్న పేపర్‌వెయిట్ నా ముఖానకొట్టి సోరీ అంటాడేమోనన్నంత భయంవేసింది.

టెలిఫోన్ మోగింది. జగపతి రిసీ

వర్ ఎత్తి మాట్లాడాడు. అవతలి గొంతు స్పష్టంగా వినిపించడంలేదు. జగపతి మాత్రం...

"యస్ సర్..."

"యస్. సార్..."

"ఓకే! సార్..." అని రిసీవర్ పెట్టేశాడు.

"కూర్చో. ఇప్పుడే వస్తాను. బాస్ పిలిచారు" అని ఏవో కాగితాలు పేడ్‌లో పెట్టి తీసుకెళ్లాడు. పదినిముషాల తరువాతొచ్చాడు.

"బాస్ ఎల్లుండి అమెరికా వెడుతున్నారు. ఏర్పాట్లన్నీ పూర్తికావాలి" అన్నాడు జగపతి.

వాడి "బాస్" అమెరికావెడితే నాకేం? ఆఫ్రికావెడితే నాకేం? నాకాసక్తిగావున్న జగపతి అర్ధంతరంగా ఆపేసిన దయ్యం సంగతి గుర్తుచేశాను.

"అవునవును. దయ్యాలు లేవని గదూ నీ అభిప్రాయం..."

"అవును"

"పోనీ నీకు చూపిస్తాను. నమ్ముతావా?"

"చూపించు. అప్పుడు చూద్దాం"

"పందెం?"

"ఎంత?"

"సన్ ఎన్ సీలో పార్టీ ఖర్చు..."

"ఓ...కే...!"

"అయితే రాత్రి పదిగంటలకు మనం ఇక్కడకు రావలసి వుంటుంది. ఎందుకని అడక్కు. దయ్యాన్ని చూడ్డానికి..."

"నీ ఉద్దేశ్యం? ఈ బంగళాలోనే దెయ్యంవుందనా?"

'అదంతా నీ కనవసరం. నేను చెప్పినట్లు చెయ్యి..."

"సరే"

జగపతి తన బాస్ వివరాలు చెప్పాడు. చెప్పడంలో కూడా ఒక మంచి యజమానిమీద ఒక మంచినౌకరు చెప్పేవిధంకన్నా ఎక్కువగా చెప్పాడు. ఎంతో డివోటెడ్‌గా చెప్పాడు.

శ్రీ ముకుందం ఆంధ్రదేశంలో ఒక పెద్ద బిజినెస్ మేగ్నెట్ (ట). ఆయన స్వంతాన నాలుగు పంచదార మిల్లులూ, రెండు సిమెంటు ఫ్యాక్టరీలూ, ఎన్నో ప్రయివేటు బ్యాంకుల్లో షేర్లూ, ఇంకా ఎన్నో పబ్లిక్ సంస్థలతో సంబంధం(ట). సంవత్సరంలో ఏడెనిమిది నెలలు విదేశాల్లోనే గడుపుతాడు(ట). ఇవ్వాళ లండన్, రేపు ప్యారిస్, ఎల్లుండి జినీవా, ఆ మరనటిరోజు కోపెన్‌హాగన్ (ట). మధ్య మధ్యన స్వదేశం వచ్చి బిజినెస్ వ్యవహారాలు అలా...అలా... చూసుకుని వెళ్లిపోతూవుంటారు (ట). ప్రధానమంత్రయినా ఫారిన్ ఎక్స్ఛేంజికి తడుముకోవలసి వస్తుందేమోగాని శ్రీ ముకుందంగారికి మాత్రం అలాంటి ఇబ్బంది వుండదని పెద్ద సర్కిల్స్‌లో జోక్‌గా అనుకోవడం మామూలు (ట).




అందుకే ఆయన వ్యవహారాలు చూసుకునేందుకు నమ్మకమైన ఒక పర్సనల్ సెక్రెటరీ కావాల్సి వచ్చింది (ట). ఆయనకు కావలసిన మనిషి జగపతిలో దొరికాడు(ట). నిజమే ననిపించింది. జగపతి సమర్ధతా, చొరవా, స్వామి భక్తీ నాకు తెలియనివి గావు.

నిజానికి ఈ వివరాలు నాలో ఏమాత్రం ఆసక్తిని కలిగించలేదు. అయినా జగపతి అంత 'ఇది'గా చెబుతున్నపుడు చిన్నబుచ్చడం ఇష్టంలేక ఊరుకున్నాను. మరికొన్ని వివరాలు చెప్పాడు.

ముకుందంగారు ఖచ్చితమైన నియమాలు గలవాడు (ట). ఒఖ డ్రింక్ విషయంలో తప్ప ఆయనలో వేలెత్తి చూడడానికి ఏ బలహీనతా లేదు (ట) క్రమశిక్షణతో పిల్లలు ముగ్గుర్నీ పైకి తీసుకొచ్చారు (ట). ఒక్కొక్కరూ రెండేసి ఫ్యాక్టరీల అజమాయిషీ చేస్తున్నా ఇప్పటికి తండ్రెదుటపడి మాట్లాడరు (ట) వగైరా... వగైరా...

* * *

రాత్రి భోజనాలు ముగించుకుని ముకుందంగారి బంగళా చేరుకున్నాము. కారు పోర్టికోలో ఆగింది. యూనిఫారమ్‌లో వున్న నౌకరు డోర్ తెరిచాడు.

"దొరగారు పడుకున్నారా ?" అడిగాడు జగపతి.

లేదుసార్ ! ఇంకా ఏవో కాగితాలు చూసుకుంటున్నారు" జగపతి ఆఫీసు రూములోకి నడిచాము. నాలుగు ఇన్‌కంటేక్స్ ఫైళ్లను ముందేసుకున్నాడు జగపతి.

"నేను చెయ్యగూడని పనొకటి చేస్తున్నాన్నా..." అన్నాడు జగపతి మెల్లగా నన్నుద్దేశించి.

"ఏమిటది ?"

"మనం దేనిగురించి ప్రస్తుతం ఇక్కడున్నామో ఆ విషయం ఇప్పుడు నీకు చెబుతున్నాను. అతి రహస్యమైన ఈ విషయాన్ని బయటివాళ్లెవరికీ తెలియకుండా కట్టుదిట్టం చేశాను. ఈ విషయాన్ని ఎక్కడా చెప్పనని ప్రమాణం చెయ్యి..." అన్నాడు. ఇప్పటివరకూ నేను జగపతి మాటలు సీరియస్‌గా తీసుకోలేదు. దయ్యాన్ని చూపిస్తానని పందెంవేసినప్పుడుకూడా తమాషాక్రిందే తీసుకున్నాను. ఇప్పుడు వాడి సీరియస్‌నెస్ చూస్తుంటే నిజంగా దయ్యాన్ని చూపెట్టడానికి సిద్ధంగా వున్నట్లుగా వున్నాడు.

ప్రమాణం చేశాను

గడియారం పదకొండు కొట్టింది జగపతి ఆఫీసుగది మినహా బంగళా అంతా నిద్రలో మునిగిపోయింది. గేటు దగ్గర గూర్ఖా నిద్రమత్తు వొదిలించుకోడానికి గాబోలు అప్పుడప్పుడూ అర్థంలేకుండా అరుస్తున్నాడు. ఔట్ హవుస్లో కూడా సందడి చచ్చిపోయింది.

పన్నెండు కొట్టింది.

"పద..." అంటూ జగపతి మెట్ల వైపుకు దారితీశాడు. మెట్లమీదయూఫోమ్ తివాచీ మెత్తగావుంది. పొడుగాటి కారిడార్‌గుండా వెళ్లి కుడివైపుకు తిరిగాము. జగపతి ఒక కిటికీదగ్గర ఆగిపోయాడు. వాతావరణం చలిగా వున్నా ముఖం చెమటలు కక్కుతోంది. ముఖంలో భయం స్పష్టంగా కనిపిస్తోంది. "చూడు..." అని సైగచేశాడు.

కిటికీగుండా చూశాను. విశాలమైన ధనవంతుల బెడ్‌రూం. సినిమాహాలంత వుంది సినిమాల్లో చూపించినంత హుందాగావుంది. సోఫాలో ముకుందం గారు కూర్చున్నారు. ఆయన వీపు మాకు కనిపిస్తోంది. పక్కకు తిరిగినప్పుడు మాత్రం గుప్పుగుప్పుమంటూ పైపు కనిపిస్తోంది కొంచెం దూరంలో టీపాయ్ మీద ఒక బాటిల్ వేట్-69 - సగం నిండుగావున్న గ్లాసు

ముకుందంగారు తాపీగా పానీయం పుచ్చుకుంటున్నారు బెడ్‌రూం లైటు డిమ్‌గా వెలుగుతోంది నా దృష్టి విశాలమైన మంచాలమీద పడింది. మంచంమీద ఒక స్త్రీ కనిపించింది. గతుక్కుమని రెండడుగులు వెనక్కి వేశాను. మరొకరి బెడ్‌రూములోకి తొంగిచూడవలసిన చవకబారు స్థితికి దిగజారినందుకు నా మీద నాకే జుగుప్స కలిగింది. జగపతి మీద కోపమొచ్చింది.

జగపతి నాచెయ్యిపట్టుకుని గుంజాడు. మళ్లీ చూశాను. ముకుందంగారు అడ్డుండటంవల్ల ఆమె ముఖం కనిపించడంలేదు. గుడ్డి వెలుతురులో కూడా ఆమె శరీరం పచ్చగా బంగారం రంగులో కనిపించింది. అవయవాలన్నీ పొందికగా వున్నవి. యవ్వనంలో పిటపిట

లాడుతున్నట్లు ఆమె శరీరం బిగువు చెబుతోంది. చిన్న బాతింగ్ అండర్ వేర్ మినహా దాదాపు నగ్నంగావుంది.

ముకుందంగారు లేచి నిలబడ్డారు. ముఖమల్ నైటీ గౌనలో అచ్చం సినిమాల్లో జమీందారులా వున్నారు. కొంచెం సేపు ఆమె అందాన్నంతా కళ్లతోనే అనుభవించారు మంచంమీద కూర్చున్నా... ...గా వొళ్లంతా నిమిరారు. నడుంచుట్టూ చెయ్యివేశారు. ముద్దుపెట్టుకున్నారు. మెల్లగా ఆమె పక్కన చోటుచేసుకున్నారు

గదులోని సభ్యత గుర్తు ...ంది. అప్పటివరకూ చూసింది సభ్యతయి నట్టూ తరువాత చూడబోయేది నిన్నం దేహంగా అసభ్యత అయినట్టూ అని పించింది

వదమన్నట్లు సైగచేశాను. దొంగల్లా క్రిందకుదిగి జగపతి రూములో దూరిపోయాం.

జగపతి ఫ్రిజ్ తెరచి రెండుగ్లాసులు టేబుల్‌మీదపెట్టాడు. ఒక్కొక్క పెగ్ చొప్పున రెండు గ్లాసుల్లోనూ విస్కీ వేసి సోడానింపాడు.

"తీసుకో..." అంటూ అందించాడు. మాట్లాడకుండా తీసుకుని ఒక్కగుక్కలో త్రాగేశాను.

"ఇప్పుడేమంటావ్ ?" అన్నాడు నా వంక కొంటెగా చూసి. నాకు కొంచెం సత్తువొచ్చినట్లనిపించింది. శరీరం కొంచెం వేడెక్కింది.

"నువ్వింత భ్రష్టుడవని ఇప్పుడే తెలుసుకున్నాను" అన్నాను.

"ఉద్రేకపడకు. నీ బాధ నాకర్థమయింది. ఆమె ముకుందంగారి భార్య మాత్రంకాదు. ఆమె పోయి పది సంవత్సరాలయింది" అన్నాడు సమర్థింపుగా.

"ఆమెకాకపోతే మరో స్త్రీ మనం అలాచూస్తుంటే బార్బరస్..." అన్నాను కోపంగా.

"అక్కడే పొరబడ్డావు. మరో స్త్రీ ఆ గదిలోకి ప్రవేశించే అవకాశంలేదు." వాడు చెప్పింది నమ్మడానికి నేను సిద్ధంగాలేను.

"అయితే ఎవరంటావ్ ?" అన్నాడు.

"దయ్యం..." అన్నాడు జగపతి. నాకు కొంచెం భయంలాంటి అనుభూతి కలిగినా ఇంకా నమ్మబుద్ధి కావడంలేదు. దయ్యానికీ మనిషికీ భేదం ఏమిటో నాకు సరిగా తెలియదుగాని ఆమె నూటికి నూరుపాళ్లూ మనిషి. సందేహం లేదు. దయ్యం అనుకోవడం ఎలా ? అసాధ్యం ఆ మాటే అన్నాను.

"ఋజువు కావాలా ? తలుపులన్నీ వేసినవి వేసినట్లే వుంటవి. మరో గంట పోయాక చూస్తే ఆమె అక్కడ కనిపించదు..." అన్నాడు.

"సరే ! మరోగంట పోయాక చూద్దాం," అన్నాను మొండిగా, ఏమన

డానికీ తోచక. జగపతి మరికొన్ని వివరాలు చెప్పాడు

'ముకుందంగారు శ్రీరామచంద్ర మూర్తి అంతటి సద్గుణసంపన్నుడు ఇప్పటికీ ప్రొద్దుటే లేచి భార్య ఫోటో ముందు రెండు నిముషాలు మౌనంగా గడిపిగాని మరో పని ముట్టడు ఆమె పేరు పెడతానంటే చాలు ఇప్పటికీ ఎంతయినా ధర్మం చెయ్యడానికి వెనుదీయడు. అసలు స్వతహాగా ఆయన దానకర్ణుడు. అష్టయిశ్వర్యాలూ వున్నా వృద్ధాప్యంలో వొంటరివాడు

ఒంటరివాడు గనుకనే స్త్రీ వ్యామోహం అంటగట్టే ప్రమాదంవుంది. కాని ఆయన నిఖార్సయిన మనిషి. నిష్ఠగల మనిషి. ఈ వయసులో మరో స్త్రీని తీసుకొచ్చి పెట్టుకోవడం అనూహ్యం. ఒకవేళ వాదంకోసం అలాంటి దౌర్బల్యానికి పాల్పడ్డాడని అనుకున్నా ఇలా దొంగచాటు వ్యవహారం చెయ్యవలసిన అవుసరం ఆయనకు లేదు. ఏ లేడీ సెక్రెటరీ రూపంలోనో పబ్లిగ్గా పెట్టుకుని వుండొచ్చు- నిజానికి ఇలాంటి ప్రసక్తి ఒక పార్టీలో వచ్చింది అప్పుడు ముకుందంగారేమన్నారో తెలుసా ? మైగాడ్! లేడీస్ ఆర్ సింప్లీ న్యూసెన్స్" అన్నారు. అందుకే ముకుందంగారికిలాంటి వ్యామోహాలు అంటగట్టే అవకాశం లేదు" అని ముగించాడు జగపతి.

ఈ రీజనింగ్ నాకు నచ్చలేదు. పైన చెప్పిన క్వాలిఫికేషన్లున్నంత మాత్రాన వ్యామోహానికి అతీతుడు కాగలడని నాకు నమ్మకం కుదరలేదు. విశ్వామిత్రుడంతటివాడు స్త్రీముందు పల్టీ కొట్టాడు ఆ మాటే అనేశాను.

"సరే ! అలా అనుకోవడానికి వీలు లేదు బంగళా చుట్టూ కాపలా. ఇంట్లో పదిమంది నౌకర్లు. ఇంతమంది కళ్లు కప్పి ఒక స్త్రీ ఆయన బెడ్‌రూములోకి ప్రవేశించే అవకాశం లేదు. అందుకే అది దయ్యమని ఖచ్చితంగా చెబుతున్నాను. నేననుకోవడమేకాదు ఇక్కడ మా స్టాఫంతా కూడా ఇదే మాట..." ముకుందంగారు దయ్యంతో కాపురంచేస్తున్నారని వాళ్ల నమ్మకం. అందుకే వాళ్లెవరూ తమకు తాముగా ఆ గదిఛాయలకు వెళ్లరు..." అని ఆపాడు జగపతి.

జగపతి మళ్లీ వివరించి చెప్పాడు.

"ఈ మధ్య సర్వెంట్స్‌లో ఒక కొత్తవిషయం ప్రచారంలో కొచ్చింది. ముకుందంగారు చదువుకునే రోజుల్లో ఒక అందమైన యువతిని ప్రేమించారనీ, ఇద్దరూ పెళ్లిచేసుకుని హాయిగా వుందామనుకునే సమయంలో పెద్దలు అంగీకరించలేదనీ, తత్ఫలితంగా ఆమె ఆత్మహత్య చేసుకుందనీ, ఆమె పిశాచమై ఈ రకంగా ముకుందంగారితో సంసారం చేస్తోందనీ వగైరా... వగైరా..."

"నిజానిజాలు ముకుందంగారికి




తెలుసు. భగవంతుడికి తెలుసు. మూడో కంటికి తెలియదు" అని ముగించాడు జగపతి. గడియారం ఒకటి కొట్టింది.

మళ్లీ ఒకసారి బెడ్‌రూము వైపుకు వెళ్లాము. ఈసారి నాకు నిజంగా భయంవేసింది. బింకంగా జగపతి వెంట వెడుతున్నా అడుగులు పడటం కష్టమయి పోయింది.

కిటికీగుండా మళ్లీ చూశాము. మంచాలమీద ముకుందంగారొక్కరే గాఢమైన నిద్రలో వున్నారు.

వెనక్కితిరిగాము. నా బుర్ర వేడెక్కి పోయింది. ఇంత స్పష్టంగా చూశాక నమ్మకపోవడం మొండితనం అవుతుంది గాని ఏ తర్కానికి నిలువదు. అందుకే నేను పందెంలో ఓడిపోయానని అంగీకరించాను.

మర్నాడు నన్ను జగపతి సన్-ఎన్-సీ హోటలుకు తీసుకెళ్లి నూటపాతిక రూపాయలు ఖర్చుపెట్టించాడు. కేబరే నర్తకి హొయలు కురిపించింది. వగలు చూపింది. వయ్యారం అందించింది. మూడొంతులు నగ్నంగావున్న ఆమె శరీరం అచ్చు రాత్రి ముకుందంగారి గదిలో చూసిన యువతి శరీరంలా కనిపించింది.

* * *

ఆరునెలల తరువాత ఒకరోజు.

జగపతి దగ్గర్నుండి ఒక వుత్తరం. కవరులో వుత్తరానికి జతగా నూటపాతిక రూపాయలకు క్రాస్‌చేసిన చెక్కు—

"...క్రిందటిసారి నువ్వు వాల్తేరొచ్చినప్పుడు పందెంలో ఓడిపోయావని నూటపాతిక రూపాయలు ఖర్చుపెట్టించాను. గుర్తుందికదూ? అది పొరపాటని ఈ మధ్యనే తెలిసింది. నిజానికి ఓడిపోయింది నేను. కనుక పందెం ప్రకారం ఖర్చు భరించవలసింది నేను. అందుకే నీ డబ్బు నీకు వాపస్ చెయ్యడం నా ధర్మం. జతపరచిన ఈ చెక్కుని స్వీక

రించు.. " అంటూ అర్ధంతరంగా ముగించాడు

"వీడి సస్పెన్సు తగలడ. " అను కోబోతున్నాను. అంతలో పి. యస్. కనిపించింది.

"...వారం రోజుల్లో విజయవాడ వస్తున్నాము. మిగతా విషయాలు ముఖా ముఖి మాట్లాడుకుందాం. ఓపికపట్టు..."

"స్కౌండ్రల్..." అనుకున్నాను కసిగా.

మళ్లీ మరొకసారి నా బుర్ర గందర గోళానికి గురయింది. జగపతి... ముకుందంగారి పడకగది... దయ్యంలో ముకుందంగారి కాపురం... సన్ఎన్సీ హోటల్...కేబరేనృత్యం మిస్ సలీమా హొయలు... నూటపాతిక రూపాయలు ...జగపతి చెక్కు...

"అయితే ఆమె ఎవరు ? ముకుందం గారు జగపతి అనుకున్నంత శ్రీరామ చంద్రుడు కాదన్నమాట ? అయితే అందమైన ఆడవాళ్లను రప్పించుకునే రహస్యమైన ఏర్పాటు వుందన్నమాట ? పూలిష్ జగపతీ" అనుకున్నాను. కసిగా జగపతి రాకకోసం ఎదురుచూశాను. పదిరోజుల తరువాత జగపతి వూడి పడ్డాడు. వస్తూనే "ఏంవాయ్ ? వెంక టేశం?" అన్నాడు గిరీశంలా నా పేరు వెంకటేశంకాదు

'నువ్వావిషయం చెప్పండే ఈ ఇంట్లో మంచినీళ్లుకూడా పుట్టవు.." అన్నాను

"ఉరే ! నువ్వు విశాఖపట్నం వస్తే ఇలానే మర్యాదచేశానుట్రా ?"

"ముందా దయ్యంసంగతి చెప్పు."

"ఓస్ ! అదా ?..." అంటూ నాన్చి వెయ్యడానికి చూశాడు.

"ఆ వేషాలు నాదగ్గర కుదరవు. కానియ్..."

"ఇక్కడ చెప్పే విషయంకాదురా. ఇంట్లో అమ్మాయుంది ?"

"నీకాభయం అఖ్ఖర్లేదు ఈ ఇంట్లో ప్రస్తుతం ఆడపురుగులేదు."

"అయితే తప్పదన్నమాట. ముందు కాస్త కాఫీ అయినా తగలబెడతావా?"

ఫ్లాస్కులోవున్న కాఫీ కప్పులోపోసి యిచ్చాను. జగపతి చిన్న పోజుపెట్టి ఇలా అన్నాడు.

"ఈ మధ్య ప్రభుత్వానికి గుప్తధనం వెర్రొకటి పట్టుకుందిగా? అందులో ఒక భాగంగా ఒకరోజు సి బి. ఐ. వాళ్ళు ముకుందంగారి ఇంటిమీద మెరుపుదాడి జరిపారు.

దయ్యానికీ, సి బి.ఐ. వాళ్ళ మెరుపు దాడికీ ఏమిటి సంబంధమో నా కర్థం కాలేదు. వాడివంక కోపంగా చూశాను. వాడు గమనించలేదు.

"..వాళ్ళకు కావలసింది గుప్తధనం. నాకు తెలియని గుప్తధనం ముకుందం గారి దగ్గరెక్కడుంది? అందుకే మేము

త్వరగా పెళ్లి చేసుకోక పోతే నష్టమేమిటి?

రోజు రోజుకీ దేశ పరిస్థితులు దిగజారుతున్నాయి! తర్వాత నువ్వే విచారిస్తావ్!!

పెద్దగాపట్టించుకోలేదు. సి బి ఐ వాళ్లతో ముకుందంగారు ఎగ్జంప్లరీగా సహకరించారు.

"చూడు జగపతీ? వీళ్ళకు కావలసిన రికార్డులన్నీ ఇచ్చెయ్యి అని నాకు బ్లాంక్ చెక్ ఇచ్చివేశారు.

"రికార్డులన్నీ వాళ్ళముందు పడేశాను. ఒక్కపైసాకూడా వ్యత్యాస కనిపించలేదు? అసలు వుంటేగా?

"ముకుందంగారూ? పైకి వెడదాం పదండి" అన్నారు ఆఫీసర్లు

"ఎందుకూ?" అన్నాడు ముకుందంగారు.

"అక్కడ కూడా సెర్చ్‌చెయ్యాలి?"

"నా ఆఫీసు ఇదేనండి! పైన నా రెసిడెన్సు" అన్నారు ముకుందంగారు అమాయకంగా.

"మా డ్యూటీ మమ్మల్ని చెయ్యనివ్వండి ప్లీజ్!"

"అని ముకుందంగారి జవాబుకు ఎదురుచూడకుండానే వాళ్ళు మెట్లువైపు నడిచారు. నేనూ ముకుందంగారు వెంబడించాం. ఇక్కడ కూడా ముకుందంగారు వాళ్ళతో సహకరించారు. బీరువా తరువాత బీరువా తాళంతీసి చూపెట్టారు. ఆఖరుకు బెడ్‌రూంలో అడుగుపెట్టాం...

"ముకుందంగారూ! ఆ బీరువాలు కూడా తెరిపించండి" అన్నాడొక ఆఫీసరు మర్యాదగా.

"క్షమించండి. వీటి తాళాలు కనిపించడం లేదు" అని నా వంకచూశారు.

"అయితే బీరువాలు పగలగొట్టాల్సొస్తుంది" హెచ్చరించారు.

"మీ యిష్టం"

సి. బి. ఐ. ఆఫీసర్లు గేస్‌కట్టర్ కోసం పురమాయించారు. కొంత వ్యవధి వుంది గనుక అంతా సోఫాల్లో కూర్చున్నారు. అప్పటి వరకూ కేర్‌ఫ్రీగా, హుందాగా వున్న ముకుందంగారి ముఖంలో మార్పు రావడం గమనించాను కొంపతీసి నాకు

తెలియని గుప్తధనం ఏమీ లేదుగదా అని పించింది. వెంటనే నా అనుమానం నాకే అగౌరవం అనిపించింది. ముకుందంగారు నన్ను పక్కగదిలోకి పిలిచారు. ముఖం చెమటతో తడిసిపోయివుంది. ఆందోళన వ్యక్తమవుతోంది.

"ఆ బీరువాలు పగలగొట్టకుండా చూడు. ఎంత ఖర్చయినా సరే.

"ఏమిటిసార్, వాటిల్లో ఏముంది?"

"నా పరువంతావుంది జగపతీ! వెళ్ళు! ఏదో ఒకటి చెయ్యి!...వ్యవధిలేదు..."

నేను వెళ్ళి వాళ్లతో సంప్రదించాను. ఈ సోదాని అంతటితో ఆపమని ప్రాధేయపడ్డాను. ఖరీదు ఎంతయినా చెల్లించడానికి సిద్ధం అని వాళ్ళకు చెప్పాను. లక్షల్లో లంచం ఇవ్వడానికి సిద్ధపడ్డాను. కాని నేనుచేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఆ విషయం ముకుందం గారికి చెప్పాను. ముకుందంగారి ముఖం పాలిపోయింది. ఉరి తీయబడటానికి సిద్ధంగావున్నదా ముఖం...ఖూనీ తప్ప దని తెలుసుకున్నపుడు పడే ఆవేదన... సముద్రంలో మునిగిపోతున్నవాడి ఆరా టం...... ఆ ముఖంతో కనిపించాయి.

"అంతేనా? సరే..." అన్నారు మెల్లగా. జీవంలేనిగొంతు. ఇంతలో గేస్ కట్టింగ్‌పరికరా లొచ్చినవి. ఒక అధి కారి ఒక ఇనుప బీరువావైపు చూపె ట్టాడు. మిరుమిట్లు గొలుపుతూ గేస్ కటింగ్ మొదలయింది.

క్రింద నుండి పైకి లోహాన్ని చీరే స్తోంది. ఒక రెక్కతెగి దబ్బున క్రింద పడింది. గేస్ కటింగ్ మేస్త్రీ కెవ్వున కేకపెట్టి వెల్లికిలా పడ్డాడు.

దయ్యం...కాదు మనిషి...కాదు స్త్రీ ...కాదుకాదు...నిలువెత్తుని రబ్బరుస్త్రీ.

అక్కడ వున్నవాళ్లమంతా అదిరిపడి చూశారు.

చర్మంరంగు లేటెక్స్ రబ్బరుతో మెత్తటి ఇమిటేషన్ స్త్రీ. సర్వాంగసుంద రంగా వుంది. కులాసాగా గడుపుదామని ఆహ్వానిస్తున్నట్టుగా వొయ్యారాలు వొలక బోస్తోంది. బాతింగ్ అండర్‌వేర్ మినహా నగ్నంగావుంది.

"ఢాం... ఢాం..." ప్రక్కగదిలో ప్రేలుడు.

అంతా అటువైపు పరుగెత్తాము. లోపల గడియవేసివుంది. తలుపు బద్దలు చేసి లోనికి ప్రవేశించాము

ముకుందంగారు రక్తం మడుగులో చచ్చిపడి వున్నారు. పిస్తోలు పక్కనే పడివుంది. మెదడు చిందరవందరగా చెదిరిపోయి భయంకరంగా వుంది.

సి. బి. ఐ అధికార్లు సోదా పూర్తి చేశారు. మిగతా బీరువాల్లో కనిపించిన మరికొన్ని ఆసక్తికరమైన వస్తువుల జాబితా తయారుచేశారు.

1. ఒక ఎనిమిది మిల్లీమీటర్ల ప్రొజె క్టర్...

2. ఆరు బ్లూ (బూతు)ఫిల్ములు

3. నాలుగు కృత్రిమంగా కోరికతీర్చు కునే సెక్సు గాడ్జెట్‌లు

వీటన్నింటిమీదా డెన్మార్క్ ముద్రలు.

---

8

## టాంగాలుగా మారిన విమానాలు

"వరీ !... వరీశ్వరీ..."

"మళ్లా ఏదో గోల ?!..."

"మరేంలే ! నాకో మిత్రుడు న్నాడులే. అతను ఇలాగే, భార్యను 'నూకరాజరాజేశ్వరీ !' 'నూకేశ్వరీ !' అని పిల్చుకొనేవాడు ; అది జ్ఞాపకం వచ్చి అలా పిల్చానులే !...; ఆ మిత్రుడు ఈ ఊరి అల్లుడే, బొమ్మలు వేస్తాడు. పేరులో ఏముంది పెన్నిధి ? అంటారుగాని, అతడు మాత్రం పేరు లోనూ ఉంద పెన్నిధి అన్నట్లుగా అతడు వేసిన చిత్రాలకు అద్భుతమైన పేర్లు తగిలించేవాడు. అవి చూసినవాళ్లు పేరు లోనే ఉంది పెన్నిధి అనేవారు.

సరిగ్గా నాలాంటి సమస్యే అతనిదీను, కథలు రాయడం, అల్లడం చేతవునట గాని రాసే ఓపికుండేదిగాదు. అతని భార్యకు చదువురాదు. పేరు నూకమ్మ- నూకాలమ్మో... అతనే అంటుండే వాడు, నేన్చెప్పితే రాసేవాళ్లుంటే బాగుండును. నాభార్య చదుపుకొన్న దైనా బాగుండిపోను. రాయడం వచ్చిన భార్య దొరకడం అదృష్టమే, చెప్తుంటే రాసే భార్యను నువ్వైనా సంపాదించ వోయ్ సాగరం ! అని అది యిప్పుడ జ్ఞాపకం వచ్చేసింది !

అతడొక కథ-స్వంత కల్పనతో ఏదో చదివిలాక్కున్నదీకాంది-రాసి వి పిస్తే ఎలా ఉంటుందో అని సరదాప ఆవిడకి వినిపించాడట ఆ కథ కూడ అతి కొత్తపోకడతో అపూర్వంగాన వచ్చిందిట, ఆవిడ అంతా ఓపిగ్గాను మాటాడకుండా విన్నమీదట, ఎలా ఉంది. అన్నాట్ట. దాని కావిడ "అబ్బే సినిమాలో ఇలాగ లేదండీ, మరోలాగ ఉంది. పోలికేలేదు !" అనేసిందట. "అయ్యో ఇది సినిమా కథకాదు, కొత్త తరహాగా ఊహించిరాసింది !" అన్నాట్ట. "ఏమో మరి, సినిమా చూసొచ్చి రాశా రేమో అనుకున్నా" అనేసి ఊరు కుందట.

అతడి ఆ కథ ఒకరికి నచ్చింది ; సినిమా మనిషికే. కొన్ని కొన్ని మెరు గులు, చిన్నచిన్న మార్పులు చెప్పి మళ్లీ రాయించాడు. కథ సొమ్ము చేసుకుందిట గూడ. కొన్నాళ్ల తర్వాత ఆ కథ సినిమా తియ్యడం జరిగిందట. రేపో నేడో విడుదలవుతుందనగా కొద్దిమందిని పిలిచి చూపించారు. ఊర్నించి అత్త గారు వచ్చి ఉంది. ఆవిడను కూడా కలుపుకొని మన కథకుడు సకుటుంబంగా

వెళ్లాడు. అంతా చూసేక తిరిగొస్తు న్నప్పుడు, "ఎలా ఉందత్తయ్యా ?" అని అడిగాడుట.

"బాబూ ! ఈ సినిమా ఇదివరకే శాన్నాళ్ల కిందటే మా ఊళ్లో మరిడమ్మ ఆల్లో నేను చూసిందే !" అందామె.

"అదికాదత్తా ! ఇది సరికొత్తది. ఇంకా ఊళ్లమీద వొదల్లేదు. నువ్వెలాగ చూశానంటున్నావో మరి ?" అన్నాడు.

"ఏఁవోగాని, యిదే సినిమా చూశా నంటే నమ్ము" అని ఊరుకుందటాండ పాపం." అంటూ సాగరం చెప్పడం ఆగాడు.

"అట, ట, ట ! ఇదంతా ఎందు కొచ్చిన సోదె ?" అంది గోదావరి.

"సోదెవింటే గాదె ఎక్కడికీ పోదని భరోసా ఉందిగా !......గోదా !..."

"అబ్బబ్బ. గోదా ఏఁవిటి మళ్లా ?! గోదాం లాగ-"

"ఔను. 'గోదా' అంటే ఏదో పేరు కాదు. 'గోదాదేవి,' ఆవిడే 'ఆముక్త మాల్యద.' తెలుగు సరస్వతి పెద్ద గోదాం లాంటిది ఆముక్తమాల్యద కావ్యం ! కొప్పులో తురుముకొని మరీ ఆ పువ్వులు దండకట్టి పంపేదిట. నూనె జిడ్డు వాసనతో కలిసి ఆ పువ్వుల పరి మళం మరీ యింపతంగా ఉండేది కాబోలు ఆ రంగడికి, లేక ఆ కొప్పు మెతక వాసనకే అంత మురిశాడో మరి! తెలుగు చదవాలన్నావు, తెల్సిందా గోదాదేవి ?!" అంటూ చూశాడు సాగరం.

"ఔను, ఆ ప్రబంధంలో మాలదాసరి కథ గోదాములో రత్నపేటికంటారు, బ్రహ్మరాక్షసుడు-ఆ మహాభక్తుడు..."

"ఆఁ ! భక్తుడంటే కథ వచ్చింది... చెప్తున్నాను..." అంటూ సాగరం మొదలుపెట్టాడు.....

'ఈ గ్రామంలో శంకరప్ప అనే మహాభక్తుడున్నాడు. తనెంతటి భక్తుడో తనకే తెలియని నిరాడంబర భక్తుడు. వెయ్యేసి కిలోల జంతికలాది సామగ్రి మేదరపెట్టికప్పులో బిగించి నెత్తినెత్తుకొని రమారమి ఇరవైయ్యేసి మైళ్లదూరం సంతలకు గట్లూ గెడ్డలూ దాటుకుంటూ కాలినడకను వెళ్లి అమ్ముకు రావడం అతని జీవయాత్ర.

ఓనాడు కాళ్లు నొప్పులు పెడు తూంటే ఉస్సురసుకుంటూ, ఎదురుగా ఉన్న పటం కట్టించిన సన్ బీడీ కేలండరు కృష్ణపరమాత్మను అలవాటుగా పడుకోబోయేముందు తల్చుకుంటూ, "కృష్ణ ! క్రిష్ణ ! ఓ విమానం అయినా యిచ్చావుకాదు కృష్ణా !" అనుకున్నాడు. బస్సు లెళ్లవు, రిక్షాలు నడవ్వు, చెప్పులు కూడా తీస్తుం డాలి, బురదదార్లు మరి......ఒక్క సారి గది అంతా జిగేల్మంది ! కృష్ణ పరమాత్మ నీలంకాంతితో కనిపించాడు !

"ఇప్పటికే చాలా ఆలస్యం చేశానని



నేనూ అనుకుంటున్నానోయ్ శంకర రప్పా! తెల్లారేసరికి విమానం ఉంటుంది. సామాన్తో యెక్కికూసో, అంతే..." అని లేతగులాబీ రంగు అరచేత మధ్య పెద్ద ఎర్రటి బింబంచుట్టూరా చుక్కలూ ఉన్న అభయహస్తంతో దీవించి అంతర్ధానమయ్యాడు.

"పరమాత్మా, భగత వచ్చులా! హరే క్రుష్ణ, కృష్ణ క్రిష్ణ హరే!" అంటూ శంకరప్ప తనివితీరా కళ్లు మూసి ధ్యానిస్తూన్నంతలో కోడికూత వినిపించి అవతలికెళ్లేసరికి పెరటి గుమ్మంముందు గుమ్మటంలాంటి విమానం ఉంది!

పెట్టికప్పుతో సామానంతా జేరే సెక్కి కూర్చోవడమేంటి, విమానం జివ్వుమని అంతరిక్షం కెగిసి రైయిన సోంవారం సంతలో నిటారుగా దిగుతూం డటం రెప్పపాటులో జరిగినట్లు జరిగింది.

"తుకారాం !- తుకారాం యిమానం!. ఆ యిమానంగావ రోసేయ్, దీనికి రెక్కల్లేవు, బోడమానం, అరెరెరె! శంకరప్ప! మన శంకరప్పే!" అంటూ సంతకప్పుడపుడే వస్తున్న జనం విరుచుకు పడ్డారు.

క్షణాలమీద అగ్నిపర్వతం పేల్నట్లుగా గుప్పుమని, అంచీలంచీలమీద వార్త రాజధానికి జేరుకుంది. పటాలం, పెద్దధికార్లూ దిగబడ్డారు. ఆ రోజు సంత మరిలేదు. "యెదవనాయాల సంత సెడిపీనాడు." అంటూ తిట్టుకున్నారు జనం, ముఖ్యంగా ఆసీలు వొసూల్జేసే గుత్తగాడు.

"ఇలాంటి పన్చెయ్యడానికి నీ కెన్ని గుండెలు? ముందు దీని సంగతేంటో దేలాలి, పద, మమ్మల్నెక్కించుకొని పద రాజధానికి!" అన్నారు పెద్దధికార్లు. అదేం పుష్పక విమానం కాదు పట్టినంత మందితో రాజధానిలో దిగింది. అంతా తేలేవరకూ శంకరప్పను కొట్లో తోశారు. "ఎందుకయ్యా ఉంచీనారూ బందీకానలో...; ఇచ్వాకుకులచిలకా!" మొదలైన పాటలన్నీ పాడుకున్నాడు శంకరప్ప.

* * *

రెక్కలూలేవు, గిరున మీద తిరిగేది లేదు, నాలుగు రాటలమీద గూడా గుమ్మటంలాగ చూడ్డానికి ముచ్చటగానే ఉందిగాని దాని అంతు పట్టలేదు. పెద్ద సైంటిస్టులూ ఇంజినీర్లూ ఇది చేసి అది చేసి చివరకి చిత్రవధచేసి పరీక్షించి ఇది శాస్త్రానికి లొంగేదేం కాదనే తేల్చేసూరుకున్నారు.

పెద్ద సభలో చర్చజరిగింది. "భక్తీ, మహాత్మ్యాలూ, అవీ, మనకు పడదు. ఇలాంటివన్నీ పనికిరావు" అన్నారు పాలకవర్గం వాళ్లు.

"అలా అనడం రాజకీయం గాదు, లౌక్యంగా పని సాధించాలి! ప్రజల కోసం, వాళ్ల అవుసరాలు తీర్చడం కోసం మనం ఏంజేసినా చేయాల్సిందే. పెట్రోలక్కరలేదు ఏరోడ్రోమక్కర్లేదు సరాసరి రాజసభ నడిబొడ్లో దిగొచ్చు. ఏడాబామీదేనా కీలుగుర్రాంలా దిగొచ్చు. ఎక్కడే కరువొచ్చినా, ఆకలి చావులొచ్చినా వరదలొచ్చినా, తుపాన్లు తుడిచేసినా తాపీగా క్షణాలమీదెళ్లి రావచ్చు. నిమషాలమీద పై రాజ్యాల నుంచి సరుకుల్లాక్కురావొచ్చు, టపీమని జల్లి చల్లార్చొచ్చు. ఇలాంటివన్నీ వొదులుకోవడం రాజకీయం కానేగాదు. అంచేత నయానో భయానో అతగాడి చేతే కనీసం ఒకో ముఖ్యమంత్రికి ఒకటి చొప్పునైనా ఓవంద యిలాంటి విమానాలు సంపాదించడం తక్షణ



కర్తవ్యం!'' అంటూ గట్టిగా తగిలారు రెండోవర్గంవాళ్లు.

"భయపెట్టడం గియపెట్టడం పనికి రాదు! యిది ప్రజారాజ్యం!" అంటూ లేచారు మనుషుల పార్టీవాళ్లు.

"ఆస్తి, తెలివితేటల్లాగే ఇలాంటి శక్తి మహిమలూ ఒక్కడో ఉంచుకోవడ ప్రజాద్రోహం అన్నీ పంచి పెట్టాలి! లేకపోతే నరికిపారేస్తాం!" అంటూలేచారు వీరవర్గంవాళ్లు.

మొత్తంమీద విమానాలు ఎలాగో సంపాదించాలన్న తీర్మానం నెగ్గింది. రాజుగారు రాజర్షి జనకమహారాజు లాంటివాడు, 'జనమహారాజు.' రాణీ గారిదే తుదినిర్ణయం. రాణీగారు ముఖం

వికసింపించారు. రాజుగారి ఆమోద ముద్ర పడింది.

కొట్లో ఉన్న శంకరప్పకు సంగతంతా జెప్పేక, "బాబులూ! నా పటం కాడికె త్తేగాని నేనేం జేయలే" న్నాడు. అలాగే సాధించుకురావోయ్ అంటూ పకడ్బంధీగా పంపించారు.

*       *       *

"కృష్ణా! ఎంత అవస్త తెచ్చిపెట్టే వయ్యా!'' అంటూ శంకరప్ప విలవిల్లాడేసరికి, "నాయనా! శంకరప్పా!'' అంటూ పటం మాట్లాడింది —

"మరేం బెంగపడకు!, ఒక త్తె కోసం వెన్నో కోకలిచ్చాను. జనార్దనుడన్న పేరు తగిలించుకొన్నవాడిని యింతమంది జనంకోసం ఒక్క వంద యివ్వడం నాకుమాత్రం యిష్టంలేదనుకున్నావా? ఎంతమాట! ఇప్పుడు పాలిస్తున్న జనతంత్ర రాజరికం తక్కువ రకందేంగాదు. మహా మహులు తపస్సుల్జేసీ, రక్తహోమాల్జేసీ సాధించిన రాజ్యం. పురాణాల్లో రాయించుకున్నానే గాని, నా రామావతారంలో గూడ యిలాంటి రాజ్యం చూళ్లేదు. పాలిస్తున్న రాజు 'జనరాజు.' రాజును పాలిస్తున్న రాణి 'జనరంజని'. ఆ రాణిని పాలిస్తున్నది జనం. ఆ జనాన్ని పాలిస్తున్నది జనరాజు. ఆ జనరాజుని పాలిస్తున్నది రాణి......ఇలాంటి రాజ్యం నభూతో నభవిష్యతి......ఒకటి మాత్రం వాళ్లకి జెప్పు! జనంకోసం, వాళ్ల అవసరాలు తీర్చడంకోసం వంద విమానాలూ బంగార్లా పన్జేస్తాయి దేవుణ్ణి నమ్మక్కర్లేదు, మంత్రాల్లేవు, మర్మాల్లేవు. ఎలా గనుకుంటే అలాగ ఎగురుతై. అయితే వాట్ని సొంతానికి వాడితే మట్టుగుపన్జెయ్యవు! ఆ బుద్ధే పనికిరాదు. వాళ్ల సర్దాలకో, గొప్పలకో, చుట్టాలిళ్లకో, మధుర హృదయినుల నాల్గో అంతస్తు డాబాతోటమీదకో ...యింకా యింకా యిలాంటి పన్లుజేసేవాళ్లు ఈ జనమహాయుగంలో ఉంటారని కల్లోగూడ నమ్మను. అలా ఉంటారని ఎవరైనా అనుకుంటూ ఉంటే వాళ్లు రౌరవాది నరకాలు పొందుతారని శపిస్తున్నాను కూడా! - అయినా ఎందుకైనా మంచిది. నే జెప్పిందంతా జెప్పు! చెప్పిన మర్నాడుదయం జూసుకోమను, మరెళ్లు రాజధానికి...,'' పటంలోంచి మాటలు ఆగిపోయినై.

*       *       *

శంకరప్ప చెప్పిందంతా విన్నారు. ఒహరి మొహాలొకరు చూసుకున్నారు. అప్పటికప్పుడే ప్రత్యేక సమావేశం జరిగింది. కట్టుదిట్టంగా జరిగింది. గుట్టుమట్లు పరమాణు వంతైనా పొక్కకుండా. ఏం జరిగిందో మరి?...

"ఓయ్ భక్తుడూ! మానవశక్తిమీదే అన్నీ సాధించాలనుకుంటున్నాం గాని, యిలాంటి గారిడీ విమానాలు మాకు



అక్కర్లేదు. ఆ వందా ఒక్కటికూడ అక్కర్లేదని మీ పరమాత్ముడికే వెంటనే కబురుచెయ్యి!" అన్నారు.

పటంకాడి కెళ్లే వ్యవధిలేదు శంకరప్ప కొట్లోనుండే చెప్పుకున్నాడు మొర. ఈసారి కృష్ణపరమాత్మ విని పించుకోలేదు. తెల్లారేసరికల్లా రాజ భవనంముందు వరసాగ్గా వంద విమానాలూ ఉన్నాయి రోడ్డుపొడవునా.

* * *

వాటి నేంచెయ్యడం? అని చర్చించుకున్నాక, పత్రికల్లో పెద్దక్షరాల్తో- "ప్రభుత్వ భూరిసహాయం! వంద టాంగా బాడీలు! – చక్రాలు గుర్రాలు ఉండి

గూడు బండి లేని బీద టాంగావాలాలకు సరఫరా చేయబడనున్నవి !" - అనే ప్రకటన వెలువడింది, ముఖ్యవార్తకూడా అదే

కొద్దిరోజులకి రాజధానిలో సరికొత్త రకం టాంగాలు - గుమ్మటానికి చక్రాలు అమర్చిన వాటిలాంటివి - పాత చక్రాల్తో బక్కగుర్రా లీడుస్తూంటే, సాదా నడక మనుషులు "అలాంటి అపురూపమైన టాంగాలెక్కితే విమానాలు ఎక్కినంత !" అని అనుకుంటూ నడిచారు.

* * *

"శంకరప్పా ! భక్తి ఉంటే ఇంట్లో భజన చేసుకోగాని ఇలాంటివి కోరకు ! చిన్నరకం కార్లు నీలాంటి వాళ్ళందరి కోసం తయారుజేయింపిస్తున్నాం, ఒకటి కొనుక్కో !" అని హితబోధ చేసి కొట్లోంచి బయటకు నడవమన్నారు. "హమ్మయ్య !" - అనుకుంటూ శంకరప్ప నిద్దట్లో కలవరిస్తూంటే, రాధమ్మ మొగుణ్ణి లేవగొట్టుతూ" తెల్లారెళ్ళాలన్నావు సంతకి, పొద్దెక్కింది లే..." అంది. శంకరప్ప కళ్ళు నులుముకుంటూ లేచి ఎదురుగా ఉన్న పటానికి చేతులు జోడించి, "అబ్బ ! ఎంత గమ్మత్తైన కల గనిపించావు కృష్ణా !" అంటూ పెట్టికప్పు నెత్తినెక్కించుకుని, "జై కృష్ణా ! మన కిదీ యిమానం !" అనుకుంటూ నడిచాడు సోంవారం (తాళ్ళ పాలెం సంతకి- ఇదీ విమానాలు టాంగాలుగా మారిన కథ-కలకథ గోదాదేవీ !" అంటూ సాగరం ముగించాడు.

## 9

గోదావరి రాసిన కథలు చాలా ఉన్నాయి. వాట్లో నాలుగైదు చాలా పెద్దవీ ఉన్నాయి. అవి అచ్చుకెళ్ళి పాఠకులు చదివేకాలమూ ఉంది. అన్నీ సాగరం ఎలా చెబితే అలా రాసినవే వాటిని సాగరం చూస్తూన్నాడు.

గోదావరి పామునుచూసి పరుగెత్తినట్లు లోపలి కొచ్చింది. సాగరం తలెత్తి చూశాడు

"మా మేనమామ వస్తున్నాడు !"

"పేరేమిటి ?'

''శ్రీకంఠం."

"సరే నువ్వు లోపలికెళ్ళు....'' అని సాగరం అవతలి కొచ్చాడు. శ్రీకంఠం దగ్గిరికొస్తున్నాడు.

"నమస్కారం శ్రీకంఠంగారూ ! ఇలాగ దయచేశారేమిటి ?" అంటూ సాగరం తయారుగా ఉన్నాడు.

"ఈ గ్రామంలో ఎవడో ఊరూ పేరూ అడక్కుండానే అనాధ కనబడితే చాలు, గుళ్ళోపెళ్ళాడుతూన్నాట్ట ఆ అపర వేణుగోపాలుడి సంగతేమిటో తేలుద్దామని రావల్సొచ్చింది !'

"అలాగా ! అయితే నే ననుకున్న శ్రీకంఠంగారు కారన్నమాట ఏదుక్కో, శిశుపాలుడో మీ పేరై ఉంటుంది...''



"ఇలాంటి నాటు చదువులు చాలించవోయ్ పల్లెకారు పిల్లకాకీ!" అంటూ శ్రీకంఠం గట్టిగా అరిచాడు.

నీళ్లకు పోతున్నవాళ్లూ తెస్తున్నవాళ్లూ ఆడవాళ్లూ, బళ్లవాళ్లు అప్పటికే కొంతమంది పోగయ్యారు. శ్రీకంఠం వాళ్ల నోసారి చూసి, అహీసను గొంతు ఎరువు తెచ్చుకుంటూ, "మర్యాదగా అడుగుతున్నాను మీ పల్లెటూరు వాళ్ల లాగ యిష్టం వొచ్చినట్లు వాగడం మాకు చేతగాదు, ఆ అమ్మాయిని పంపించు! అదెక్కడా కనిపించదేం?!"

"ఏయ్ శ్రీకంఠం! అదీగిదీ అంటే అన్నావుగాని, ఆవిడ మేనమామ

వై పోయావు గనక మంచిగా చెబుతున్నాను. ఇంకనువ్వు వెళ్లొచ్చు—''

"వెళ్తాను వెళ్తా, దానిసంగతీ నీసంగతి తేల్చిపారేసి మరీ-ఇలాంటి గోచిపాత ఊళ్లో గనక సరిపోయింది, సిగ్గూ లజ్జా ఒదిలేసి తిరిగినదానికి లేకపోతే, నీకైనా బుద్ధీ జ్ఞానం ఉండక్కర్లా ?..."

అప్పటికే అంతా అర్థమై ఎవడో వచ్చి పట్నం డాబుసరి చూపిస్తుంటే వింటున్న ఆడవాళ్లు ఉండబట్టలేక పోయారు. వాళ్ల చేతులకు రెండు వీశల బరువున్న వెండికడియాలు ములుకుల్లాటి బొడిపెలతో ఎండలో మెరుస్తున్నాయి.

"ఓ( పట్నంబాబూ! నోరు మంచిదైతే ఊరు మంచిదౌద్దని తెల్దా నీకు ?, అలా గూరికే యెరిగిపడతన్నావు, ఆ బాబు సేసింతప్పేంటో సెలవిప్పిచ్చు మరి .." అంటూ కాకుల్లాగ అరిచారు. శ్రీకంఠం వాళ్లనో అసహ్యించుకున్న చూపు చూసి, "మీకు నేన్చెప్పేదేవిఁటి, చదువూ సాంప్రదాయం లేని ఓత్తిగొడ్ల మంద లాంటి ఆడపుట్టి ! మీకేం తెలుస్తుంది, మంచీబెడ్డా, ఆచారం, మతం, ధర్మం, 'లా' అవీను. పాపం పాడిగేదెల్లాంటి జీవాలు...'' అంటున్నాడు.

''ఔన్లే పట్టంబాబూ ! మాకు సదువూ గిదువూ నేదు. పసూవులం. ఆడోళ్లం, నిజఁవే !...,"—,

''అయితే మట్టుకు, ఆళ్లు చేసిన తప్పేంటి ? అడగతన్నాం!...",-

"ఆ బాబు ఆ అమ్మి బంగార్లాగ ఆ పరవాఁత్తుడి గుడిలో లచ్చనంగా చేసుకున్నారు గద !! ."—,

"ఇతగాడు అమ్మినేం యెత్తుకు రానేదు, శానారోజులాయి సూత్తూనే ఉన్నాం. ఆ అమ్మాయి ఎలాంటి బుద్ధిమంతురాలో ! ఇద్దరూ సమ్మతం అయ్యే చేసుకున్నారు-".

"ఇంత యిప్పుడున్నవ్వొచ్చి సాంపదీ కాలూ, ఆశారాలూ, కులం గిలం యిలాంటివన్నీ యీ రోజుల్లో సెప్పడానికొస్తే నువ్వేం పట్నపోడివి ?-".

"ఏ అడివిలోనో కూకోవల్సినోడివి, అంటూ తలాఒక్కొమాట కలిపి అంటున్నారు. ఒక మనిషి మోచెయ్యి ఎత్తి, "ఓయ్ పట్టం బావూ ! గొడ్లూ గోదలూ అన్నావంటే చూసుకో మరి మా ఆడోళ్ల తడాక !" అంటూ ముళ్ల కడియాలు ఆడించి చూపింది. మిగతా వాళ్లూ వెండి మురుగుకు ఒరువు తెలిసేలా మోచేతులు పైకెత్తారు. ములుకుల్లో నిగనిగ మెరుస్తున్నాయి, ఉక్కుటోపీ అవసరం అనిపించింది శ్రీకంఠానికి.

''మీ ఊరుకదా అని ఎందుకలా విర్రవీగుతారు, చూస్తే ఆడంగలు, మంద లాళ్లలాగ అరుస్తూ..." అంటూంటే.

అంతవరకూ అంతా చూస్తూ నిలబడ్డ బళ్లవాళ్లు కొరడా కర్రలూపుకుంటూ



ముందుకొచ్చి ఆడాళ్లను తగ్గమన్నట్లు చూసి, పాగాలు తీసి దులిపి భుజాల మీదేసుకున్నారు. ఆడవాళ్లు వెనక్కు తగ్గారు.

"దొరబాబూ! ఆడంగుల్తో ఏటి పోనిద్దురూ, మీలాంటోళ్లు రాడమే మాదానం, మాటాడ్డవే మా బాగ్యం, ఇంతకు ఆ పెసిన్నే మేవూ అడుగుతున్నాం!" అన్నారు వాళ్లు. శ్రీకంఠ సీళ్లు నముకలం ప్రారంభించాడు. అప్పుడే పెద్దకొట్టు పాపరాజు ఆలయంనుంచి వస్తున్నాడు.

"ఏంటబ్బాయి, వాకిట్లోనేదో షేచీ పడుతున్నావు?" అంటూ సాగరాన్నుద్దేశించి అన్నాడు. శ్రీకంఠం పాపరాజుని చూసి, మరొకరికి తడువివ్వకుండా "చూడండీ! మంచీ చెడ్డా తెల్సినోరు, నేను ఏదో అలాంటి లాంటివాణ్ణిగాదు, పదేళ్లాయి కమర్షియల్ టాక్సు ఆఫీసులో పన్జేస్తూ ఇంతో అంతో ఓహో అనిపించుకుంటున్నవాడ్ని, లోకానుభవం, మంచీ-చెడ్డా, మన సంఘం-ధర్మం, న్యాయం తెలిసీ చెబుతూంటే వీళ్లు..."

"అఁ! తమరు టే క్సాఫీసులో ఉన్నారాసార్ ?!" అంటున్నాడు పాపరాజు కాలికేదో రాయి తగిలినట్టు. శ్రీకంఠం అందుకున్నాడు. "తల్లిపోతే, పోనీ గదా అని దబ్బు ముఖం చూడకుండా, రాకుమార్తెలాగ పెంచాను, దేనికి? ఆ మాత్రం కృతజ్ఞత ఉండక పోతూందా అనేగద! అలాంటిది ఇతగాడెవడో ఏదో చేస్తే తగుదునంటూ గుళ్లో పెళ్లాడేయడమేనా అంట? మంచీ-చెడ్డా, చిన్నా పెద్దా, మాట-మర్యాద, మన సాంప్రదాయాలు, కులాలు, ధర్మాలు, పెద్దలు అంటూ ఉండఖర్లా? ఏఁవంటారు?''

పాపరాజు బెల్లం దిమ్మలాగ తలాడిస్తూ, "ఔనౌను! అదీ ఒకమాటే- పెళ్లంటే ఐదునిముషాల తమాషాకాదు. పెద్ద బుర్ర లేకపోతే ఎద్దు బుర్ర అన్నారు. అలాంటిది పెద్దోళుండగా, మంచీ మాటా సాంపరదాయికాలు అన్నీ సూడాలి మరి. ఆ నీతుండాలి. అంతేగాని ఓ బుల్లిదీ ఓ బుల్లోడూ సినీమాల్లోలాగ ఏ గుళ్లోనో గూట్లోనో లాడ్జీలోనో చేసుకుంటే సరా? అదిగాదు మన యిధాయికం - మతంవూనూ..." అంటూ సాగదీస్తూన్నాడు

"నిజఁవే నిజఁవే! పాపరాజుగారందీ ఒకమాటే! నీతి-నిజాయితీ, పరువూ-మర్యాదా అంటూ పెట్టారు మన పెద్ద లేనాడో...", అంటూ వంతపాడింది వెంకట సుబ్బమ్మగారనే ఒకావిడ.

"ఏంటా నీతీ నిజాయితీ పరువూను? ఈ రోజుల్లో పునిస్త్రీలు కాని వాళ్ల కెందుకు సెప్పూ ఎర్రముక్కోణం మాత్తరలూ అవీను?" అంటూ రత్నంలాగ సింగారించుకొని చేతులూపుకొంటూ అప్పుడే వస్తున్న జాతిశీలం లాంటి సుశ్శీ అడిగింది. సుబ్బమ్మగారు ఆక్కడ నిలబడలేదు మరి.

అంతవరకూ ఎక్కణ్ణించి వింటున్నదో, అవ్వ యివత లరుగుమీదకొచ్చి, "ఏంటంటున్నావ్ పాపరాజూ! గుడీ గూడూ యింకేదోనా?! నీ లాభాలు పెరగాలనీ, నీ ఎత్తులు పారాలనీ, నీ ఆలోచనలన్నీ దేముడితో ముడిపెట్టి మరింత బలపర్చుకోడానికే గదూ నీ ఉద్దేశంలో గుళ్లూగోపురాలు దేముళ్లూ ఉన్నాయంటావు-అందుకే గదూ గుడి కెళ్తావు? సంపద పెరుగుదలబట్టి నీ



భక్తి పెంచుకుంటావో, కనపరుస్తుంటావో, కుప్పలోంచి ఒక గింజ లంచం హుండీలో చెల్లిస్తుంటావు, అంతేగాని ఆ దేముడిమీదగాని, ఆ ఆలయంమీద గాని నీ కొంచెమైనా గౌరవం, అభిమానం ఉంటేగదూ? అసలవేంటో నీకు తెలిస్తేగదూ? అక్కడ చేసుకుంటే పెళ్లిగాదేం? నీ దుకాణంలో సామానంతా చెల్లాలి.'నీ మైకా బాకాలకి అద్దెగిరాకీ తగలాలి. అడ్డమైనవాటికీ తగలేసి రోజులికి రోజులు చేస్తేనేనా పెళ్లి?-ఇలాంటి నీలాంటివాళ్లవల్లే ఈ రోజుల్లో దేవుడన్నా గుళ్లన్నా చీదరించుకొంటున్నారు!..." అని అంటూంటే పాపరాజు మొఖం మాడ్చుకుని "అవ్వోయ్! సాల్సాలు, నోటికొచ్చినట్టు యెంతలేసి మాటలనేయడవేనా,

యింతో అంతో ఉందనీ, నాలుగు పొలా లున్నాయనీ ?...", అన్నాడు.

"ఉంటే ఉంటాయి మరి, ఈలాంటి వాళ్లందరూ కూడి అభం శుభం యెరగని యీ పిల్లల్ని ఏ రచ్చకీడ్చినా కాపుదల కింద ఉంచకపోతే వాళ్లగతేంగాను ? నువ్వే త్తి పొడిచావుగాని మావాడు యిప్పటికే మూడు పొలాలు దున్ను కోండ్రా అని వొదులుకున్నాడు !" అంది సోమ్మవ్వ.

పాపరాజు "బాబూ వస్త", అంటూ జారుకోబోతుంటే శ్రీకంఠం ఆత్రంగా "ఒక్కమాట వినేసిపోండి !. నేనేం గొప్ప సామంతుణ్ణి గాను. వచ్చే నాలు గింటితో వెళ్తి కనబడనీకండా సర్దుకు పోతూ నలుగుర్లో ఓహో అనిపించుకుంటు న్నానే గాని, మేనకోడలు, పెంచాను, చదివిపించాను, పాసవుతుందను కున్నాను, పెద్దకొడుకు లాగుంటుంది వేన్నీళ్లకి చన్నీళ్ల సహాయం అవుతుందను కున్నాను. పోనీలే అనుకుని మహారాణీలాగ పెంచాను, డబ్బు యిబ్బందిలో గూడా..." అంటూ సాగి స్తుంటే పాపరాజు" పెంచడం మాటలా యీ రోజుల్లో ?, డబ్బా ? బీదీలో యిసకా ? మరి, వస్తా, దయుంచండి.." అంటూ శ్రీకంఠాన్ని చూసుకుంటూ కదిలివెళ్లాడు.

బళ్లవాళ్లు సాగరం వేపుచూసి కళ్లు చికిలించి హుషారిచ్చారు. సాగరం శ్రీకం ఠంతో సాఫీగానే "అయ్యా ! మీకిక్క డేమీ లాభించదు. నాతో అంతే, కంఠంలో పెట్టుకున్న విషాన్నంతా అవతల కక్కేయండి, స్నేహితుడిలాగ వెళ్లండి లేకపోతే మీలాంటి గొప్ప వాళ్లు యిలాంటి గ్రామాల్లోని మర్యాదకు తట్టుకోలేరు !" అన్నాడు.

శ్రీకంఠం "సరెసరె చూద్దువుగాని తట్టుకుంటానో నువ్వే తట్టుకోవాలో... లాయర్లూ, కోర్టు, లా లేవనుకోకు. మూడు చెరువుల నీళ్లు తాగించనను కున్నావా ?" అంటూ సగం గొంతుతో అనుకుంటూ తోకముడిచి పలాయనం చిత్తగించుకున్నాడు. వెనకనించి ఆడాళ్లు మురుగుల మోచేతులెత్తి చూపిస్తూ "పట్నబ్బాబూ! మరిసిపోతావేటి ? బాగా గ్యేపకం ఉంచుకోయ్..." అంటున్నారు.

సోమ్మవ్వ సాగరాన్ని ఇంట్లోకి పిల్చి "అతగాడేదో లోభం కనబరు స్తున్నాడు పాపం ! ఎంతో కొంత ఇచ్చేస్తే కాదా ? ఆలోచించు !" అన్నది.

"ఆవునో గేదెనో కొన్నట్టుగా ఖరీదు గట్టి యిమ్మన్నావా ?! గొడ్డూ గోదా కాదు గోదావరి—మనిషి ! బానిసగా కొను క్కోడానికిది కాలమూకాదు. అలా గక్కరాలేదు," అన్నాడు సాగరం.

గోడకు అంటుకొని బెక్కుతూన్న గోదావరి గద్గదికంగా "నేను గేదెనో ఆవునో ఎందుకాక్కూడదు ! మీ బానిస ననిపించుకోడానికిక్కడ గర్వపడతాను.

యెంతో యిష్టంతో, ఏదో యిబ్బందిలో ఉన్నవాడల్లే ఉంది, అంత సులువుగా బయటపడేరకం కాదు, బుజ్జికి పాపం ఎలా ఉందో ? ఎలాగున్నాడో మరి..." అంది.

"నీకు ధరకట్టడం నాకు యిష్టం లేదు. అలాంటి అవసారాలేమైనా ఉంటే మంచిగా ఇంటికొస్తే, అడక్కుండానే నేనివ్వకుండా ఊరుకొంటానా ? పోనీ ధర కట్టిచ్చినా అంతటితో ఆగక పోతే..." అన్నాడు. ఎవరూ మాటాడ లేదు.

మళ్లీ సాగరమే, ''ఇటువంటివాళ్లు మన మధ్యనే చాలామంది ఉంటారు. వాళ్లని ఊరికే పోనివ్వరాదు, ఏంచేసినా తప్పులేదు !'' అన్నాడు.

"శిక్షించడానికి మనం ఎవరం ? అన్నీ 'వాడే' చేస్తాడు గాని...'' అంది అవ్వ.

"అమ్మమ్మా ! ఆ 'వాడే' మనిషి రూపంలోనే దుష్టశిక్షణ కూడా చేస్తాడని ఎందుకు అనుకోవు మరి ? ఏం ?... దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేయమని వాడే యీ మనుషులకి చెబుతుంటాడని, చేయిస్తాడని నమ్మకం నీకు నిజంగా లేదంటాను !"

"ఔన్రా అబ్బీ ! నిజం చెప్పావు ! చెప్పడమేగాని పూర్తి నమ్మకంలేదు మాలాంటి వాళ్లకి !" అంది అవ్వ లోపలికి పోతూ.

గోదావరి ఏడుస్తూన్నది, సాగరం "ఈ మాత్రందానికి తట్టుకోలేవా గో.. !" అన్నాడు

"నేనే విషముహూర్తంలో కడుపున పడ్డానో, నామూలంగా మీరు..., ఊబిలోకి యింకెంతమందిని యీడు స్తానో అని భయమేస్తూన్నది. నేనెందుకు పుట్టాను ?..." అంటూన్న గోదావరి కనుకొలకుల్లోని నీళ్లు ఒత్తుతూ, "అలా అనకు గో...! అన్నీ మర్చిపో, మర్చిపో లేవూ ? నాదగ్గిర... !''.

* * *

శ్రీకంఠం పరుగెడున్నట్లు నడు స్తూంటే, పెద్దకొట్టు పాపరాజు వెనక నించి అనుసరించుకుంటూ వచ్చి "తమరు టేక్సాఫీసు ఏ డివిజిన్లో ఉన్నారు బాబూ ? మా తాలూకు...", అంటూంటే శ్రీకంఠం చిరాగ్గా "టేక్సూ లేదు టేక్సీ లేదు. ఇదుగో ఇది ఉంచు, నా ఇంటి అడ్రసు ! చెక్ పోస్టుల్లో ఏదో ఇంత పడేసి లారీలు మళ్లించడం నీ ఓపికే, మనకి కూడా కొంత బాగామట్టజెప్తే మంచి రామీ మీదే కుదురుస్తాలే !," అంటూ శ్రీకంఠం దళసరి కాగితం ముక్క పాపరాజు చేతుల్లో పెట్టి కదుల్తున్న బస్సెక్కాడు,

"ఆఁ ! ఆరి నీ గేసు డిబ్బడా ! ఎంత గేస్ కొట్టినన్ను మేపించావురా యెదవ నాయాలా !..." అంటున్నాడు పాప రాజు పోతున్న బస్సు వేపేచూస్తూ....

( సశేషం )




'ఇంకేం చూస్తావ్‌లే మామ్మా...పొద్దు పోవచ్చింది, ఇంటికెళ్ళిపో...!వస్తే ఆతనే వస్తాడులే...ఇంకెంత సేపనిఎదురు చూస్తావ్...?'

—అన్నాడు రమణయ్య పొలంనుంచి తిరిగి యింటికి వెళ్ళిపోతూ. పొద్దున్న పొలానికి వెళ్ళేటప్పుడు చూశాడు, రత్తమ్మ అక్కడ కూర్చోవడం. సాయంత్రం అయిపోయింది చీకటి పడిపోవస్తున్నది. అయినా రత్తమ్మ అలాగే కూర్చుండిపోయింది.

'ఇంటికి వెళ్ళిమాత్రం చేసేదేముంది? ఇంకాస్సేపు కూర్చుంటాలే' బాబూ... నువ్వెళ్ళు...' అంది రత్తమ్మ. అనేసి, లోలోపల అనుకుంది-'పిల్లాపాపాలేని రమణయ్యకి ఏం తెలుసు - కన్నతల్లి ప్రాణం...?'

బస్సులు వస్తున్నాయి. వెళ్తున్నాయి. దుమ్ములేపుకుంటూ ఆగకుండా వెళ్ళిపోయే బస్సులని తదేకంగాచూస్తూ-ఆగిన బస్సులోనుంచి దిగే మనుషుల వంక కళ్ళప్పగించి చూస్తూ - ఆశగా అలాగే కూర్చుండిపోయింది రత్తమ్మ.

చిన్నప్పుడెప్పుడో వెళ్ళిపోయాడు రావుడు. ఎలిమెంటరీ స్కూల్లో చదువు

తుండగా ఇల్లు వదిలిపెట్టేసి వెళ్ళి పోయాడు.

బడి ఎగ్గొట్టి అల్లరిమూకతో కలిసి చీట్లపేక ఆడుతున్నాడని తెలిసి తండ్రి చావచితక మోదాడు. ఆ దెబ్బతో ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాడు.

చెప్పి వెళ్ళివుంటే దాచుకున్న డబ్బు ఇచ్చి పంపేదాన్నే - దారిలో తిండానికి ఏమన్నా చేసిపెట్టేదాన్నే-ఎక్కడకి వెళ్తున్నాడో చెబితే తెలిసివున్నవాళ్ళ అడ్రసులు ఇచ్చేదాన్నే-అని కుమిలిపోయింది రత్తమ్మ.

రావుడు వెళ్ళిపోయినప్పటి సంఘటన ఆమె కళ్ళముందు మెదిలి కళ్ళు చెమర్చాయి. '—నా పిచ్చికాకపోతే ఆనాడు నాకు తెలిసివుంటే అసలు వెళ్ళనిచ్చేదాన్నా...?'-అని నిట్టూర్చింది.

వెళ్ళనివ్వకపోతే రావుడు ఇంత గొప్పవాడు అయ్యేవాడా? ఇక్కడ-ఈ వూళ్ళో ఏముంది? మట్టి! వుత్తి దుమ్ము ధూళీ...! అప్పుడు అలా ఇంట్లోంచి వెళ్ళిపోయాడు గనకనే ఇప్పుడు రాజులా తిరిగి వస్తున్నాడు. ఫలానావారి కొడుకు అని అంతా చెప్పుకుంటుంటే గర్వించతగ్గ రావుడుగా తిరిగి వస్తున్నాడు...

కలెక్టరు వుద్యోగం అంటే మాటలా? మహామహావాళ్ళకే రాదు...-!

—కలెక్టరు వుద్యోగం చేస్తున్నాను.. ఇంటికి వస్తున్నాను... ఇక ఇంటిదగ్గరే వుండిపోతాను... నీ కేకష్టం రాకుండా చూసుకుంటాను... మనందరికీ మంచి రోజులు వచ్చాయి. బోల్డంత డబ్బు తెస్తున్నాను... మనవూరంతా కొనేస్తాను ...అని రాసేడు రావుడు.

పిచ్చిసన్నాసి...ఇవన్నీ నాకెందుకు? నా కొడుకు నా కళ్ళముందు కదులుతూ వుంటే ఎన్ని సంపదలయినా వాడిముందు దిగదుడుపే...!

ఎక్కడున్నాడో...ఏంచేస్తున్నాడో.. అసలు వున్నాడోలేడో...అనుకున్నవాడు ఈ రోజు కలెక్టరై తిరిగి వస్తున్నాడు... ఎంత అదృష్టం...?ఎంత అదృష్టం...?

కలెక్టరయిన కొడుకును కళ్ళారా చూసుకోడానికి ఎన్నిరోజులు పడిగాపులు పడివుంటేమాత్రం తప్పేమిటి?

కన్నకొడుకు మీద మమకారం ఎలాంటిదో రమణయ్యకు తెలియదు. కలెక్టరంటే ఎంతగొప్పో వూళ్లో జనానికి తెలియదు. అంతా వెర్రిమూక. చెప్పినా అర్థంకాదు.

వూళ్లో కరణంగారూ, మునసవుగారూ బస్తీకి వెళ్ళిపోయారు. లేకపోతే తెలిసేది...ఎంత అట్టహాసం చేసేసేవారో... ఎంత హడావుడి పడిపోయేవారో...?

నిజమే..

ఆ పాలెము ప్రజలకి అక్షరజ్ఞానం కొంచెంకూడా లేదు. ఎంతసేపూ గొడ్డుల్లా చాకిరీచెయ్యడం తప్పించి రెండో వ్యాపకంలేదు. ఆ జనం జనంకిందా_ఆ వూరు వూరికిందా లెక్కలోకి రాదు.

జనాభాలెక్కల్లో ఆ వూరు కలిసిందంటే అదో గొప్ప విషయం.

ఆ వూరికి వెళ్ళాలంటే చిన్న వాగు దాటాలి రెండు మూడు పంటకాలువలు దాటాలి చేలగట్లు అడ్డబడి నడవాలి పుంతలూబురదలూ తొక్కాలి అప్పుడు ఆ వూరికి వచ్చినట్టు

ఇంత కష్టపడి ఆ వూరికి వచ్చేవోపిక ఆ వూళ్ళో ఆ కొద్దిమందికి మాత్రమే వుంటుంది

స్కూలుకు వెళ్ళాలంటే పొరుగూరికి వెళ్ళాలి సంతకి వెళ్ళాలంటే పొరు గూరికి వెళ్ళాలి ప్రతి చిన్న విషయానికి పొరుగూరిమీద ఆధారపడిన ఆ జనానికి రత్తమ్మ కొడుకు సంగతీ-అతని గొప్ప సంగతీ తెలిసివున్నా - ఏంచెయ్యాలో వాళ్ళకి తెలియదు వట్టి అనాగరికులు చదువు సంధ్యల్లేని మొద్దు రాచ్చిప్పలు

"మా రావుడు కలెట్టరై వస్తున్నా డురా...అంటే నూకాలు ఏవన్నాడు

'వచ్చింతర్వాత కవురెట్టు సూడ్డాని కొత్తాను 'అన్నాడు వూళ్లోకి పెద్దమనిషి ఎంకమ్మపాటి తెలీదు

పొద్దున్నే వస్తుంటే ఎంకమ్మ ఏమంది .."మీరావుడు కలెట్రు అయ్యాడంటగా కల్రటు అంటే గవర్నరుతో సమాన మంట కార్లో వస్తున్నారా...యిమానం లోనా...?" అంది

'బస్సులోనమ్మా...' అంటే బుగ్గన వేలేసుకుంది

'నా కొడుకు సంగతి దీనికేంతెల్సు ? కలెట్టరయినంతమాత్రాన కార్లో కూర్చుని కళ్లెగరేసే పోకిరీవా డనుకుంటుంది కాబోలు. .వాడిది వాళ్ళ నాన్న పోలిక ఆ మగమహారాజు వుంటే ఎంత పొంగి పోయేవాడో వచ్చీరాంగానే నాన్నేడీ అంటే ఏంచెప్పను . ?'

అనుకుంటూనే ఆమె కళ్లల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి చెంగు లాక్కుని నోట్లో కుక్కుకుంది

ఇంతలో ఏదో బస్సు వచ్చి ఆగింది ఒక్కడంటే ఒక్కడే దిగాడు అతను ఈరాసామి

ఏంది మామ్మా ఇక్కడ గూకు న్నావ్ యారన్నా వొత్తున్నారా...? అనడిగాడు

'మరేరా...రావు దొత్తున్నాడు...' అంది రత్తమ్మ

'ఏందేందీ...రావుడా?... నీకేమన్నా మతివోయిందా?' అన్నాడు ఈరాసామి అనుమానంగా

'రావడంలో ఏందనుకున్నావ్ ..కలె ట్టరయి వత్తున్నాడు. ఆ(...' అంది ముఖం చాటంతచేసుకుని

ఈరాసామి అనుమానం నిజమయింది 'ఇంత సందెవేళ వొంటరిగా కూకుంది ఏనాడో సచ్చివోయాడనుకన్న కొడుకు వొత్తున్నాడంటుంది పైగా ఆడు కలెట్ట రయ్యాడంట . కలెట్టరు. పిచ్చిమాలో కం...ఈ రత్తమ్మకి మొగుడు పోయి









నప్పటినుంచి తెలివి సెదిరిపోయింది...' అనుకుంటూ చరచరాఅడుగు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆకలి దప్పులు మరచి ఎదురు చూస్తున్నది రత్తమ్మ. రాత్రయిపోయింది. చుట్టూ చీకటి రోడ్డు ఇరువైపులా వున్న మర్రిచెట్లు జుట్టు విరబోసుకున్న దెయ్యాల్లా కనిపిస్తున్నాయి. ఎక్కడా జన సంచారంలేదు.

ఇంక బస్సులున్నాయో లేవో అన్న ఆలోచనలేదు రత్తమ్మకి. తన కొడుకు కలెక్టరు. బస్సు లేకపోయినా వేయించుకు రాగల సమర్థుడు - అని ఎదురు చూస్తూ కూర్చుంది.

చూపు కనిపించేమేరకు రోడ్డుమీదకు దృష్టిసారించి కళ్లు కాయలుకాచేలా ఎదురు చూస్తున్నది.

ఆ చీకట్లో - దూరంగా - రోడ్డుమీద కొరివిదెయ్యాలు జంటగా రయ్యిమనివస్తున్నట్టుగా కనిపించింది.

సందేహంలేదు. ఆ దెయ్యాలు బస్సుకు సంబంధించిన లైట్లే.

బస్సు వచ్చేస్తున్నది. బస్సులో రావుడు వచ్చేస్తున్నాడు. వచ్చీరాంగానే తన్ను 'అమ్మా' అంటూ గట్టిగా కావలించుకుంటాడు. దాంతో-ఇంత సేపూ పడిన మనోవ్యధ అంతా చెల్లాచెదురై పోతుంది.

ఇంతకీ, తనని గుర్తుపడతాడో లేదో?

రావుడు మాట దేవుడెరుగు-తనుగుర్తు పట్టగలుగుతుందా అని ?

ఎప్పుడో చిన్నప్పుడు లాగులు నాడు చూసింది. ఇపుడు దొరబాబులా అయి వుంటాడు. సూటూబూటూ వేసుకుని అచ్చం దొరబాబులా వుంటాడు. ఎందుకు గుర్తుపట్టలేదు తను?అలాంటివాడు ప్రపం

చంలో ఎక్కడా వుండడు ఉన్నవాళ్లం దరిలోకీ తనకొడుకే గొప్పవాడు అంత గొప్పవాడిని తను గుర్తించలేక పోతుందా? ఛ.ఛ.. ఎప్పటికీ కాదు...

రత్తమ్మ ఆలోచనలు ఇలా సాగుతూండగానే వచ్చి ఆగింది బస్సు.

ఆగిందీ అంటే ఎవరో దిగుతారనే అర్థం. ఆ ఎవరో ఎవరోకాదు, తన కొడుకే...రావుడు...తన రావుడు.

బస్సు దిగాడు.

అంత చీకట్లోనూ ఇక్కడ దిగిన వాడు తన రావుడు కాకపోతే ఎవరె వుంటారు?

దిగిన మనిషిని వదిలి దుమ్ములేపుకుంటూ కదిలిపోయింది బస్సు. పక్కగా నిలబడ్డ రత్తమ్మ గుండెల్లోదాకా పోయిన దుమ్ము ఆమెని వుక్కిరిబిక్కిరి చేసేసింది. దగ్గుతూ వూపిరి సలపకుండా ఆపసోపాలు పడుతున్న రత్తమ్మ పరిస్థితి - ఆమె వునికిని తెలియపర్చింది బస్సు దిగినవాడికి...రత్తమ్మగారి రావుడికి...

అటూఇటూ చూస్తున్న రావుడు రత్తమ్మని పసిగట్టాడు. ఆ చీకట్లో ఆడో మగో తెలియలేదుగాని-మొత్తంమీద ఒక మనిషి అతనికి అందుబాటులో వున్నట్టు గ్రహించాడు.

చేతిలోవున్న బరువైన హోల్డాలు ఆమెమీదకి గిరాటువేశాడు. ఎదురుసమాధానంకోసం ఆశించకుండా నడక సాగించాడు.

ఈ ఆకస్మిక సంఘటన రత్తమ్మని ఎంతగా కలచివేసిందో-ఆమెలో ఎలాంటి సంచలనాన్ని లేపిందో తెలిసేందుకు అది పగలుకాదు, రాత్రి వెలుగులేదు, చీకటి. కటికిచీకటి.

రత్తమ్మ బదులు చెప్పలేకపోయింది. హోల్డాలు పట్టుకుని నడవబోయింది. అది చాలా బరువుగావుంది. చేతులతో మోసుకెళ్లే శక్తి ఆమెకు లేదు. ప్రొద్దుటనుంచి అన్నపానీయాల్లేకుండా అతనికోసం నిరీక్షిస్తూవుంది. అయినా ఆమెకి నిస్సత్తువగా లేదు. కాని, రావుడు తన్ను పలకరించలేదు తను ఆశించినట్టు కావలించుకోలేదు. 'అమ్మా' అని నోరెత్తి పిలవలేదు-ఇవన్నీ ఆమెకి ఆశాభంగాన్ని కలిగించాయి.

శారీరకంగా ఎంతటిబాధనైనా భరించగలదు గాని, ఈ గుండెపోటును భరించలేకపోయింది. హోల్డాలు చేతికి తీసుకుని రెండడుగులు వెయ్యగానే తూలి పడబోయింది.

రావుడు నడుస్తున్నాడు. చకచకా నడుస్తున్నాడు. ఈ ప్రపంచంతో సంబంధము లేనట్టుగా నడుస్తున్నాడు. హుందాగా ఠీవిగా బూట్లు టకటకలాడిస్తూ రోడ్డుమీద రత్తమ్మకంటి జ్యోతిలా వెలిగిపోతున్నాడు. అతను వేసుకున్న బూట్లు కొత్తవేమో...పాలిష్ అప్పుడే చేయించాడేమో టార్చిలైట్లల్లా మెరుస్తున్నాయి. సూటు వేసుకున్నాడులా వుంది-మనిషి

మనిషిలా లేడు. రత్తమ్మ కంటికి ఇంద్రుడూ చంద్రుడులా కనిపిస్తున్నాడు.

ఈ రావుడు తన కొడుకు. తన కొడుకే. తనకోసమే వస్తున్నాడు-రత్తమ్మ ఇలా అనుకోగానే ఆమె బాధ అంతా పటాపంచలైపోయింది. అతన్ని చూస్తూనే అన్నీ మరచిపోయింది. మనసు తేలిక పడ్డది.

ఉత్సాహంగా హోల్డాలు తలపైకి విసురుకుంది. హోల్డాలు ఆమె తలమీద కుదురుగా కూర్చుంది. తలమీద బరువులు మొయ్యడం ఆమెకి అలవాటులేదు. అయినా బరువుగా వున్న ఆ హోల్డాల్ ఆమెకి బరువనిపించలేదు.. చిత్రం!

రావుడు నడుస్తున్నాడు.

రత్తమ్మ హుషారుగా రావుడు వెనకాలే పరుగెడుతున్నటుగా నడుస్తున్నది..

రావుడు నడుస్తున్నాడు.

బూట్ల టకటకలు అతన్ని వుత్సాహపరుస్తున్నటుగా వున్నాయి. వడివడిగా నడుస్తున్నాడు నడకవేగం హెచ్చిస్తున్నాడు.

రత్తమ్మ పరుగెత్తుతుంది. వెర్రిఆలోచనలతో-అపరిమితానందంతో-తనకొడుకు తన దగ్గరికి వచ్చేస్తున్నాడన్న సంబరంతో అతని వెనకాలే పరుగెత్తుతున్నది.

రావుడు నడుస్తున్నాడు. ఆ నడకలో ఏదో తడబాటు. దారితెలియని వెతుకులాట. అందులో మళ్ళీ ఎక్కడలేని ఠీవి.

ఇంత దర్జాగావున్న కొడుకుని తన పూరిగుడిసెలోకి ఎలాగ తీసుకువెళ్లాలి? అన్న ఆలోచన కలిగింది రత్తమ్మకి.

పోనీ మునసబుగారి పెంకుటింటికి తీసుకువెళ్తేనో? అనుకుంది. అవును, అలా చేస్తేనే బాగుంటుంది - అని నిర్ణయించుకుంది. ఇంత గొప్పవాడిని పూరిగుడిసెలో వుంచితే తనకే తలవంపులుగా ఉంటుంది. మునసబుగారి పెంకుటిల్లే తగిన ఇల్లు.

కొడుకు కలెక్టరై తిరిగివస్తున్న సమయానికి తను కనీసం ఒక డాబాయింటినైనా అమర్చిపెట్టుకోలేని అసమర్థతికి ఆడిపోసుకుంది.

రావుడు రోడ్డు మలుపు తిరుగుతున్నాడు. ఇంకా చాలాదూరం నడవాలి. అంతదూరం నడవగల్గుతాడోలేదో-అసలే అది వెధవపుంత. అన్నీ ముళ్ళడొంకలే.

ఎత్తుకు తీసుకువెళ్ళితే......? ఈ హోల్డాలు ఒకటి...! ఇది లేకపోతే... ఎత్తుకు తీసుకువెళ్ళగలిగేదా తను...;

రత్తమ్మ పెదవులమీదికి చిరునవ్వు చిందులాడింది. తప్పకుండా ఎత్తుకుతీసుకెళ్లేదే. రావుడు ఎంత గొప్పవాడైనా ఆ గొప్ప పరాయివాళ్ళకి. రావుడు తనకి కొడుకు, తనకి తన కొడుకెప్పుడూ చిన్న పిల్లవాడే...

వెధవ్వూరు. కనీసం బండయినా వెళ్ళదు, బండికూడా వెళ్ళని ఆ వూరిని

తిట్టిపోసింది రత్తమ్మ రోడ్డని దుమ్మెత్తి పోసింది ఒకవేళ రోడ్డు బాగున్నా — అతన్ని కనీసం - ఒక కారుమీదయినా యింటికి తీసుకువెళ్లలేని తన దీనావస్థకి ఎంతగానో నొచ్చుకుంది.

రావుడు నడుస్తున్నాడు. ఏమిటలా నడుస్తున్నాడు...? తాగాడా ? ఛఛ... తాగితే మాత్రం ఏం...? కూలిపని చేసుకునే నాగన్నే తాగుతున్నాడు...కలెక్టరయినవాడు తాగితే మాత్రం ఏం...?

ఇంకా చాలాదూరం నడవాలి. ఎలా నడుస్తాడో ఏమో...! అసలు నడవటం అలవాటుందోలేదో...? ఇంటికెళ్ళిన తరవాత కాళ్ళుపట్టాలి. అరికాళ్లకి ఆముదం పట్టించి మర్దన చెయ్యాలి. ఎంత బూటు వేసుకుంటేమాత్రం? కాళ్ళు నొప్పి పుట్టవూ? కాళ్ళు నలిగిపోవూ...?

కంటికి రెప్పలాంటి ఆ తల్లి-రావుడు గురించి పడే మనోవేదన వర్ణనాతీతం.

చెప్పుయినా లేని ఆమె పాదంలో తుమ్మముల్లు కసుక్కుమని దూసుకుపోవడంతో ఆమె ఆలోచనలు కట్టడిపోయాయి.

బాధతోకూడిన చిన్న మూలుగుతో ఆమె నడక కుంటువడింది.

హోల్డాలు కిందపెట్టి కాలుముల్లు తీసుకుందామా? అని క్షణమాత్రం అనుకుంది. హోల్డాలు కింద పారేస్తే మట్టి అంటుకోవచ్చు. రావుడు దీన్ని ఎంత అపురూపంగా చూసుకుంటున్నాడో ఏమో —హోల్డాలు కిందకిదింపడం ఆమెకిష్టం లేదు

రావుని చూసించి. తనకి చాలా దూరంలో వున్నాడు. చకచకా నడిచి వెళ్ళిపొతున్నాడు. లక్ష్యంచూసి విడిచి పెట్టిన బాణంలా వెళ్ళిపొతున్నాడు.

ఆ ఆదుర్దా అంతా ఎవరికోసం? తనకోసం? తనకోసమా! తనని చూడ్డానికా ఆ తొందరంతా. పాపం. ఎంతగా అలమటించి పొతున్నాడో, ఏమో!

'పిచ్చి మొద్దును, బస్సు దిగంగానే నేనే నీ తల్లినిరా అని చెప్పేస్తే నాకే అవస్థా వుండేది కాదు...?' అనుకుంది

తనకోసం అంత ఆదుర్దా పడుతూ వెళ్తున్న వాడికి తనవల్ల ఆలస్యమైతే ఎంత బాధపడతాడు? అని బాధపడింది.

కాల్లో దిగినముల్లు నడుస్తుంటే కసుక్కున కసలుతున్నది. విపరీతమైనబాధ పెడుతన్నది. ఆ ముల్లు తీసుకుంటూ కూర్చుంటే — కొడుకు దూరమైపొతాదేమో! ఇంటికి చేరుకునేసరికి అక్కడ తను వెంటనే కనిపించకపొతే బెంబేలు పడిపొతాడేమో - అని అలాగే పరుగు సాగించింది రత్తమ్మ.

దూరంగా నడుస్తున్న అతన్ని చూస్తుంటే ఆమెకి ముల్లు గుచ్చుకున్నట్టుగా కాని, అది సలుపుతున్నట్టుగా గాని అనిపిచడంలేదు. అసలు భూమ్మీద నడుస్తున్నట్టేలేదు. గాల్లో తేలిపోతున్నట్టుగా-హాయిగావుంది.




గబగబ నడిచివెళ్తున్న 'రావుడు' వూర్లోకి వచ్చేశాడు ఎటువెళ్ళాలా ? అని ఆలోచిస్తున్నట్టుగా కాసేపు ఆగాడు అక్కడ అతను కొంచెం తూలిపడినట్టుగా కూడా తోంచింది

రత్తమ్మ కాళ్ల వేగం హెచ్చింది కొద్ది అంగల్లో రావుణ్ణి చేరుకుని ఉండేదే అంతలో రావుడు నిలదొక్కుకొని కదిలి పోయాడు

వూరి పోలిమేరలకి దగ్గరగా వున్నది రత్తమ్మ పూరిగుడిసె పిచ్చితండ్రి నడవలేకపోతున్నాడో ఏమో... ! ఆ గుడిసెలోకే కాళ్లసాగించాడు

రత్తమ్మ హడావిడిగా గుడిసె చేరుకునేసరికి-రావుడు కాళ్లారజాపి నులక మంచంమీద వెల్లికితలా పడుకుని వున్నాడు సొమ్మసిలిపోయినట్టుగా పడిపోయాడు

రత్తమ్మకి కంగారు పుట్టింది రావుడికి ఏమయిందో అని ఆమె భయం గుడ్డిదీపం వెలిగించి, ముఖం దగ్గరకి పట్టకెళ్ళి చూసింది అతను కళ్లు మూసుకుని వున్నాడు నిద్రపోతున్నట్టుగా వున్నాడు

ఎప్పుడు తిన్నాడో ఏమో-?

కోటు బొత్తాములు విప్పి చొక్కా మీద చెయ్యివేసి కడుపు తడిమింది అది బాగా లోతుకుపోయివుంది

ఆమె కళ్లనుంచి బొటబొటా రాలాయి కన్నీళ్లు వేసిన చెయ్యి తియ్యలేదు తియ్యాలని అనిపించ లేదు అతని స్పర్శ ఆమెకి వింత అనుభూతిని కలిగించింది స్వర్గంలో ఉన్నట్టు అనిపించింది చెయ్యి తియ్యకుండానే తల ఆనించింది, అతని గుండెలమీద

'ఇలా నా ప్రాణాలు ఎగిరిపోతే ఎంత బాగుండును !' అనుకుంది

అలా అనుకుంటుండగానే ఆమె చెంపలకి ఏదో చల్లగా తగిలినట్టు అనిపించి వులిక్కిపడింది

'నా తండ్రికి ఎంత చెమట పట్టింది?'- అనుకుంటూ దీపంవత్తి పెద్దదిచేసి దగ్గరగా పట్టిచూసింది.

అది చెమటకాదు.

రక్తం—!.

తడితడిగా పొడిపొడిగా వున్న రక్తం...!

కెవ్వున అరచింది రత్తమ్మ. గుండెలు పగిలిపోయేలా - రక్తనాళాలు తెగిపోయేలా అరిచింది రత్తమ్మ.

పక్కనే రావిచెట్టుకు వేలాడుతూ నిద్రపోతున్న వెన్నముద్దలు కీచుకీచుమంటూ ఎగిరిపోయాయి.

వూళ్లో జనమంతా పరుగెత్తుకొచ్చారు. గుడిసెలోకి వెళ్లి చూశారు. మరుక్షణంలో గుడిసె చుట్టూ జనం గోల...!

ఒక్కొక్కరూ ఒకో రకంగా చెప్పుకుంటున్నారు వింతగా అనుకుంటున్నారు.

తెల్లారు ఝాము అవుతూ వుండగా యిద్దరికీ దహన సంస్కారాలు చేసే ప్రయత్నం ఆరంభించారు.

అదే సమయంలో దూరంనుంచి కుక్కల అరుపులు వినిపించాయి. మామూలు కుక్కలు అరిచినట్టుగాలేదు. వింతగా అరుస్తున్నాయి.

జనంలో కొంతమంది ధైర్యం వున్న వాళ్లు అటువేపు వెళ్లారు,

భయంకరంగా అరుచుకుంటూ వస్తున్న రెండు కుక్కలు కనిపించాయి. మరి కొంత దూరంలో పోలీసులు కనిపించారు.

ఆ వూరికి కనీవిని ఎరగని సంఘటన ఇది!

కుక్కలు. పోలీసులు. పోలీసులు-కుక్కలు. పోలీసుకుక్కలు!

గ్రామస్థులు భయకంపితులై పోయారు. రత్తమ్మ యింటిచుట్టూ వున్న జనం పలాయనం చిత్తగించారు. ఎవరి ఇళ్లల్లో వాళ్లు దూరి తలుపులు గట్టిగా బిడాయించుకున్నారు. కిటికీ చువ్వల్లో నుంచి ఏం జరుగుతున్నదీ చూస్తున్నారు.

మరి కొంతమంది ధైర్యం చేసి పొదల మాటునా-డొంకల మాటునా వుండి పొంచిపొంచి చూస్తున్నారు.

కుక్కలు సరిగ్గా రత్తమ్మ గుడిసెలోకి దూరాయి. ఆ వెంటనే పోలీసులూ దూరారు.

కుక్కల అరుపులు నెమ్మదిగా తగ్గిపోయాయి.

పోలీసులు గుడిసె పీకి పందిరేశారు. వాళ్లకి కావలసింది మరోటి ఏదో వుంది. కాని, చిక్కినట్టులేదు.

తెల్లారుతూ వుండగా రత్తమ్మనీ-హతుడ్నీ వూరినుంచి తరలించేశారు.

జనంలో అలజడిరేగింది. ఆ సంఘటన గురించి కథలు చెప్పుకోవడమే పని. వాళ్లవాళ్ల కల్పనాశక్తిని బట్టి కథల్లుకుపోతున్నారు.

రత్తమ్మ కొడుకు దొంగ. పచ్చి




దొంగ. పోలీసులు వెతుక్కుంటూ వచ్చారు. వాళ్ళకి దక్కకుండా పారిపోవడం మూలాన్నే తుపాకీ పేల్చివుంటారు. అది గుండెల్లో దాకా గుచ్చుకుపోయింది. చావుతప్పి ఇలా పరుగెత్తుకొచ్చాడు. రత్తమ్మ గుడిసెలో ప్రాణాలు వదిలాడు. పాపం, రత్తమ్మ పిచ్చిది. కొడుకును ఆ స్థితిలోచూసి ప్రాణాలు వదిలేసింది. కొడుకు దొంగాడని తెలుసుకోకుండానే ప్రాణాలు వదిలేసింది రత్తమ్మ ఆమె అదృష్టవంతురాలు.

—తలొకరూ తలొకమాటా అనుకుంటుండగా ఆ వూరికి మళ్ళీ ఒక కొత్త మనిషి వచ్చాడు కొత్తసమస్య తెచ్చాడు. వచ్చీరాగానే "మా అమ్మ ఏదీ ?"— అనడిగాడు.

'మీ అమ్మ ఎవరు ?'

'రత్తమ్మ'

'నువ్వెవరు ?'

'రావుణ్ని'

"రావుడివా? సిత్రంగావుందే. మరి రాత్రివచ్చినోడో... ?"

'నేను కాను. బస్సు దొరకలేదు. నా బెడ్డింగు ఎవరో కొట్టేశారు. ఆలస్యమైపోయింది. మా అమ్మ ఏదీ ?'

ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

అక్కడున్నవాళ్ళు ఒక్కొక్కరే జారిపోసాగారు, ఏదో తప్పుచేసినవాళ్లలా. రావుడి ప్రశ్నకి సమాధానం చెప్పినవాళ్ళెవరూ కనిపించలేదు

ఒకడ్ని నిలేసి అడిగాడు రావుడు.

అతను జరిగిందంతా చెప్పాడు

రావుడి కిదంతా అగమ్యగోచరంగా వుంది. గుడిసెలోపలికి పరుగెత్తిచూశాడు. లోపలంతా కలియతిప్పేసినట్టుగా వుంది. చిందరవందరగా వుంది

ఒకమూలనఉన్న హోల్డాలు అతని కంట పడింది

ఆ హోల్డాలు తనదే. అవును తనదే!

ఒక పొర కోసి చూశాడు. బంగారు రేకులు తళతళా మెరిశాయి. కరెన్సీ కూడా చెక్కుచెదరలేదు. దాన్ని మళ్ళీ అలాగే వుంచేశాడు.

అయితే వాడేనన్నమాట... !

తనదగ్గర హోల్డాలు తస్కరించిన వాడే అయివుంటాడు. సరయిన చోటికే తీసుకు వచ్చాడు.

ఏం లాభం ? తల్లి ప్రాణాలు తీసేశాడు. ఎవరికోసమయితే తను ఇంత కష్టపడి సంపాదించుకువచ్చాడో-- ? ఆ కష్టమంతా బూడిదపాలయిపోయింది.

అమ్మ ఇకలేదు !

ఈ సంపదతో ఎంతో చెయ్యాలనుకున్నాడు. తల్లిని అందలాలెక్కించి ఆనందాలు చూపించాలనుకున్నాడు.

ఆమె కష్టాలు గట్టెక్కించి స్వర్గసుఖాలు చూపించాలనుకున్నాడు--

అదే వుద్దేశంతో వస్తుండగా హోల్డాలు మారిపోయింది. ఎవరో కావాలనే ఇలా చేశారు. తనని వెంటాడినవాళ్లే దీనికంతా కారణం. అమ్మ దగ్గరికి వచ్చే ఘడియలు దగ్గర పడుతూపడుతూ వుండగా--- హోల్డాలు మాయమైపోయింది. తన సర్వస్వం దోచేసుకున్నారు. తన ఆశలు కూలిపోయాయి.

అమ్మని సుఖపెట్టేరాత ఇక నాకు లేదు అనుకున్నాడు.

కాని... కాని... మళ్లీ

అయిశ్వర్యం లభించింది. అమ్మ లేదు. అయిశ్వర్యం లేకపోయినా ఫరవాలేక పోయేది-- అమ్మ వుంటే అంతా వున్నట్టే అనుకునేవాడు.

---రావుడు కృంగిపోయాడు. మోకాళ్లమీద కూర్చుని చేతుల్లో ముఖం దాచుకుని భోరుమన్నాడు.

ఎవరో లోపలికి వచ్చారు. తర్వాత ఒక్కొక్కరూ. అంతా అతని చుట్టూ మూగారు.

'మీరేనా కలెట్టరు ?'

'కాదు, బిల్లు కలెక్టరు. అదీ ఇప్పుడు కాదు; ఒకప్పుడు...' ఏడుస్తూనే సమాధానం ఇచ్చాడు

'ఎవరో దొంగవెధవ. రత్తమ్మ ప్రాణాలు పొట్టబెట్టుకున్నాడు...'-అన్నారెవరో...

ఎవరా దొంగవెధవ? --అనుకున్నాడు రావుడు మనసులో...

--స్మగ్లింగ్‌లో సంపాదించిన డబ్బుతో అమ్మని సుఖపెట్టాలనుకున్నాను. ఆడబ్బే అమ్మ ప్రాణాలు తీసింది. నేను పాపిష్టి వాడిని... పాపం డబ్బుతో అమ్మ ప్రాణాలు తీశాను. ఈ డబ్బుతో సుఖపడ్డం ఇష్టంలేకనే అమ్మ వెళ్ళిపోయింది. ఈ డబ్బు లేకపోతే అమ్మ బ్రతికే వుండేదేమో...

'అమ్మా' అంటూ భోరుమన్నాడు రావుడు, రత్తమ్మకొడుకు !.

——

# అర్థం తప్పిన హృదయాలు

**—శౌరి**

(గత సంచిక తరువాయి)

"పోనీ, సివిల్ మారేజ్ చేసుకుందాం ఏ ఆడంబరాలు లేకుండా" అన్నాడు.

"పెళ్ళి... లాంచనంగా జరిగినా, జరగకపోయినా ఒక్కటే. మనసులు ఒకటైతే మాంగల్యం లేకపోవటం లోపం కాదు. నే వెడతాను, హరీ. ఏదీ మరొక్కముద్దు, చివరిది" అంటూ అతని పెదాలపై ముద్దుపెట్టుకుని అన్నది "మన పెళ్ళికి...అంటే నిన్ను, పెళ్ళిచేసుకోనన దానికి కారణం! నాకు ఇదివరకే పెళ్ళి కావటం హరీ, నేను నా భర్తను వదిలి పెట్టాను. అతనితో సంసారం చేయటం ఇష్టంలేక పారిపోయి వచ్చాను. హరీ, అయినా, నేను అతని భార్యనే గదా. హిందూధర్మం ప్రకారం నేను అతని ఇల్లాలిని. వస్తా హరీ! ఏదీ ఇందాకటి వలె, అంత ఉద్రేకంగా, మరొకసారి ముద్దుపెట్టుకో నన్ను, చివరిసారిగా."

హరనాథ్ వంగి ఆమె పాదాలు ముద్దు పెట్టుకున్నాడు. కోమలి హృదయం ద్రవించి కన్నీరై, అతని శిరస్సుపై బడ్డ.. లేచి, ఆమెను కౌగిలిలోకి తీసుకున్నాడు. ఈసారి ఆమె పెదాలు తియ్యగాలేవు. ఆ కలయికలో అమృతం వర్షించలేదు. కోమలి అతన్ని గట్టిగా బంధించి, ఎంతకీ వదలలేదు. చివరకు గుండె చిక్కబట్టుకుని దూరంగాజరిగింది.

"వస్తా హరీ...నేనంటే నీకు అసహ్యం కలిగేలోగా వెళ్ళిపోనీ నన్ను. సెలవు" రెండు చేతులు జోడించి నమస్కరించింది. "హరీ, నాకి తొలి అనుభవాన్ని, మధురానుభూతిని ప్రసాదించినందుకు, నీకు జన్మాంతం కృతజ్ఞురాలిని. నిన్ను మరచిపోలేను."

"అంతమాట అనవద్దు కోమలీ. నీవంటే నాకు అసహ్యమా! ఎంతమాట అన్నావు. నా ప్రేమను, అపార్థం చేసుకున్నావు నీవు వివాహితవేగాదు, పచ్చి వ్యభిచారిననీ, కులటననీ చెప్పినా నా మనస్సు మారదు, మారబోదు. నాప్రేమ చెదరదు. ఏ దేవతలో, అసూయతో మనల్ని శపించారనుకుంటాను. పెళ్ళి కాకపోతేనేం దేవీ,మనం నిష్కళంకంగా ప్రేమించుకున్నాం. పవిత్ర ప్రేమికులం, ప్రేమజీవులం. మనం కలిసి జీవిద్దాం, కలిసి బ్రతుకుదాం. మనకు పెళ్ళికాలేదని ఎవరూ ఆక్షేపించరు."

"నాకేం భయంలేదు హరీ, నాగురించి

నేనెప్పుడూ భయపడను. నీ పరువు ఏంకావాలి. సమాజం నిన్ను నిందిస్తుంది. రహస్యం ఎన్నాళ్ళు దాగుతుంది. ఇప్పుడే మన ప్రేమ బయటపడితే నేను డాక్టర్ని కాలేను. డాక్టర్ని కాకపోతే, మా కుటుంబం బజారుపాలవుతుంది. దిక్కూ, మొక్కూ లేకుండా పోతుంది నా చెల్లెళ్ళకు పెళ్ళిళ్ల కావు. అనేక చిక్కులు, సమస్యలు ఉన్నాయి. వస్తా హరీ, నీకు కృతజ్ఞు రాలిని, గుడ్‌బై."

రెండవనాడు పోస్టులో మూడు ఉత్తరాలు వచ్చాయి. ఒకటి ఇంటినుండి, రజని వ్రాసింది.

చిరంజీవి కోమలికి,

శోభకు, భగవంతుని దయవల్ల మంచి సంబంధం కుదిరింది. కుర్రవాడు యోగ్యుడు. బుద్ధిమంతుడు. పెద్దగా డబ్బుకలవారు కారు. ఇక్కడే బ్యాంకులో ఉద్యోగం. ఫరవాలేదు పెళ్లాం పిల్లల్ని పోషించుకోగల తెలివి తేటలున్నాయి. అబ్బాయి శోభను చూచాడు. ఇష్ట పడ్డాడు. నీవు రాగానే లగ్నాలు పెట్టు కుంటాం ఇప్పుడు పెళ్ళి ఆడంబరంగా చేసే స్థోమత లేదు. ఏదో అయిందని పిస్తాం. నీవు ఎప్పుడు వచ్చేదీ వ్రాయి.

మీ అమ్మ.

రెండవ ఉత్తరం హరనాధ్‌నుండి. అది అతనిదని తెలియగానే చేతులు వణికాయి. పాపంమొన్న అతను ఎంతబాధ పడ్డాడో, కుమిలిపోయాడో డిసపాయింట్ అయివుంటాడు, విషంలాంటి నిజంతెలుసు కుని. ఎంత క్షోభపడ్డాడో వణికే చేతులతో ఉత్తరం విప్పింది. సంబోధన చూడగానే చకితురాలైంది. మ్రాన్పడిపోయింది. కళ్ళలో నీళ్లు తిరిగి, నీటి మబ్బులు క్రమ్మాయి, అక్షరాలపై తెరపడ్డది.

ప్రియా కోమలీ,

నీవు వెళ్ళిన క్షణంనుండి నేను ఒక రకమైన మత్తులోఉన్నాను. అనిషా ఇంకా తగ్గలేదు. నీ శరీర స్పర్శ ఇచ్చిన ఆనందం, నీ కౌగిలి ఇచ్చిన అనుభూతి, నీ అధరాలు అందించిన అమృతపు రుచులు, నీ కళ్ళలో తొణికిన స్వర్గం హృదయంలో స్పందించిన అనురాగం, ఎలా మరచిపోను. ఈ వియోగం దుర్భ రంగా ఉన్నది. వచ్చి నీ పాదాలముందు వాలనా! నవ్వుకుంటున్నావుగదూ, నవ్వు, ఏంచేస్తాను. నా హృదయాన్ని దొంగి లించావు. నీ హృదయంలో ఓమూల ఇంతచోటిచ్చావు. ప్రేమ రుచిచూడ కుండానే, కలలుగన్నాం. నీముద్దు నన్ను స్వర్గం దాపులకు తీసుకువెళ్ళింది. అసలు స్వర్గంలో ప్రవేశం ఎప్పుడు అనుగ్రహిస్తావోమరి.

నాకిప్పుడు లోకమే ప్రశాంతంగా, ప్రేమ మయంగా కనిపిస్తోంది. జీవితానికి అర్థం, పరమార్థం ఉన్నదనిపిస్తోంది. నా బ్రతుక్కు సార్ధక్యం ఉన్నది. నాలో జీవం పోశావు కోమలీ. నా ఇల్లు, శరీరం పరిమళాలతో నిండిపోయాయి నీ మేని

మైత్రదనం, లావణ్యం, ఉచ్ఛ్వాస నిశ్వాసలు నన్ను ఉక్కిరి బిక్కిరిచేశాయి దేవీ! నేనెంత అదృష్టవంతుడినో ఎలా చెప్పను. మన ప్రేమ స్థిరంకావాలి. ఇది ఆరంభం. దీనికి అంతంలేదు. ఉండ కూడదు.

నీకు పెళ్ళి అయిందని చెప్పి భయ పెట్టావు. నాకేం లెక్కలేదు. రా, నీ చేతుల్లో వాలిపోతాను. నిన్ను నాగుండెలో హృదయంలో దాచుకుంటాను రా దేవీ సాంఘిక అవరోధాలు ఎన్ని ఉన్నా లెక్కచేయను. ఏదీ అసంభవం కాదు, మనస్సు స్థిరంచేసుకుంటే. మనస్సులు ఏకమైతే, లోకాన్నే జయించే శక్తిపుడుతుంది. కోమలీ, నేను నీవాణ్ణి. అది ఒక్కటి గుర్తుంచుకో చాలు. నేను ఇహమీదట బ్రతికేది నీకోసం మన ప్రేమ కోసం నువ్వు ఏ క్షణంలో వచ్చినా నా హృదయ మందిరంలో ప్రవేశించ వచ్చు. అది నీదే!

నీ - హరి

* * *

## 22

కోమలి ఆ ఉత్తరాన్ని ఎన్నిమార్లు చదివిందో లెక్కలేదు. చదువుకోంగానే, వెంటనే వెళ్ళి అతని చేతుల్లో వాలిపోయి, "నేను నీదాన్ని. ఈ ఎడబాటు సహించ లేను" అని చెప్పాలనిపించింది. ఉత్తరం చదివినకొద్దీ మొన్నటి సంఘటనలు జ్ఞాపకం వచ్చాయి జ్ఞాపకం వచ్చినకొద్దీ పిచ్చెక్కినట్టు అవుతుంది శరీరం ఎదురు తిరుగుతోంది. అనుభవంకోసం ఆరాటం, రక్తం వేడెక్కుతున్నది. అతనికి తన మాటలు కోపం తెప్పించలేదు.

మూడవ ఉత్తరం నారాయణ వ్రాసింది. అతనికేం అవసరం వచ్చింది నాకు వ్రాయడానికి" అనుకుని నొసలు చిట్లించింది ఆ ఉత్తరం చించబోతుండగా ఇందిర వచ్చింది గదిలోకి.

"ఇంకా కూర్చున్నావేమే కోమలీ, అవతల ప్రాక్టికల్స్ ఉంటేను."

ఉత్తరం పుస్తకంలో దాచింది.

"ఏమిటోయ్. చాలా హుషారుగా వున్నావ్! నీ కళ్ళు మిల మిల మెరుస్తు న్నాయి. ఏమిటి విశేషం? ఎనీ లవ్ అఫైర్!" అని అడిగింది ఇందిర.

"మా చెల్లి పెళ్ళి...అమ్మ ఉత్తరం వ్రాసింది" కోమలి సమాధానం.

"వెరిగుడ్, నీ చెల్లెలికి, మంచి చీర ప్రెజెంట్ చేస్తాను. వెళ్ళేటప్పుడు పట్టు కెళ్ళి, నేనిచ్చానని ఇవ్వు."

"నీకు మా శోభ తెలియదుగా ఇంకా?"

"నీవు తెలిస్తే, నీ చెల్లెలు తెలిసినట్లే.''

ఆరోజున ప్రాక్టికల్స్ సరిగా కుదర లేదు. రెండు మంచి సంతోషవార్తలు, నోట్సులో దాచుకున్న హరనాథ్ ఉత్తరం జ్ఞాపకం వస్తూనే నరాలు జివ్వుమంటు న్నాయి. నారాయణ ఉత్తరం గురించి మరచిపోయింది. రూంకి వచ్చాక

ముందుగా అమ్మకి జాబు వ్రాసింది. తర్వాత హరనాథ్‌కు వ్రాసింది.

డియర్,

నిన్ను పేరుతో పిలవాలంటే సిగ్గు వేస్తున్నదిప్పుడు. నీవు, నేనే అయినపుడు నా వాడివే అయినప్పుడు వేరే పేరుతో పిలిచి, వేరుచేయగలనా. నీ ఉత్తరం నాలో అమృతం కురిపించింది. నా చెల్లి పెళ్ళి నిశ్చయం అయింది. రెండుమూడు రోజులలో ఇంటికి వెళుతున్నాను. వచ్చే వరకు ఓపికపట్టాలి దొరవారు.

నీ 'కోమలి'

తను రాసిన ఉత్తరాన్ని రెండుసార్లు చదువుకున్నది. పదిసార్లు ముద్దుపెట్టుకున్నది. ముప్పయిసార్లు గుండెకు హత్తుకున్నది కవరు గట్టిగా అంటించి, రెండు ఉత్తరాలు పోస్టుచేసి వచ్చింది. అప్పటికి గాని మనస్సు స్థిమిత పడలేదు. మధ్యాహ్నం డిసెక్షన్ లాబ్‌లో ఇందిరను కలుసుకున్నది. ఇప్పుడు మనస్సులో ఏ వికారమూ లేదు. అక్కడ మూడవ ఉత్తరం సంగతి జ్ఞాపకం వచ్చింది. అయిష్టంగానే కవరు తెరిచింది.

మై డియర్ కోమలీ,

నా ఉత్తరం చూచి నీవు ఏమనుకుంటావో నేను ఊహించలేను. నిన్ను చూచినప్పటినుండి నాలో తుఫాను ప్రారంభమైంది. అది ఏమిటో చెప్పనా! ఇప్పుడు చెప్పే ధైర్యం వచ్చింది. నా హృదయంలోని ఆరాటం నీకు చెప్పుకో గలను. నీకోసం. ఏమైనా చేయగలను. నీ ప్రేమభిక్ష కోరుతున్నాను కోమలీ. నా కోర్కె మన్నించాలి. నన్ను, నా ప్రేమను శంకించవద్దు. ఎందుకంటే నా నరనరాన ప్రవహించేది రక్తం కాదు నీ ప్రేమ...

ప్రేమార్థి, నారాయణ.

ఆ ఉత్తరం చదవగానే అసహ్యం వేసింది. చప్పున - ఇందిర జ్ఞాపకం వచ్చింది. ఆ ఉత్తరంచూస్తే, ఇందిర ఎంత బాధపడుతుందో, పాపం. అతన్ని నమ్మింది అతని ప్రేమను విశ్వసించింది. నారాయణపై తనకు కోపంలేదు. తను, హరనాద్ ప్రేమించుకున్న విషయం తెలిస్తే ఆ మానవుడు ఏమైపోతాడో, అనుకున్నది. హరనాధ్ ఇతగానికన్న వేయిరెట్లు నయం.

నారాయణకు సమాధానం కాదు, గుణపాఠం చెప్పాలి. ఒకసారికలుసుకుని, "నిన్ను నేను ప్రేమించను సోదరా, నేనూ హరనాథ్ ప్రేమించుకున్నాం" అని చెప్పాలి పోనీ నారాయణ వ్రాసిన ఉత్తరం హరనాథ్‌కు చూపించి, అతని సలహా తీసుకుంటే, సహాయం కోరితే. రకరకాలుగా ఆలోచించింది ఇందిరకు ఈ విషయం తెలియనివ్వకూడదు. హర్ట్ అవుతుంది. చెబితే నారాయణే చెప్పుకుంటాడు. అతని నోటిద్వారా తెలిస్తేనే మంచిది. కానీ హరనాథ్‌కు చెప్పడం తన ధర్మం, అవసరం కూడా.

ఆ మర్నాడు హరనాధ్‌ను కలుసుకోవాలని నిశ్చయించుకున్నది. ఆ నిర్ణయం చేసుకోగానే, నిద్ర ముంచుకు వచ్చింది.

మర్నాడు ఉదయం నిద్రలేచేసరికి ప్రశాంతంగా ఉన్నది. స్నానంచేసి వచ్చి, బట్టలు మార్చుకుని, నారాయణకు ఉత్తరం రాయడానికి కూర్చున్నది.

"సోదారా,

నీ ఉత్తరంచూచి చాలా బాధపడ్డాను. నా జవాబు నీకు బాధకలిగిస్తుంది. నీవు నన్ను అపార్ధంచేసుకున్నావు. నేనెన్నడూ నిన్ను ప్రేమించలేదు. అలాటి ఆలోచనే లేదు నాకు. నన్ను సోదరిగా, స్నేహితురాలిగా భావిస్తే సంతోషిస్తాను. మీ రీసర్చి పూర్తిచేసుకొండి. విష్‌యు బెస్ట్ ఆఫ్ లక్...

సోదరి—కోమలి.

ఉత్తరం పోస్టుచేశాక ఆమెకు గుండెదడ, తలభారం తగ్గాయి. ఆమె సంతోషాన్ని ఇందిర గుర్తించి "ఏమిటి విశేషం?" అని పలకరించింది.

"మా ఊరు వెళుతున్నాను."

"అయితే మధ్యాహ్నం బజారు వెడదాం. నీ చెల్లెలికి చీర కొనాలి."

ఇద్దరు మధ్యాహ్నం మౌంట్‌రోడ్‌కు వెళ్ళి రకరకాల చీరలు చూచారు.

"మంచిచీర సెలెక్ట్ చేయవోయ్" అన్నది ఇందిర, ఆ బాధ్యత కోమలిదే నన్నట్లు. చివరకు ఎర్రబార్డరున్న చీరలు రెండు, ఒక నైలాక్స్‌చీర తీసుకున్నారు.

"అంత ఖరీదే!" విస్తుపోయింది కోమలి.

"పెళ్ళికి ఆ మాత్రం ఖరీదైన చీర ఇవ్వకపోతే బావుండదోయ్. తన అక్క స్నేహితురాలు పంపిందని చెప్పుకోడానికి సిగ్గుపడకూడదు, గర్వపడాలి గానీ."

హాస్టల్‌కి తిరిగివస్తూ ఇద్దరూ పెళ్ళి కబుర్లు చెప్పుకున్నారు.

"నువ్వు అదృష్టవంతురాలివి కోమలీ, నిన్ను చూస్తూంటే నాకు జలసీగావుంది. నాకు ఓ చెల్లెలో, తమ్ముడో వుంటే ఎంతబావుండేదని అనిపిస్తుంది."

హాస్టల్‌కి వచ్చాక, మరొకసారి చీరలు, జాకెట్లు చూసి తృప్తిచెందారు.

ఇందిర — నారాయణల ప్రేమ వ్యవహారంగా కోమలికి ఒక సమస్యగా తయారైంది. ఆమెనుచూస్తేజాలివేస్తుంది. ఇందిర అతన్ని పిచ్చిగా నమ్ముతోంది. అతనామెను మోసంచేస్తున్నాడు. ఆ సంగతి తనకు తెలుసు. చెబితే తనను అపార్థం చేసుకుంటుంది. చెప్పకపోతే, స్నేహితురాల్ని వంచించినట్లు అవుతుందన్న బాధ. నారాయణ తనకు ప్రేమలేఖ వ్రాసిన సంగతి ఇందిరకు తెలియదు. తనను పెళ్ళిచేసుకుంటాడనే తలపోస్తున్నది.

ఒకసారి హరనాధ్‌ను కలుసుకోవాలి, వెళ్ళేలోగా. అలా అనుకోగానే హుషారు వచ్చింది. ఆ మధురమైన అనుభవం ముందు మిగిలినవి అతిస్వల్పాలు. రేపే

ఊరికి ప్రయాణం. చాలామంది అమ్మాయిలు పెట్టెలు సర్దుకుని ప్రయాణానికి రెడీ అవుతున్నారు. కొందరు ఈ రాత్రికే రైలుకు వెళుతున్నారు. కోమలి రేపు ఉదయం రైలుకి సిద్ధం అయింది. రాత్రికి హరనాథ్‌ని కలుసుకోవాలి. పగలు అతను ఏ పనిమీద తిరుగుతుంటాడో.

సాయంత్రం చాలా సేపు ముస్తాబైంది. తనకున్న చీరలలో నాణ్యమైంది, తనకు బాగా నచ్చినది తీసి కట్టుకుంది. అది బంగారు జలతారు వేసిన, ఎర్రపట్టుచీర. అది తన 'కార్యం' రోజుకని కొన్నది. ఎప్పుడూ కట్టుకోలేదు. దాన్ని తీసి కట్టుకుంది. తెల్లని బ్లౌజు వేసుకుంది. చేతులకు బంగారు గాజులు, మెడలో నగలు లేక పోవడంవల్ల బోసిగావుంది. తలలో మల్లె మొగ్గలు తురుముకుని బయలుదేరింది. అంతలో ఇందిర ఎదురైంది, గదిలోకి వస్తూ.

"ఓహ్! ఏంజలిక్, బ్యూటిఫుల్. కోమలీ, నువ్వు ఎలావున్నావో చెప్పనా, పెళ్ళికూతురిలా, ఉత్త పెళ్ళికూతురు కాదు..." అన్ని నవ్వింది. "ఇంత కాలం గుర్తించలేదు గానీ నువ్వు చాలా అందగత్తెవోయ్...నే నే మగాణ్నయి తేనా, ఇప్పుడు నిన్ను అమాంతం" అంటూ కోమలిచుట్టూ చేతులు బిగించి, చెంపలపై ముద్దుపెట్టుకుంది.

"వెంటనే వచ్చేస్తాను. చీర బావుంది కదూ" అంటూ ఇందిర మళ్ళీ అడ్డు ప్రశ్నలు వేసి ఆపేలోగా, గడపదాటి బయటకు వచ్చింది. హాస్టల్ గేటు దగ్గరకు రాగానే టాక్సీ కనిపించింది. చీకటి పడుతున్నది. దీపాలు అక్కడక్కడ వెలుగుతున్నాయి. టాక్సీలో నిమిషాల పైన చేరుకున్నది.

"హలో డార్లింగ్" అంటూ ఎదురు వచ్చి స్వాగతం చెప్పాడు హరనాథ్. ఆమె రెండు చేతులు తనచేతుల్లోకి తీసుకుని, లోపలకు నడిపించాడు. గది లోపలకు రాగానే, తలుపులు బిగించి, కోమలిని, కౌగిలిలోకి తీసుకుని, ముద్దు పెట్టుకున్నాడు.

"అబ్బ, ఉండండి బాబూ, ఊపిరాడడం లేదు, ఏమిటాతొందర" కోపం నటించి, దూరం జరిగింది. "చూడండి, చీర ఎలా నలిగిపోయిందో...నేను వచ్చింది, ఊరికి వెళుతున్నానని చెప్పిపోదానికిగాని, తమరి ముద్దులకోసం కాదండీ మహాశయా."

"అలాగా! రతీదేవిలా అలంకరించుకుని వచ్చి, ఊరిస్తూ, నేను మడికట్టుకున్నానంటే, ఎలా డార్లింగ్. అయినా నువ్వు ఎందుకోసం వచ్చినా, నా డ్యూటీ నేను చెయ్యాలిగా!"

"యూ సిల్లీ" గోముగా అన్నది. ఆ అనటంలో కవ్వింపు ఉంది, ఆ చూపులోనే 'రెడీ' అన్న ఆహ్వానం వుంది.

"అద్భుతంగా ఉన్నావు కోమలీ. అసలే అప్సరసవు, ఈ పూట ఊర్వశిని




తలదన్నావు. ఈ కళ్ళు ఎలా పిలుస్తున్నాయో, నీ పెదాలు, ఒంటరి తనం భరించలేక ఎలా వణికిపోతున్నాయో చూడు" అంటూ ఆమెను కౌగిలిలో బిగించాడు. అతని వేళ్ళు ఆమె పిరుదుల నుండి, మెడవరకు ఎత్తు పల్లాల్ని స్పృశిస్తున్నాయి.

"వద్దు హరీ, నన్ను రెచ్చగొట్టకు. ఇలా ఉద్రేకపరచవద్దు ప్లీజ్" అని బతిమలాడింది.

"కోమలీ, ఈ బంగారు బొమ్మలో ప్రతి అణువును అనుభవించాలని ఉంది. నాకు పిచ్చెక్కుతోంది. ప్లీజ్ ... కాదనకు" హరనాథ్ ప్రాధేయపడ్డాడు.

"వద్దు, హరీ, నన్ను వెళ్లనీ, మూడు వారాల తర్వాత వస్తాను సరేనా. వెళ్ళే ముందు నాగురించి పూర్తిగా తెలియ చెప్పాలని వచ్చాను. నువ్వు నీ ముద్దులతో నన్ను ఊపిరాడనివ్వడం లేదు, ఇది చూడు హరీ..." అంటూ నారాయణ వ్రాసిన ఉత్తరం అందించింది. హరనాథ్ దాన్ని ఆత్రంగా అందుకొని, చదివి, పెద్దగా నవ్వేశాడు.

"ఇలాటి ప్రేమలేఖలు నీకు ఎవరైనా రాయకపోతే ఆశ్చర్యంగానీ రాస్తేకాదు ఇవి నీ అందానికి గీటురాళ్ళు."

"అదికాదు హరీ, నారాయణ పైకి కనిపించేటంత మంచివాడుకాడు. అతను ఇందిరను ప్రేమిస్తున్నట్లు నాటకం ఆడుతున్నాడు. అది ఇతనిపైనే ఆశలుపెట్టుకుని కలలు కంటున్నది. ఈ నిజం, అతగాని నిజస్వరూపం బయటపడితే, ఇందిర తట్టుకోగలదా చెప్పు. అతను నీకు స్నేహితుడు. అతనికి సలహాయివ్వు హరీ, మంచి మార్గంలో పెట్టు."

"నువ్వన్నది నిజమేకాని, కోమలీ, ప్రేమ వ్యవహారాలలో స్వార్థం ముందు స్నేహం పనిచేయదు. కొందరు ప్రేమ

విషయంలో ఎప్పుడూ అపజయాన్నే పొందుతుంటారు. సరే, నన్నేం చెయ్యమంటావో చెప్పు!''

"నారాయణ మనస్సు ఇందిరవేపు మళ్ళించాలి'' దృఢనిశ్చయంతో చెప్పింది కోమలి.

''అంత తేలిక అనుకోను. పైగా అనవసరం కూడా.'' అంతే నిశ్చయంతో అన్నాడు హరనాధ్. అంటూ ఆమెను తన మంచంపైకి లాక్కున్నాడు. అతని ప్రక్కనే, ఆనుకుని కూర్చున్నది. హరనాధ్ ఒకచేతిని ఆమె బుజంమీద వేసి, మీదికి వంచాడు. ఆమె అతని గుండెలపై వాలి, కళ్ళలోకి చూస్తున్నది, మత్తుగా.

"అతనికి మన విషయం ఇంకా తెలియదు... తెలిస్తే షాక్ తింటాడు పాపం, నీ స్నేహితుడాయె'' అన్నది.

"చెప్పాగా, ప్రేమకు స్వార్థంకానీ, స్నేహం ముఖ్యంకాదు.''

అంటూ ఆమెను గట్టిగా బంధించాడు. రబ్బరుబొమ్మలా తిరిగింది ఆమె పెదాలు ఆరాటపడుతున్నాయి.

"అబ్బ! నలిపేస్తున్నావు హరీ. ఇంక చాల్లే బాబూ, ఆగు...హద్దుమీరామంటే నాపని గోవిందా! నీకేం మొగమహారాజువి. ఇదిగో వెళ్ళిపోయేలోగా ఒక్క చాన్స్ ఇస్తా. నేను చెప్పినట్లు వినాలి తెలిసిందా! ఈసారి ఇంటినుండి వచ్చాక మనం తరుచుగా కలుసుకోవద్దంకుదరదు. ఫైనల్ ఇయర్. చదువుకోవలసింది ఎంతో వుంది. మన ప్రేమకు రేషన్ పెట్టుకోవాలి తప్పదు. చదువు పూర్తిఅయిన తర్వాతనే...అవన్నీ... అప్పుడు నీ ఇష్టం. కాదంటే అప్పుడడుగు."

"నీవు చాలా మొండిదానివి కోమలీ. అనుకున్నది సాధించి తీరతావు."

"ఎంత మొండిదాన్ని కాకపోతే మొగుణ్ని వదిలేసి వస్తాను చెప్పు. పైగా సిగ్గులేనిదాన్ని కూడా, కాకుండా ఇలా నీ ఇంటికి వస్తానా!"

"నీదయ...నా ప్రాప్తం."

"ఇంక వస్తా హరీ, గుడ్‌బై సో లాంగ్" అంటూ లేచి వచ్చి గది మధ్య నిలబడ్డది. వెళ్ళడానికి మనసు రాక వెళ్ళలేక అతనివేపు చేతులు చాచింది నవ్వుతూ. హరనాధ్ ఆమె దగ్గరకు వెళ్ళాడు. ముఖం వేలితో ఎత్తి పెదాల ముద్దుపెట్టుకున్నాడు. వీపుమీద చేతుల వేసి గట్టిగా అదుముకున్నాడు. ఆపాద మస్తకం, ఆమె శరీరంలోని ప్రతిభాగం స్పర్శానుభూతిని పొందింది. కొన్ని క్షణాలు లోకాన్నే మరచిపోయారు. అంతలో నారాయణ లోపలకు రావడంతో విడిపోయారు.

"హరనాధ్‌గారూ, మీరు ఇంత మిత్రద్రోహులనుకోలేదు" అన్నాడు కటువుగా. అతని కళ్ళు నిప్పులు కురిపిస్తున్నాయి.

"ఏ విషయంలో మిత్రద్రోహం మిస్టర్



యు

నారాయణా?'' సోఫాలో కూర్చుని, సిగరెట్ వెలిగిస్తూ తాపీగా ప్రశ్నించాడు హరనాథ్.

"నేను కోమలిని ప్రేమిస్తున్న విషయం నీకు తెలుసు. నేను ప్రేమిస్తున్న ఆ కోమలిని నువ్వు అనుభవిస్తున్నావ్. ఇంతకన్న ద్రోహం, మిత్రద్రోహం ఏం కావాలి. నీవు సరే చెడిపోయావు. కానీ కోమలి ఇంత నీచంగా, బజారు మనిషిలా ప్రవర్తిస్తుందనుకోలేదు."

కోమలినాగులా బుసకొట్టింది.

''మిస్టర్, మాటలు సవ్యంగా రానివ్వండి నీచం! ఏమిటయ్యా నీచం. నాలో ఏం నీచం చూశావ్. అసలు నువ్వెవరు, నన్ను విమర్శించడానికి. నీతో కులికితే పవిత్రురాలిని అవుతానాని. నేను హరిగార్ని ప్రేమిస్తున్నాను. వారూ నన్ను ప్రేమిస్తున్నారు. ఇది మా స్వవిషయం. ఎవరూ ఏడవనవసరం లేదు. మళ్ళీ నోరు జారావంటే, డెంటిస్ట్ దగ్గరకు వెళ్లవలసి వస్తుందని గుర్తుంచుకో."

ఆమె రూపాన్ని చూచి వణికిపోయాడు నారాయణ.

"నువ్వు కులటవు,పచ్చి వ్యభిచారివి. మా స్నేహితుని మోసంచేసి వలలో వేసుకున్న వగలాడివి'' అరిచాడు.

"మిస్టర్, అందని పళ్ళు పులుపు. నీవు కోరిన ఆడది ఒప్పుకుంటే పతివ్రత, ఒప్పుకోకపోతే పతిత... అంతేగా...''

"నన్ను అవమానిస్తున్నావ్."

''నిన్నా...అవమానించటం కాదు. మనిషివనీ, ఇందిర ఫ్రెండ్‌వనీ ఈ మాత్రంగౌరవించాను...యూ బ్రూట్."

విస విసా వెళ్ళిపోయింది. వెనక్కి తిరిగి కూడా చూడలేదు. హరనాథ్ పిలుస్తున్నా వినిపించుకోలేదు.

''నేను వస్తాను, హరనాథ్. మళ్ళీ నీ గడపతొక్కను. మీరిద్దరూ నన్ను మోసంచేశారు. అవమానించారు. నా హృదయాన్ని ముక్కలుచేశారు.''

''ఇందులో ఒకరు చేసిన మోసం ఏం లేదు. నిన్ను నీవే మోసంచేసుకున్నావ్."

"పోనీలే...వస్తా...గుడ్‌బై''అంటూ వెళ్ళిపోయాడు నారాయణ.

ఆ రాత్రంతా నారాయణగురించి ఏడ్చింది కోమలి. అమృతంలో విషం చిందించాడు రాక్షసుడు అనుకున్నది. అతని మాటలకు బాధలేదు. కానీ ఇందిరకు తెలిస్తే ఎంత బాధపడుతుందో! హరనాథ్ తాను గాఢంగా ప్రేమించుకున్నారు గనక,ఎవరు ఎన్ని అనుకున్నా బాధలేదు. ఇందిర అలాకాదు. తను ప్రేమిస్తున్నది. అతను మోసంచేస్తున్నాడు. ''భగవాన్, ఇందిరను రక్షించు'' అనుకున్నది.

(సశేషం)




'అమ్మబాబోయ్...ఎంతపని చేశాను... నిక్షేపంలాంటి ఉద్యోగానికి రాజీ నామా యిచ్చానే...ఈ ప్రాక్టీసేమిటి... నేనేమిటి ... నాకెవరు కేసులిస్తారు...' ఊహించుకుంటూ ఆనందరావు ఆయాస పడుతున్నాడు.

'ఏమిటోయ్ ఆలోచనల్లో వున్నట్టు న్నావ్ ... నిన్నే ... పిలుస్తుంటే విన పట్టంలా...' కొంచెం బలంగా నే, ఆనందరావు వీపును చరిచాడు వాసు.

ఉలిక్కిపడి 'ఏమిటా మోట సరసం ... వెన్నంతా నెప్పెట్టింది గాదు టోయ్...' మొహం చిట్లించాడు ఆనంద రావు, ఎడంచేత్తో, వీపును, నిమురు కుంటూ.

శారద, పకపకా నవ్వింది ప్రక్కనే నిలబడి.

'మనవాడు ఆంజనేయస్వామంత వాడు. అంటే హనుమంతులవారు, తన శక్తిని తాను తెలుసుకునేవాడుకాదుట, యితరులు చెప్పేదాక...' వాసు, మొహం యింత వెడల్పుచేసుకుని దీర్ఘంగా, ఆనందరావు మొహంలోకి చూస్తున్నాడు.

'నీ కసలు మంచి మాటలు రావేంటి...' కసురుకున్నాడు, ఆనంద రావు.

'చూడు శారదా, నేనేమన్నానని... అసలు యింతకీ దిగులుపడాలసిన అవసరం యేమిటి...ప్రాక్టీసుపెట్టి యెన్నాళ్ళయిందని. అయినా, మనవాడు న్యాయవాదివృత్తి చేపట్టినట్టు పదిమందికి తెలియాలిగా మరి ... అదీగాక, అడపా, తడపా, ఒకటీ అర కేసులు తెస్తుంటే, ఛా ఫో అని విదిలించుకుంటాడా! అసలు యేమిటి యితని మనస్తత్వం నాకర్థం కావటంలేదు... నడుంమీద చెయ్యిపెట్టుకుని తలపైకెత్తి, ఆనందరావు మొహంలోకి అదేపనిగా చూస్తూ నిలబడ్డాడు వాసు.

'అద్దెకుంటూ, ఏడాదిబట్టీ అద్దె యివ్వకండా, ఆ యింట్లోనే తిష్ఠవేసుకుని కూర్చుని, యజమాని, యిల్లుఖాళీ చెయ్యమని దావావేస్తే, ఆ కాగితాలు పట్టుకుని, నా దగ్గరకు తీసుకొస్తావా, ఆ కిరాయివాణ్ణి. వాడి తరఫున నేను కోర్టులో వాదించాలా. ఇదేగా నువ్వు తెచ్చిన కేసు...'

'కోర్టునుంచి సమ్మన్స్ వచ్చింతర్వాత కూడా, కేసులేదంటావేమిటో, యిదెక్కడ కర్మంట! అయ్యో రామచంద్ర! కేసే లేకపోతే ఆ యజమాని, రామబ్రహ్మంమీద దావా యెందుకు వేస్తాడంట. నీకామాత్రం తెలీకపోతే యెట్లా!...'

'అద్దె యెగ్గొట్టేవాళ్ళనీ, ఇళ్ళు ఖాళీ చెయ్యనివాళ్ళని ప్రోత్సహించమంటావ్! అంతేనా నువ్వనేది...'

'అసలు నీకు చెప్పలేక నాకు మతిపోతోంది ... నువ్వన్నా చెప్పవమ్మా శారదా మీ ఆయనకు...'

శారద కిలకిల నవ్వుతూ లోపలికి వెళ్ళిపోయింది.

'నా అంతరాత్మకు విరుద్ధంగా ప్రవర్తించమంటేమాత్రం నాకు చేతకాదు. నువ్వేదయినా చెప్పు...కష్టాలకు ఓర్చి, తన జీవితమంతా ధారపోసి, డబ్బుఖర్చుపెట్టి, చదువులు చెప్పించి, యింత పెద్దవాణ్ణిచేస్తే, వాడు యీనాడు తండ్రిమీద దావావేస్తాడా? నేనేమో, ఆ కొడుకు వకాల్తాపుచ్చుకుని, తండ్రికి యెదురుగా కోర్టులో నిలబడాలా? యిదేగా నీ సలహా ... ఇలాంటి పనులు చస్తే చెయ్యను ... 'నిక్కచ్చిగా అనేశాడు ఆనందరావు, చాలా ఉద్రేకంగా.

'ఇహ నిన్ను బాగుచేయటం మాచేత కాదు. నీ కర్మ నీదే. నేనుమాత్రం ఏంచెయ్యగలనేంటి!...' నిస్పృహగా కూలబడ్డాడు వాసు.

ఆనందరావు కాసేపాగి, తమాయించుకుని, మెల్లిగా వాసుదగ్గరకు వెళ్ళి వాసూ అంటూ పిలిచాడు. అతను మాట్లాడలేదు.

'శారదా, వాసుకు నిజంగా నా మీద కోపం వచ్చింది. కొంచెం కాఫీ తీసుకురా...'

'నీ మీదకాదు. నా మీద నాకే కోపం వస్తోంది. ఎందుకు ఉద్యోగానికి రాజీ నామా చెయ్యమన్నానా ? ఎందుకు యీ వృత్తిలోకి దింపానా అని చొరవ, తెలివి తేటలు వున్నాయి, ఆ ఆఫీసులో ఫైళ్ళ ముందర, యెన్నాళ్ళని కూర్చుంటావ్. ఎడ్వకేట్‌గా, బాగా షైన్ అవుతావని అనుకున్నాగాని, నువ్విట్లా చేస్తావని, నే కల్లోకూడా అనుకోల ...' వాసు చాలా సీరియస్‌గా, తన బాధను వెళ్ళ బుచ్చుకుంటున్నాడు.

'కాఫీ తీసుకో ...' శారద చేతిలో కప్పును, వాసుకు అందించాడు, తాను కూడా మరొకటి తీసుకుంటూ.

శారద, యిద్దరి మొహాల్లోకి, క్షణ కాలంచూసి, ముక్కుదూలాన్ని, కిందకు పైకి ఊగించి, గిర్రున తిరిగి వెళ్ళి పోయింది.

'ఎవరు మనదగ్గరకొచ్చినా, న్యాయం కోసమేవస్తారు. ఆ న్యాయమే కోర్టులో జరిగేటట్టు చూడాలి. అంతే నీ ధర్మం. తర్వాత నీ యిష్టం...' వాసు చప్పున గబగబ వాకిట్లోకి నడిచాడు.

పిలుద్దామనుకుంటూకూడా, పిలవ లేకపోయాడు. ఆనందరావు, వాసు వైపుకేచూస్తూ, ఆలోచనగా నిలబడ్డాడు. మనస్సు ఊగిసలాడుతోంది. ఆందోళ నగా వుంది. ఆలోచిస్తున్నకొద్దీ, తన భావాలకే, తనకే వ్యతిరేకంగా సమా ధానాలు వస్తున్నాయి. ఎట్లా నిర్ణయించు కోవాలో అర్థంకావటంలేదు.

పొద్దు వాలింది. వాకిలిగేటు తీసినట్టు చప్పుడయింది. ఆఫీసుగది కిటికీలోంచి తొంగిచూశాడు. ఎవరో తనింటికే వస్తు న్నట్లు గమనించాడు ఆయన వాలకం చూస్తుంటే, ఆనందరావు లోపల లోపల సంతోషపడుతున్నాడు చూస్తూ, చూస్తుండగానే, ఆయన లోపలికి రానే వచ్చాడు.

'నమస్కారమండి...తమరేనా ఆనందరావుగారు?...'

'మాది రేపల్లె తాలూకా అండి. మేం నలుగురం అన్నదమ్ములం. పెదపులి వర్రు పొలాల సంగతి, మీరు యినే వుంటారనుకుంటా... మా పొలం కాజెయ్యాలని, ఆ పున్నయ్య మా మీద అనవసరంగా దావా యేశాడు. నాయం యెక్కడికి పోతుంది. మేం గెలిచాం... అయితే ఆడు ఐకోర్టులో అప్పీలు పెట్టాట్ట ... మీ బోర్డుచూసి వచ్చా ...' వస్తున్న తుమ్మును ఆపుకోవటానికి సతమతమవుతున్నాడు ఆ వచ్చిన ఆసామి.

ఆనందరావుకు ముచ్చెమట్లు పోస్తు న్నాయి. జేబురుమాల్తో మొహాన్ని తుడుచుకుంటూ, రొప్పుతున్నాడు

తలుపుప్రక్కనే నిలబడి అంతా వింటూవున్న వాసు, కళ్లు పెద్దవిచేసు

కుంటూ 'శారదా రొట్టెవిరిగి నేతిలో పడింది' అన్నాడు మెల్లిగా.

శారద, మూతికి చెయ్యిఅడ్డం పెట్టుకుని, బలవంతంగా నవ్వాపుకుంటోంది.

ఖంగునతుమ్మి, రెండో తుమ్ముకోసం నిరీక్షిస్తున్నట్లు ముక్కుకు ఎడంగా బట్ట అడ్డంపెట్టుకుని, తల పైకీ క్రిందకు ఊగిస్తున్నాడు వచ్చిన ఆ పెద్దమనిషి.

ఈ సస్పెన్సేమిటి మహాప్రభూ అనుకుంటూ, కళ్లార్పకండా, ఆయనవైపుకే చూస్తూ, ఆయన నోట్లోంచి ఏంమాట వస్తుందో అన్నట్లు, మహా యిరకాటంగా కూర్చున్నాడు ఆనందరావు.

తుమ్ముఆగిపోయినట్టుందీ, ముక్కును సాగదీసుకుంటూ,

'ఇంతకీ తమదగ్గరకొచ్చిందెందుకంటే మళ్ళీ ఆయాసపడి నరసయ్యచౌదరిగార్ది పెద్దవకీలుట, ఆ రెక్కడుంటారో కాస్త శలవియ్యండి...నాకా యీ పట్టణం కొత్త...'

ఆనందరావు తల గిర్రున తిరిగింది.

'శారదా, మంచినీళ్లు' అని బిగ్గరగా అరవబోయి, మళ్ళీ వెనక్కుతగ్గి, 'నాకు తెలీదండీ' అని గట్టిగా నొక్కి మరీ అన్నాడు.

'అయితే !...'

'అయితేలేదు గియితేలేదు' పళ్లు పటపటమనిపించాడు ఆనందరావు.

'ఈయన మహాశోపిష్ఠిలాగా వున్నాడే' సణుక్కుంటూ బైటకు నడిచాడు ఆ ఆసామి.

గభాలున శారద, పెద్ద గ్లాసునిండా మంచినీళ్లు తీసుకొచ్చి, మెదలకండా టేబుల్‌మీదపెట్టి, కిక్కురుమనకండా లోపలికి వెళ్లిపోయింది.

ఆనందరావు, భార్యవైపుకు కొరకొరచూస్తూ, గ్లాసుడు నీళ్లుతాగేశాడు. వాసు, తలవంచుకుని, చేతులు రెండూ దగ్గరకు తీసుకుని, చప్పుడుగాకండా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ, మెల్లిగా బైటకు దారిపట్టాడు. ఆనందరావు తుమతుమలాడుతూ అట్లాగే కూర్చున్నాడు

రోజురోజుకు ఆయన మనస్సు గజిబిజయిపోతోంది. ఎంత ప్రయత్నం చేసినా, తన అంతరాత్మకు విరుద్ధంగా, యేమీ చెయ్యలేకపోతున్నాడు. చెయ్యటానికి యిష్టపడటంలేదు. ఎన్నో అవకాశాలు వచ్చినట్లు వస్తున్నాయేగాని, తీరా గట్టిగా పట్టిచూస్తుంటే, ఏ ఒక్కటీ నిలవటంలేదు ఉక్రోషం యెక్కువయిపోతోంది. తనను ఎగతాళిచేసే వాళ్ళందరికి చక్కటి గుణపాఠం చెప్పితీరాలి అని ఉద్రేకపడుతూవుంటాడు. వాసు మాత్రం తన పట్టు విడవటం లేదు. సమయందొరికినప్పుడల్లా, నీతిబోధనలతో ముంచెత్తేస్తూ వుంటాడు. ఉచిత సలహాలు యివ్వటంమాత్రం మానలేదు.

ఆనందరావుకు రాత్రిళ్ళు నిద్రపట్టటం

లేదు. పగలేమో చాలా అలసటగానూ, బాధపడుతున్నట్లుగా, కనిపిస్తాడు. మొహమంతా యింతచేసుకుని, గంటల కొద్దీ, యెవ్వరితో మాట్లాడకండా, ఒంటరిగా, ఆలోచిస్తూ కూర్చుంటాడు.

'అవును వాసు చెప్పింది నిజమే. యీ వృత్తిలో న్యాయం, అన్యాయం అని విడివిడిగా చెప్పలేం. అంతా ఒకటిగానే కనిపిస్తుంది. అయినా, యేది న్యాయమో, యేది అన్యాయమో మనకుమాత్రం యేం తెలుస్తుంది. కోర్టువారు నిర్ణయించేదే న్యాయం. మన దగ్గరకువచ్చిన పార్టీ కథనమే సత్యం. అలాంటప్పుడు ఎవ రొచ్చినా కాదనేదిలేదు. మన వృత్తి ధర్మం నెరవేర్చాల్సిందే. మన బాధ్యత ల్నుంచి మనం తప్పించుకోకూడదు...' తీవ్రంగా మధనపడుతూ పట్టుదలగా ఓ నిర్ణయానికి వచ్చేస్తున్నాడు ఆనందరావు

అప్పటినుంచి హుషారుగా, ఆనం దంగా, ఉల్లాసంగా, హాయిగా, తేలిగ్గా కనిపిస్తున్నాడు. ఆయనలో వచ్చిన మార్పు స్పష్టంగా తెలుస్తూనే వుంది. వాసు యిట్టే గ్రహించేశాడు కూడా. ఫరవాలేదు యిహ రైలుపట్టాలమీద కొచ్చేసింది అనుకున్నాడు మనస్సులో వాసు.

పగటి వెలుతుర్ని, మెల్లి మెల్లిగా సంధ్యచీకటి, కబళిస్తూ వస్తుంటే, వీధి లైట్లు గప్పున ఒక్కసారి వెలిగినాయి. చీకటంతా మటుమాయమయిపోయింది ఆనందరావు గతుక్కుమన్నాడు. చప్పున ఉలిక్కిపడి టైముచూసు కున్నాడు. చాలాసేపటినుంచి కూర్చు న్నానే అనుకున్నాడు. బద్ధకంగా కుర్చీ లోంచి లేచి, రెండుచేతులూ రెండు వైపులకూ గట్టిగా విదిలించాడు కాసేపు బజారు వెళ్ళదామనే ఆలోచనతో, లోపలికి తొంగిచూస్తూ, భార్యను పిలవ బోయి, వీధి తలుపు చప్పుడయినట్లు అలికిడి విని, కళ్ళు పెద్దవి చేసుకుని చూశాడు ఇద్దరు వ్యక్తులు. పూర్తిగా అపరిచితమైన వ్యక్తులు లోపలికి వస్తున్నారు.

ఇంగ్లీషులో, 'లోపలికి రావచ్చా' అని అందులో ఓ వ్యక్తి, గుమ్మంముందు నిలబడి అడిగాడు.

ఆ భాషలోనే లోపలికి రండి అని జవాబిచ్చాడు ఆనందరావు.

ఇద్దరూ వచ్చి కూర్చున్నారు.

'మమ్మల్ని శ్రీనివాసరావుగారు పంపించారు నా పేరు రామనాథం. ఈయన మా స్నేహితుడు వెంకట్రావు గారు, సెక్రటేరియట్‌లో పనిచేస్తు న్నాడు ఇంతకీ నేవచ్చిన పనేమిటంటే, నా భార్యకు డైవోర్స్ యివ్వాలని, నిశ్చయించుకున్నాను. దీనికి మీ సలహా కావాలి. ఎంత త్వరగా యిప్పిస్తే అంత మీకు కృతజ్ఞతగా వుంటానని, నేను హంబుల్‌గా రిక్వెస్ట్ చేస్తున్నాను. ఫీజు

విషయం, మీతో శ్రీనివాసరావుగారు మాట్లాడతానన్నారు...' గుక్కతిప్పు కోకండా చెప్పేశాడు రామనాథం.

ఆనందరావు ఓ క్షణం తటపటాయించి, 'సరే' అన్నట్టు తలవూపి వివరాలు చెప్పండి. అసలు ఏ కారణంమీద మీరు డైవోర్స్ అడుగుతున్నారు. సీరియస్‌గా, ఆయన వంక చూస్తూ, 'రైటింగ్ పాడ్'ను ముందర పెట్టుకుని, గబగబ పెన్ కేప్ తీసేశాడు.

'ఏమిటీ నా నోటితోనే చెప్పాలా' కస్సుమన్నాడు రామనాథం

ఆనందరావు కూడా ఆ క్షణంలో ఉగ్రుడయిపోయాడు మళ్ళీ కోపాన్ని యిట్టే అణచుకుని. 'హిందూ మారేజ్ ఏక్ట్, పదమూడవ సెక్షన్ ప్రకారం, ఎనిమిది సందర్భాలలో మగవాడయితే డైవోర్స్అడగచ్చు అందులో మొదటిది, భార్య శీలం సరిగ్గా లేకపోతే, మతం మార్చుకుంటే, పిచ్చిదయితే...' గబగబ చెప్పుకుపోతున్న ఆనందరావు చప్పున ఆగిపోయాడు, రామనాథం, హఠాత్తుగా, ఆపండి నాకు పిచ్చెత్తేటట్టుంది, అనేటప్పటికి.

'మీరన్నారే మొదటిది అదే అచ్చంగా అదే అంతకంటే నే చెప్పేది లేదు, మీరడగాల్సిందీ లేదు. నా వివరాలు తీసుకోండి. ఏం పిటీషన్ తయారు చేస్తారో యేమో, అది మీరు చూసుకోండి మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వచ్చేసి, ఆ కాగితంమీద సంతకం పెట్టేసి, మీ ఫీజు యిచ్చుకుంటాను...' అమాంతంలేచి నిలబడ్డాడు, రామనాథం.

'కూచోండి. గట్టిగా గదమాయించాడు, ఆనందరావు. రామనాథం బిత్తరు చూపులు చూస్తూ, చప్పున కూర్చున్నాడు

'మీరనుకున్నంత సులభంగా జరిగే పనికాదు. నాక్కావలసిన వివరాలు మీరు చెప్పకండా, అట్టా మీరు పారిపోతుంటే, నేను పిటీషన్ తయారుచెయ్యటం ఎట్లా, ఆమెగారి శీలాన్ని శంకించటానికి తగిన ఆధారాలేమన్నా వున్నాయా ? ఎప్పటి నుంచీ, ఆమె ఆ ప్రవర్తనకు అలవాటు పడింది. ఇప్పుడు కూడాఅది కొనసాగిస్తోందా...'

రామనాథం కొయ్యబారిపోయాడు. అట్లాగే ఆనందరావు మొహంలోకిచూస్తూ కూర్చున్నాడు. ఇంతలోకి వెంకట్రావు అందుకుని, 'మీరు వేసే ప్రశ్నలు, లా ప్రకారం సరియైనవి కావచ్చేమోగాని, మా రామనాథంమాత్రం, వాటికి సమాధానాలు చెప్పలేడు. ఇంకా మీరు యే ఒక్క ప్రశ్న వేసినా, అతను భరించలేడు. దయచేసి, 'లా'లో ఏ ప్రకారమయితే విడాకులకు వీలుంటుందో అవన్నీ రాసేసి, తయారుగా వుంచండి మాకు యీ మాత్రం సహాయంచేసి పెట్టండి' పాధేయపడ్డట్టుగా అన్నాడు

ఆనందరావుకు ఎటూ తోచలేదు.

క్షణంసేపు ఆలోచించి, సరే 'మీరు యెల్లుండి సాయంత్రం యిదే టైముకు రండి' అన్నాడు ముక్తసరిగా.

రామనాథం చెయ్యిపట్టుకుని, వెంకట్రావు, మెల్లిమెల్లిగా అడుగులు వేసుకుంటూ బైటకు నడిచాడు.

ఆనందరావు, నుదురుమీద చెయ్యి పెట్టుకుని, తీవ్రంగా మథనపడుతున్నాడు. చివాలున కుర్చీలోంచి లేస్తాడు, మళ్ళీ చప్పున వచ్చేసి కూర్చుంటాడు కళ్లు గట్టిగా మూసుకుని, పళ్లు బిగించి చాలా ఆరాటపడుతున్నాడు. క్షణంలో కళ్లు గభాలున తెరుచుకుని, తానేదో నిర్ణయానికి వచ్చినట్లు సంతృప్తి పడుతున్నాడు. కాని బైటకుమాత్రం, తాను పడుతున్న ఆందోళన, ఎవ్వరికీ తెలిసేటట్లుగా ప్రవర్తించటంలేదు.

అనుకున్న ప్రకారం, రామనాధం వచ్చినప్పుడు, 'పూర్తి బాధ్యతంతా నా మీద పెట్టారు, అందుకని యింకొంచెం టైముకావాలి' అని పంపించేశాడు, ఆనందరావు.

ఓ కంట కనిపెడుతున్న వాసుకు యిదంతా అగమ్యగోచరంగా వుంది చప్పున పిటీషన్ తయారుచేసి, ఫీజు తీసుకుని, అతన్ని పంపించేసెయ్యక, యెందుకు యిట్లా తిప్పిస్తాడు అని, చిరాకుపడుతున్నాడు. అయితే, తాను యీ కేసులో జోక్యంచేసుకోవటం యిష్టం లేక మెదలకండా వూరుకుంటున్నాడు. దానికి కారణం కూడా ఒకటి లేకపోలేదు. అసలు నిజానికి, రామనాధాన్ని, ఆనందరావుదగ్గరకు పంపించింది, వాసే. తీరా, తాను పంపించానని తెలుస్తే, ఏ విధంగా పరిణమిస్తుందో అని, శ్రీనివాసరావు పంపించినట్లు చెప్పించాడు. రామనాధానికి మతిపోయి, యిక డైవోర్స్ తప్పదని ఖాయంచేసుకున్నసమయంలో, ఆంతరంగికుడయిన ఓ లాయర్ని 'సెలెక్ట్' చేసుకోవాలనుకున్న సందర్భంలో, వాసు తారసిల్లాడు. అతనికి ఆంతరంగికుడు ఆనందరావు కంటె యింకెవరున్నారు కనక ! ఆ కేసు కాస్తా యిట్లా వచ్చేసింది అందుకనే వాసుకు క్షణక్షణం ఆదుర్దాగానే వుంది. రోజులు గడుస్తున్నకొద్దీ, వాసుకు చాలా భయంగానూ, గాభరాగానూ వుంది. ఓ మూల రామనాధం సూటిపోటీ మాటలతో సతమతమయిపోతున్నాడు. ఇటేమో తీరా, ఆనందరావు, చివ్వరికి యేంచేస్తాడో అని గజగజలాడిపోతున్నాడు.

ఈసారి రామనాధం, ఒంటరిగానే వచ్చాడు అయితే అంత ధూకుడుగా మాత్రంరాలేదు. చాలా తగ్గి, మాట్లాడుతున్నాడు. ఆనందరావు, అతనితో చాలాసేపు మాట్లాడాడు చాలా నెమ్మదిగా మాట్లాడటంచేత, తలుపుచాటున నిలబడినా కూడా, వాసుకు ఆ సంభాషణ యేమీ అంతుపట్టలేదు.

మర్నాడు వస్తూ వస్తూనే, వాసు



అమాంతం, ఆనందరావుమీద విరుచుకు పడ్డాడు

'నువ్వింత పనిచేస్తావని నే కల్లో కూడా ఊహించలేకపోయాను. రామనాథం భార్య తరపు ప్లీడరుతో నీకేమిటి సంబంధం. ఆయనతో నువ్వు గంటల తరబడిమాట్లాడటం, చూస్తూంటే నువ్వు బాగా దిగజారిపోయావని, మనిద్దరికీ తెలిసినవాళ్లే నాతోవచ్చి చెప్పారు ఇంకా వాళ్ళేవేవో చెప్పారనుకో, వాటిని నేను నమ్మలేదు...'

'ఏం చెప్పారేమిటి !...'

'వినాలని వుందా, నువ్వు అవతల పార్టీదగ్గర డబ్బుతీసుకుని, రామనాథానికి అన్యాయం చేస్తున్నావని కూడా అన్నారు...తెలిసిందా !...'

'మనమంతా దొరకని దొరలం !... పెద్దపెట్టున నవ్వాడు ఆనందరావు.

'అయ్యో అయ్యో ! ఏమిటామాటలు. అయితే వాళ్ళన్నది, నేను విన్నదీ నిజమేనన్నమాట...'

'ఒక్కటిమాత్రం గుర్తుంచుకో. నేను రామనాథానికిమాత్రం చస్తే అన్యాయం చెయ్యను నన్ను ఎవరేమన్నా, నాకేం ఫరవాలేదు. నేను నమ్మకద్రోహిని మాత్రంకాను, కాజాలను, కాబోను...' చాలా సీరియస్‌గా, వాసు మొహంలోకి చూస్తూ అన్నాడు.

వాసు, శారద దగ్గరకువెళ్ళి మొర పెట్టుకున్నాడు. 'నన్ను తలెత్తుకోకండా చేసేస్తున్నాడు. ఇంత యిదిగా మారిపోతాడని అనుకోలేదు. రామనాథం నన్ను ఒకమాట అని ఒకమాట అనకండా వుండటంలేదు. ఆయనకేమి సమాధానం చెప్పాలో అర్థంకావటంలేదు. చివ్వరికి యేంచేస్తాడో యేమో అని భయంగా వుంది. తీరా యీ కేసు నేనే ప[illegible]పింపె నట్టు తెలిస్తే, యింకేవిధంగా మారుతుందో అనే అనుమానంతో నలకండా వూరుకుంటున్నాను. నాకేం తోచటం లేదు...' అంటూ వాసు ఏవేమిటో చెప్పుకుంటూ పోతున్నాడు.

ఒక్కక్షణం, నిలబడ్డట్టే నిలబడి, అప్పుడే శారద, లోపలికి వెళ్లిపోయింది వాసు తలెత్తిచూసేటప్పటికి, ఆమెలేదు. గతుక్కుమని, అటూ యిటూ బిత్తరచూపులుచూస్తూ, గబగబ, ఆనందరావు గదిలోకి వచ్చాడు.

అప్పుడే రామనాథం, ఘర్షణగా మాట్లాడి, చరచరా బైటకు వెళ్ళిపోతున్నాడు. వాసుకు కాళ్ళూ, చేతులు ఆడలేదు. ముందుకు ఒకడుగువేసికూడా, మళ్ళీ చప్పున ఆగిపోయాడు.

'చూడు ఆనందరావు! నేనేమేమో అంటున్నానని అనుకోవద్దు. నా మీద దయతలిచి, యీ కేసులోమాత్రం నువ్వు అవతల పార్టీతో ...' నీళ్లు నములుతున్నాడు వాసు

'ఏమిటి ఈ కేసు స్పెషాల్టీ!...'

'అబ్బే అదేంలేదు' ... 'ఎట్లాగా చెప్పటం' అని తనలో తాను ఉక్కిరిబిక్కిరయిపోతున్నాడు.

'ఈ ప్రొఫెషన్‌లో దిగినంతర్వాత అన్నిరకాలపనులు చెయ్యాలిసివస్తుంది. వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోవటంలో, మన గొప్పతనంయేమిటి! మనకు కావాలంటేమాత్రం యిలాంటి అవకాశం ఎప్పుడూ దొరుకుతుందా...'

'ఎలాంటి అవకాశం...' బిగ్గరగా అరిచాడు వాసు.

'ఏమిటట్లా ఉద్రేకపడ్డావ్ ... ఎట్లా వుంది నీ వంట్లో...శారదా...' అంటూ వాసుచెయ్యిపట్టుకుని వీపుమీద మెల్లిగా చరుస్తున్నాడు.

'నాకేంలేదు...నాకుబాగానేవుంది... ఏంలేదు శారదా...ఊరికే పిలిచాడు. నీ పని చూసుకో...' వాసు, ఉద్వేగాన్ని అణుచుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

మర్నాడుకూడా వాసు, ఆనందరావు యింట్లోనే వుండిపోయాడు. బైటకు వెళ్ళాలంటే, బెరుకుగా వుంది తలవంపులుగా వుంది రామనాథం, ఏమంటాడో అని జంకు ఇంకా ఆనందరావును గురించి, ఎలాంటిమాట వినాలిసివస్తుందో అని బెదురు, అంతకంటె కూడా తనను ఎవరేమంటారో అనే భయంకూడా లేకపోలేదు




గడియారం సాయంత్రం ఆరుగంటలు ఖంగుఖంగున కొడుతున్న సమయంలో ఆనందరావు వీధిగేటు తెరుచుకుని, చెంగుచెంగున లోపలికి వచ్చేశాడు, సంతోషంగా. వాసు ఆనందరావువైపుకే తల తిప్పుతూ, ఒదిగిఒదిగి, గదితలుపుచాటున నక్కివున్నాడు. ఇంత ఆనందానికి, యేమిటా కారణం అని వూహించుకుంటూ.

'శారదా ... గుడ్‌న్యూస్ ... రామనాథం భార్య చెడ్డదేమికాదు...గిట్టనివాళ్లు వాళ్ళిద్దర్నీ విడదియ్యాలని చేసిన ప్రయత్నం ... ఓపికపట్టి, నిజాన్ని బైటకు తీశాను అదొక పెద్ద కథ, సావకాశంగా చెపుతాను ... ఇప్పుడిద్దరూ కలిసిపోయారు...డైవోర్స్ పిటీషన్‌క్లోజ్... రామనాథానికి ఎంత సంతోషంగా వుందో చెప్పటానికి వీల్లేదు ... ఆ నూతన దంపతుల్ని మనింటికి భోజనానికి పిల్చాను... ఏమిటి అట్లా చూస్తున్నావ్ ... నీకేమి అర్థంకాలేదా ... మూగదానిలాగ అట్లా వుండిపోయావేంటి, మాటా పలుకూ లేకండా...నన్నే...శారదా...'

'అయితే ఈ కేసుకూడా పోయిందన్నమాట...' కళ్లు నలుపుకుంటూ గద్గదంగా అన్నది శారద.

———




"శేఖర్ లేచాడా నర్స్!"

డాక్టర్ ప్రకాశం నడక నర్స్ రేఖకి వినపడినట్లే లేదు. అందుచేతనే, అతను వచ్చి తన నావిషయం అడిగేదాకా ఆమె కతని రాక తెలియనేలేదు... కిటికీలోంచి బయటికి చూస్తూ, నెమ్మదిగా పడుతోన్న చినుకులూ, నల్లగా కొండల మీద వ్రేలాడుతూన్న బరువైనమేఘాలూ, చుట్టూ బలిసి అలుముకున్న చెట్లూ, ఆమె చాలా బలంగా ఆకర్షించినట్లు చూస్తూ, లీనం అయిపోయిం..

ఒక్కసారి ఈ సాగిపోతున్న ఆలోచనలనించి తేరుకుని నర్సు లేచి నిలబడి, "గుడ్‌మార్నింగ్ డాక్టర్," అన్నది

"మార్నింగ్ రేఖా ... శేఖర్ లేచాడా."

'లేదు ..."

"టెంపరేచర్ . "

"సబ్‌నార్మల్‌గానే ఉంది – ఇప్పుడు. ఉదయంనించీ కొంచెం రిసీడ్ అయి తిరిగి రైజవుతోంది..."

"చార్ట్–"

రేఖ త్వరగా గదిలోంచి బయటికి నడిచింది–రెండో గదిలో శేఖర్ ఉన్నాడు ఒక్కసారి అతని ముఖంలోకి

చూసి, చార్ట్ తీసుకుని, డాక్టర్ గదిలోకి వెళ్లింది.

డాక్టర్ ఏదో ఆలోచిస్తూ, కిటికీలో నించే బయటికి చూస్తున్నాడు. రెయిన్ కోట్‌నించి పడుతోన్న నీటిదారలు చుక్క-చుక్కా కలిసి చిన్న ప్రవాహంగా అయి డాక్టర్ జోళ్ళకిందికి పోతున్నై... బహుశా డాక్టర్‌ని ఆ దృశ్యం-కిటికీలో నుంచి-ఆకర్షించి ఉంటుంది...తన్మయుడైనట్లు చూస్తున్నాడు!

ఒకటి-రెండు...నాలుగు నిముషాలు.

వర్షం క్రమంగా జోరవుతూంది. కొద్ది చినుకులు కిటికీలోంచి పడగానే డాక్టర్‌కి తెలివి వచ్చినట్లు ఉంది ... త్వరగా కిటికీనించి దూరంగావస్తూ "అప్పన్నా! వచ్చి తలుపువెయ్యి!" అని కేక వేశాడు.

ఆ చిన్న హాస్పిటల్‌లో ఒక మూల కూర్చుని ముసిలి అప్పన్న కునికిపాట్లు పడుతున్నాడు...నర్స్‌కి తెలుసు. ఆమె చేతిలోని చార్టు టేబిల్‌మీదవుంచి కిటికీ దగ్గరికి వెళ్ళి తలుపులు మూసింది.

"వాడు - వట్టి బద్ధకస్థుడై పో తున్నాడు..." గొణిగాడు డాక్టర్.

"ముసిలాడు..."

నాలిక కరచుకొంది రేఖ...ప్రకాశం షాక్‌తిన్నట్లు వెనుదిరిగాడు. ఒక్కసారి నల్లటి ఆమె కళ్ళూ, దాహంతో ఉన్న అతని కళ్ళూ కలుసుకున్నాయ్. చాలా సిగ్గుపడుతోన్న రేఖ తన అందాలని దాచుకుంటూన్న కొద్దీ అవి మ[illegible] ప్రస్ఫుటాలు కాసాగాయ్ ... బరువుగ తలవంచుకున్నది రేఖ.

బలమైన డాక్టర్ కండరాలు చాల నీరసపడ్డాయ్.-ఆ మైకంతో...కుర్చీలో కూర్చుంటూ "కూర్చోండి," అన్నాడు

"చార్ట్..."

"ఆ...ఇలా ఇవ్వండి..."

పేరుకిమాత్రం ఆ చార్టుని పరీక్ష చేస్తూ, ''రెగ్యులర్ 'యు' " అన్నాడు ప్రకాశం.

"అవును చాలా అన్‌స్టెడీ," అన్నది రేఖ.

"ఆ మందు, తెలివొచ్చినప్పుడు ఇవ్వండి-ఈవినింగ్ మారుస్తాను."

రేఖ మాటలాడలేదు. అలాగే కూర్చున్నది. కొద్ది నిమిషాలు పైన వర్షపుచప్పుడు తప్పిస్తే మరేమీ లేకుండానే గడిచిపోయాయ్.

"మీ...రెలెటివ్ ఉన్నారా ?"

సాధ్యమైనంత సామాన్యంగా ధ్వనిం చేలా అడిగాడు ప్రకాశం...ఆ ప్రశాంత వాతావరణంలో, కొండలమధ్య మూడు వేల అడుగుల ఎత్తున, ఉన్న ఆ హాస్పిటలు...ఏజన్సీ హాస్పిటలు ఊరు ఉన్న కొంచెమూ అరమైలు దూరంగా ఉన్నది. అందులో ఉన్న నాలుగు ప్రాణాలలోనూ ఒకటి తెలివి తప్పి ఉన్నది; ఒకటి నిద్రపోతున్నది. రెండు జీవాలు—నిండు యౌవనంతో మిస

మిసలాడుతూ, తమ ఉద్యోగధర్మాలని నిర్వర్తించుకోడానికి ప్రయత్నిస్తూ, చేసే పని ఏమీలేక, మాట్లాడుకోసాగాయ్.

"ఉన్నారండీ-"

"మీ...?"

"ఫ్రెండే లెండి...రెలెటివ్ కాదు."

మళ్లా కొద్ది నిమిషాల నిశ్శబ్దం-బరువుగా.

"అతను...ఎలా ఉన్నాడంటారా?"

"ఎవరు?" పరధ్యానంగా అన్నది రేఖ.

"శేఖర్..."

అనుమానం తొణుకుతోన్న కళ్ళతో చూస్తూ, "నాకేం తెలుసు డాక్టర్?-మీకు తెలియాలి," అన్నది రేఖ.

"మీకు—చాలా దగ్గర స్నేహితు డేమో ననుకునేంత అభిమానంగా సేవ చేస్తున్నారు......"

రేఖ ఒక్కసారి తన రెండుకళ్ళనీ డాక్టర్‌వైపు తిప్పి, "మీరనేది-" అన్నది వేడిగా.

"నోనో ... అదికాదు - అందుకని మీతో నిజం చెప్పడానికి కొంచెం సంశ యంగానే ఉంది," అన్నాడు ప్రకాశం.

నర్స్ తన ముఖలక్షణాలని ప్రశాంతం చేసుకోడానికి ప్రయత్నిస్తూ "మీ యిష్టం," అన్నది.

"అతను - చాలా క్రిటికల్‌గా ఉన్నాడు," అన్నాడు డాక్టర్.

ఆ క్షణంలో అతను రేఖ ముఖ లక్షణాలని కనిపెట్టలేదు ... పక్కకి తిరిగి ఉన్నాడు.

"బహుశా రేపు ఉదయానికి..."

"అంత ప్రమాదమా డాక్టర్?"

"అనుకుంటాను ... పల్స్ వీకెన్ అవుతోంది. పీక్స్ క్రమంగా నార్మల్‌కి దూరం అవుతున్నాయ్..." చార్ట్‌లోని కర్వ్ పీక్స్‌నించి ఏక్సిస్‌కి చేత్తో గీతలు గీస్తూ అన్నాడు డాక్టర్

రేఖ ఏమీ మాట్లాడలేదు. ప్రకాశమూ ఏమీ మాటలాడలేదు. వర్షం తగ్గాక ఇద్దరూ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

*     *     *

డాక్టర్ ప్రకాశ్ అక్కడ రెండేళ్ళ నించి పనిచేస్తున్నాడు ... ఏ జన్సీ హాస్పిటల్‌లో, పూర్వం అతను మామూలు డాక్టర్లలాగే ఒక పట్టణంలో ప్రాక్టీసుచేస్తూ ఉండేవాడు. చాలావరకూ అతని ప్రాక్టీసు బాగానే ఉండేది.

తరవాత అతను వివాహం చేసుకున్నాడు లత అతని జీవితంలో అడుగు పెట్టడంతో అతని కష్టాలు ప్రారంభం అయాయి

ఆమెకి సుఖం కావాలి; తన విధి నిర్వహణ ఎట్లాపోయినా. విషయ వాంఛలు విపరీతంగా ఉన్నవాళ్ళని వివాహంలో స్వీకరించాల్సింది డాక్టర్లు కాదు...ఆ పాఠం ప్రకాశం కొంచెం ఆలస్యంగా నేర్చుకున్నాడు.

లత తన కాలమంతా థియేటర్లలోనూ







ప్రయాణాలలోనూ గడిపేది. ప్రకాశం మొదట బాధపడ్డాడు- తరవాత పరిస్థితులకి అలవాటు పడగలిగాడు. లోకం నవ్వసాగింది 'పోనీ' అనుకున్నాడు. తాను ఆమె విషయంలో ఏ విధినీ నిర్వహించలేకపోతున్నాడని అతనికి తెలుసును ఆ జ్ఞానమే అతన్ని పట్టిఉంచి, లతకి పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చింది.

ఒక్క సంవత్సరంలో ప్రకాశం పూర్తిగా మారిపోయాడు — లోకం నవ్వులని వింటూ బాధపడకుండా ఉండడం నేర్చుకున్నాడు. లతని ఒక స్నేహితురాలిగా మాత్రం చూడడం నేర్చుకున్నాడు — ఇంకా, జీవితాన్ని పొడిగా గడపడానికి కావల్సిన పాఠాలని నేర్చుకున్నాడు.

అలాగే గడిచే ఒకరోజున, తాను ఇంటికొచ్చేడు. ఎందుకో అనుకున్నాడు- ఇంటిలో అందరూ గుమిగూడారు. వందలు...లత చచ్చిపోయింది. హార్టు ఫెయిల్యూర్ అనుకున్నాడు తాను... కాని పోస్ట్‌మార్టమ్ 'ఆత్మహత్య' అన్నది.

తల గిర్రున తిరిగింది ... లత ఎందుకు ఆత్మహత్య చేసుకోవాలి ?

కనుచూపు మేరలో ఏ కారణమూ కనిపించలేదు. బహుశా, ఆమె తన ప్రవర్తనకి పశ్చాత్తాపపడి ఉంటుందా ? ...అయినా, ఆ పాశ్చాత్తాపం నిరూపించే పద్ధతి ఇదా ?

అతని కేమీ బోధపడలేదు. కొద్ది రోజులు పోయాక ఆమె డైరీ అతని కళ్ళపడ్డది. తీసి చూశాడు, కొన్ని ఎంట్రీలు......

మార్చి 6 : తిరిగి, ఆ థియేటరులో ఆ యువకుడు — అవును. శేఖరమే. రెండు గంటలసేపూ నావంక చూస్తూనే ఉన్నాడు . . . ఏం చేసేది ? వచ్చేద్దా

మనుకున్నాను. కాని, వెనకాల వస్తాడని భయం వేసింది.

ఏప్రిల్ 1. అతనితో మాటలాడాలని అనుకోలేదు-కాని, బీచ్‌లో కనిపించి పలకరించాడు. పాతరోజు లన్నిటినీ జ్ఞప్తికి తెచ్చాడు. అతని వైఖరిచూస్తే భయంవేసింది. ఉత్తరాల ప్రసక్తి తెచ్చాడు. .ఇచ్చేమని అడిగాను. నవ్వి ఊరుకున్నాడు . . . భగవాన్ . . .ఏమి టతని ఉద్దేశం ?

ఏప్రిల్ 15: ఎవరో ఒకర్ని మోసమైనా చెయ్యాలి; నన్ను నేనైనా మోసం చేసుకోవాలి. నన్ను నమ్ముకున్న ఆయనని మోసం చెయ్యలేను—నా ప్రాణం చేతిలోఉన్న శేఖర్‌నీ మోసం చెయ్యలేను-మృత్యుమార్గమే ఉత్తమంలా ఉంది.

ఏప్రిల్ 18: ఈ సాయంత్రం ఆటకట్టేటట్లు కనిపిస్తుంది జీవించినది చాలు. అతను నన్ను పూర్తిగా చంపాడు.

ఆ రోజునే లత విషం మింగింది.

శేఖర్! . . . శేఖర్—ఎవరది ?

ఆమె కాగితా లన్నీ వెదికాడు ప్రకాశం ఏమీ ఆచోకీ దొరకలా. ఆమె చిన్ననాటి స్నేహితుడల్లే ఉన్నాడు. అంతకన్న అప్పటికేమీ ఆచోకీ దొరక లేదు— ఒక్క విషయం మాత్రం ప్రకాశం పూర్తి అవగతం చేసుకున్నాడు . . . లతని చంపిన దుర్మార్గుడు— అతనని.

తరవాత అక్కడ లేకపోయాడు ప్రకాశం. ఒకసారి ఈ ఉద్యోగానికి అప్లికేషన్లు అడిగారు. తాను అప్లైచేశాడు. ఈ రెండేళ్లనుంచీ ఇక్కడే ఉండి పోయాడు కొండలమధ్య, అడవులమధ్య, ప్రశాంతమైన జీవితం తనని చూసి నవ్వుతోన్న ఆ లోకానికి ఎన్నో వందల మైళ్ల దూరంగా, నాగరికతకి ఎన్నో వందలమైళ్ళ దూరంగా, చీకులేని బ్రతుకు.

అలా బ్రతుకుతోన్న తన జీవితం లోకి మళ్ళా ఈ శేఖర్ వొచ్చాడు. అతను ఆ వూళ్ళో కొద్దిరోజులు ప్రశాంతంగా గడపడాని కొచ్చాడు. మనశ్శాంతికోసం ఒచ్చానన్నాడు. త్వరలో ప్రకాశం, శేఖర్ స్నేహితు లయారు. త్వరలో అతనెవరో తెల్సింది డాక్టర్‌కి.

చిత్రమైన సంఘటన—అనుకున్నాడు ప్రకాశం.

వాన తగ్గింది. చిన్న చినుకులు మాత్రం పడుతున్నాయ్ తడిగాలి బలంగా వీస్తూన్నది.

ప్రకాశం బుర్రలో వెయ్యి ఆలోచనలు బలంగా పనిచేస్తున్నవి. తనని సర్వ నాశనం చేసిన శేఖర్. . . . . .

"అంత ప్రమాదమా డాక్టర్ !"

రేఖ! నవ్వుకున్నాడు . . . ఆమె అతనికోసం ఎంత తహతహలాడు తూందో తనకి తెలీదనుకున్నది!. . . నర్స్! ఆ సౌందర్యం అంతా శేఖర్ కోసం!. . . తనని నాశనంచేసిన శేఖర్ కోసం!

"లతా! ఎందుకంత తొందర పడ్డావు!" అనుకున్నాడు ప్రకాశం. పశ్చాత్తాపంతో . . . "నేను నిన్ను క్షమించి ఉందును. రాక్షసత్వం నిన్ను చంపకుండా అడ్డుకుని ఉండును. ఈ రోజు నీచేత్తో ఈ ధూర్తుణ్ణి . . ." అనుకున్నాడు . . .

"భోజనం బాబూ!"

కుక్ వెళ్లిపోతాడు. "కానీ" అంటూ కిచెన్‌వైపు నడిచాడు ప్రకాశం. "అయినా ఏం? నర్సే చేస్తుంది ఆ పని . . . ఏ బంగారు చేతులైతేనేం? ప్రాణం తీయడానికి! లతకి బదులు రేఖ . . " అనుకున్నాడు.

* * *

రేఖ రెయిన్‌కోట్ తీసి పిడిచి లోపలికొస్తూ, "హలో రామూ! ఏం చేస్తున్నావ్?" అన్నది గట్టిగా.

"ఏముంది! మరో నవల చదువు కుంటున్నాను . . . నువ్వుమాత్రం నీపని యధావిధిగా సాగిస్తున్నావు. నేను బోర్ అయి చస్తున్నాను," అన్నాడు రామారావు గుక్కతిప్పకుండా.

రేఖ లేతగా నవ్వి, "డ్యూటీ . . ." అంది.

"అందులో, పేషెంట్ కూడా ఫ్రెండ్ . . ."

తృళ్ళిపడ్డది రేఖ. . . "ఈ సంగతి ఎవరు చెప్పారూ?" అన్నది.

"తెలిసిందిలే . . ."

రామూ నవ్వి ఊరుకున్నాడు. "వంట అయిందా అమ్మా?" అంటూ రేఖ లోపలికి వెళ్లిపోయింది తన భావో ద్రేకాన్ని కప్పిపుచ్చుకునేందుకు.

భోజనా లవగానే రాము నిద్ర పోయాడు. రేఖ ఆలోచనలో పడింది. ఈ సంగతి రాముకికూడా తెల్సిపోయింది!

"నా జీవితంలో ఎందుకడుగు పెట్టావు శేఖర్!" అనుకుంది విచారంగా రేఖ. .అనవసరంగా తాను అతనికి దొరికి పోయింది. తన జీవితాన్ని అతనికి వశం చేసింది.

"చాలా క్రిటికల్‌గా . . . ' . . .' బహుశా రేపు ఉదయానికి . . ."

గుండె తొందరగా కొట్టుకుంది . . . డాక్టర్ ఎందుకలా అన్నాడు? శేఖర్‌కి తగిలిన దెబ్బ పెద్దది కాదు. కొంత రక్తం పోయింది అంతే! తెలివి లేకపోయినా, అతని స్థితిలో క్రిటికల్ ఏముంది?

"ఉంటే బాగుండును" అనుకుంది రేఖ . . . రాముకోసం ఇన్నాళ్లు వేచి ఉన్నది. అతనూ తానంటే చాలా అభి

మానంగా ఉన్నాడు. త్వరలో తాను పెళ్లిచేసుకొని ఈ ఉద్యోగం వదిలేసి హాయిగా బ్రతుకవచ్చును. అందరూ అంగీకరించిన ఈ పెళ్లి శేఖర్ మూలంగా తప్పిపోతుంది. అతను బ్రతికిఉంటే—

"నిన్ను నాదాన్ని చేసుకుని తీరతాను రేఖ!''

పిచ్చిగా అనేశాడు శేఖర్... తాను ఊరుకునేది. అపి, రాము మనస్సు తెలియని రోజులు. ఆశమాత్రం ఉండి, నిశ్చయం లేని రోజులు. ఆ మైకంలో పడి తనని తాను కూలద్రోసుకున్నదా?

"ఏముంది నర్స్! డాక్టర్లు పొరపాటు చెయ్యాలంటే ఎంత సుళువు' చూడండి ఆ ఎర్రసీసాలో—ప్యూర్ పాయిజన్. కొంచెం వీక్ స్టేట్‌లో ఓ గ్రెయిన్ కలిపితే, సెటిల్డ్!''

ఎప్పుడో చెప్పాడు డాక్టర్. ఒక్కసారి జ్ఞప్తికి వచ్చింది ఓనాడు ఆ సీసాతీసి చూసింది ... "పర్మాంగనేట్‌లా ఉంది డాక్టర్!''

"అలానే ఉంటుంది."

రేఖ ముఖంలోకి ఒక్కసారి దౌష్ట్యం, పట్టుదలా వొచ్చాయి. "సారీ శేఖర్— నువ్వు మళ్ళా లేవవు. మన ప్రణయం నీతో చచ్చిపోతుంది," అనుకున్నది. ఏం చెయ్యాలో తనకి బాగా తెలుసు.

* * *

నాలుగు గంటలకే చీకటిపడింది-మబ్బులు బాగా కమ్ముకొనడాన్న.

శేఖర్ నెమ్మదిగా మంచంమీద ఒత్తిగిల్లి, 'రేఖా!" అని పిలిచాడు.

డాక్టర్ రూమ్‌లో ఉన్న రేఖ ఒక్కసారిగా లేచి, డాక్టర్ వేపు చూసి ఆగిపోయింది "పదండి," అన్నాడు డాక్టర్.

"హల్లో! ఎలా ఉంది?" అన్నాడు ప్రకాశం.

"నీరసం - అంతే ... చాలాసేపు నిద్రపోయానుగా!" అన్నాడు నీరసంగా శేఖరం.

"కాఫీ .."

"తెస్తాను.''

రేఖ వెళ్ళి అప్పన్నని ఇంటికి **పంపింది.**

చాలా గట్టిగా తలిగింది దెబ్బ-సైకిల్ రాతీమీదికి పడిపోయింది. మరేం ప్రమాదం లేదుకదూ!" అన్నాడు శేఖర్.

"అంటే మీరెలా అడుగుతారు?"

శేఖర్ చిన్నగా నవ్వాడు, "ఊఁ... మీరు చాలా శ్రమ తీసుకున్నారు. ముఖ్యంగా నర్స్ — మహా చల్లని చేతులు!"

ప్రకాశం ముఖం నల్లబడింది రేఖ గుండె జల్లుమన్నది.

కాఫీ ఇస్తూ, "సాయంత్రాని కోడోస్ ఇస్తాను. ఉదయానికి బెస్టుగా ఉంటారు. రెండు మోతాదులు రాత్రి తీసుకోండి'' అని, ప్రిస్క్రిప్షన్ రాసి ఇచ్చాడు రేఖకి... అక్కడ కంపౌండింగ్ ఆమె తరచుగా చేస్తూంటుంది.

"మందు కలిపి తీసుకురండి."

నర్స్ వెళ్లి అలా చేసింది. ప్రక్క టేబిల్ మీద సీసా ఉంచుతూ, "ఇంకో పావుగంటలో ఒకటో డోస్, పదిగంట లకి రెండు. తెల్లవారుఝామున మూడోది," అన్నాడు ప్రకాశం.

కొద్దిసేపయ్యాక ప్రకాశం చెప్పినట్లు రేఖ మందు గ్లాసులోపోసి ఒక డోస్ ఇచ్చింది ఆమె చేతులు వణకుతున్నా సాధ్యమైనంత దృఢంగానే ఇచ్చింది. క్రీగంట ప్రకాశం అదంతా కనిపెడు తున్నాడు.

"వాస్తాను... రాత్రి మరచి పోకండి"

ప్రకాశం తొందరగా ఇంటివైపు నడిచాడు. కొద్ది నిమిషాలయాక, రేఖా ఇంటికి వెళ్లింది.

*　　*　　*

పదకొండు కొట్టింది గడియారం.

నిద్రిస్తోన్న ప్రకాశం హఠాత్తుగా లేచాడు...చుట్టూ చీకటిగా ఉంది.

టార్చిలైటుతీసి వెలిగించాడు. కల! తను తనగదిలోనే ఉన్నాడు! జెయిలూ కాదు; ఏమీకాదు.

ఒళ్ళంతా చెమట పోసింది. ఒణుకు తున్నాడు.

"హత్యా!"

ఔను, తాను హత్య చేశాడు. శేఖర్‌ని హత్య చేశాడు ... రేఖ తన ప్రిస్క్రిప్షన్ ప్రకారం మందు కలపింది. పాయిజన్... విషం ఇచ్చి చంపాడు పేషెంట్‌ని...మిత్రుణ్ణి!

మిత్రుడు!—పక్లు కొరికాడు వాడు ...తన జీవితాన్ని అడవులపాలు చేశాడు. తన లతని చంపాడు!...తాను పగ తీర్చుకున్నాడు—అంతే.

ఇదా పగతీర్చుకోడం? తన చేతిలో తన ప్రాణాన్నుంచినవాడిని, విషం ఇచ్చి చంపడం—ఎవరు సంతోషించే పగ?

తన చేతులు...

ఆ చేతులతోనే మధ్యాహ్నం ఎర్ర సీసా, నీలిసీసాలలోని పొడర్లు తారు మారు చేశాడు_ఆ చేతులతోనే ప్రిస్క్రిప్షన్ రాశాడు. ఆ చేతులతోనే శేఖర్‌ని చంపాడు!

ఎంత ఘోరం చేశాడు!...జుత్తు పీకున్నాడు. కళ్లు కనిపించకుండా చేసు కుని హత్యచేశాడు!...కాని, అంతా జరిగిపోయింది! ఈ సరికి శేఖర్ గ్రుడ్లు తేలవేసి ఉంటాడు...

తను హంతకుడు—

ఆ రాత్రి నిద్రపోలేకపోయాడు ప్రకాశం. అడుగడుగునా భూతాలూ ప్రేతాలూ కలలోకి ఒస్తున్నై...నిమిష నిమిషానికి జయిళ్లు తనచుట్టూ తయారౌ తున్నాయ్...తాను హంతకుడు...

తెల్లవారింది. సూర్యుడు ఉద యించాడు—నిన్నట్లా తలదాచుకో కుండా.

ప్రకాశం కిటికీలోనించి చూశాడు... తెల్లవారింది...అప్పన్న రాలేదేం!— బహుశా వాడికింకా తెలివి వొచ్చి ఉండదు.

తొందరగా ఒట్టలువేసుకుని హాస్పిటల్ కి నడిచాడు ప్రకాశం...తొందరగా వెళ్ళి సీసాలలోని పౌడర్లు యధాస్థానాలలో పెట్టకపోతే ప్రమాదం.

గేటు తీసుకుని, చప్పుడు కాకుండా డిస్పెన్సరీలోకి వచ్చి, త్వరగా తన పని ముగించుకుని, తన గదిలోకి వచ్చి కూర్చున్నాడు. కలలో బ్రతుకుతోన్నట్లుందతని పరిస్థితి.

"డాక్టర్!"

నీరసంగా వినిపించింది...అవును. శేఖర్ గొంతు. అరే, శేఖర్ ఇంకా...

''గుడ్ మార్నింగ్ డాక్టర్!"

"మార్నింగ్...శేఖర్!"

"అరే! అలా చూస్తారేం!...నాకు చాలా కులాసాగా ఉంది డాక్టర్!...ఈ పూట—అరే, రేఖా! అలా తెల్లబోతావేం?"

రేఖ నీరసంగా కుర్చీలో కూర్చున్నది. డాక్టర్ ఆమె కళ్ళల్లోకి చూశాడు. ముఖం అంతా అలా పాలిపోయిందేం?...తన రహస్యం...

"చాలా బాగా ట్రీట్ చేశారు డాక్టర్! ...థాంక్స్ నర్స్...నేను వెళ్లి ప్రయాణానికి సిద్ధపడతాను. అవును. ఈరోజే వెళ్లిపోవాలి. నాకోసం అందరూ ఎదురు చూస్తుంటారు ... ఒక్కమాట మీతో చెప్పాలి నర్స్...సెలవు డాక్టర్! మీ ఉపకారం మరువను..."

శేఖర్ నెమ్మదిగా బయటికి నడిచాడు ...నర్స్ అతని వెనకాలే వెళ్లింది...

"క్షమించు నర్స్?...నీ త్యాగం ఇలాగే ప్రాణాలని కాపాడుతూ ఉండాలి. వంట ఇల్లూ, పడక గదీ నీవి కావు...నా ఉద్దేశాలు మార్చుకుంటున్నాను ... సెలవు సిస్టర్!" బాధగా, ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు. ఆమె తెల్లబోయింది.

అతను త్వరగా నడిచి, సాగిపోయాడు. రేఖ ముఖం తిరిగినట్లు ఫీలై చెట్టుకి జేరపడింది ... తాను చేసిన 'త్యాగం'!...సిస్టర్!

"అలా ఉన్నారేం?...'' ప్రకాశం... సానునయంగా అన్నాడు.

కొంచెం—చీకాకుగా ఉందిలెండి... అంతే...''

"అవసరమైతే..."

"ఆ...ఇంటికి వెళ్తాను..."

"శేఖర్...రికవరీ చాలా చిత్రంగా ఉందికదూ?"

"చాలా చిత్రంగానే ఉంది ... మీరు .."

"ఆఁ...అలానే అనుకున్నాను. కాని, మనం Explain చెయ్యలేని విచిత్రాలు జరుగుతూనే ఉంటై!"

"నిజం డాక్టర్! విచిత్రాలు జరుగుతూనే ఉంటై!"

ఆమె వెళ్లిపోయింది. ప్యూర్ పాయిజన్ ఎలా ఫెయిలైందని ఆలోచిస్తూ; డాక్టర్ కుర్చీలో కూలబడ్డాడు-ప్యూర్ పాయిజన్ ఎలా ఫెయిలైందని ఆశ్చర్యపడుతూ.

—

# వహా చిన్నవాడి సలహా

దేశంలో జనాభా వలెనే ధరలు కూడా రోజు రోజుకూ పెరిగిపోతున్నాయి. నిత్యజీవితావసర వస్తువులకు నిన్న ఉన్న ధర ఈనాడు ఉండటంలేదు అంత దాకా ఎందుకూ, ఒకే మార్కెట్‌లోనే ప్రొద్దున పదిగంటలకు ఉన్న ఉల్లి పాయల ధర సాయింత్రం అయిదు గంటలకే అయిదు పైసలు పెరిగిన నిదర్శనాలున్నాయి. దేశంలో పెచ్చరిల్లి పోయే అన్యాయాలకూ, అక్రమాలకూ, అవినీతికీ, లంచగొండితనానికీ, బ్లాక్ మార్కెటింగ్‌కూ, హోర్డింగ్‌కూ – ఈ ధరల పెరుగుదలకూ పరస్పర సంబంధం ఉన్నదీ లేనిదీ అటుంచి, మా బోటి మధ్య తరగతి ఉద్యోగస్థులకు మటుకు రోజులు గడవటం అతంత మాత్రంగా ఉంది. జీతాలు కుందేలు నడకతో పెరుగుతూంటో, ధరలు పందెపు గుర్రం వేగంలో పెరుగు తున్నాయి. నెలసరి ఆదాయానికీ, వ్యయానికీ మధ్య అంతకంతకూ అగాధం పెరిగిపోతూఉంటే, కుటుంబపు బడ్జెట్‌ను సర్దాబాటు చేయడమెట్లా ?

అరగంట సేపు ఆలోచించి, అరు సిగరెట్లు తగలేసి, మా ఆవిడతో సుదీర్ఘంగా చర్చలు జరిపి – కుటుంబ ఖర్చులను తగ్గించే పథకాన్ని తయారు చేశాను. మాది ఎర్రత్రికోణపు మార్కు సంసారం. ఇద్దరు మగ పిల్లలు ; ఒక ఆడపిల్ల. పెద్దవాడు హైస్కూల్లో ఆరో క్లాసు చదువుతున్నాడు. అమ్మాయి నాలుగో క్లాసు చదువుతున్నది. అయిదేళ్ల చిన్నవాడు అప్పర్ కేజి చదువు తున్నాడు. ముగ్గురూ రోజూ బస్సులో ఉదయం 8 గంటలకు స్కూలుకు వెళ్లి, సాయంత్రం 4 గంటలకు ఇంటికి వస్తారు. నాకు అన్ని కోతలూ పోగా నెలకు 615 రూపాయలు చేతికి వస్తాయి.

నేనూ, నా భార్యా, పిల్లలూ అందరమూ కూర్చుని కుటుంబ ఖర్చులు తగ్గించే పథకం మీద చర్చలు జరుపు తున్నాము.

"నెయ్యి కిలో పదహారు రూపాయలైంది. మనకు నెలకి మూడు కిలోల నెయ్యి పడుతున్నది. నేతి వాడకం బాగా తగ్గించి వేస్తే, నెలకు అరకిలో నెయ్యిని మాత్రమే వాడితే, నలభై రూపాయాలు ఆదా అవుతాయి. ఏమంటావు లక్ష్మి !'' అన్నాను నేను.

"మీ ఐడియా బావుంది" అన్నది లక్ష్మి అంగీకారంగా.

"ఆరోగ్య సూత్రాల దృష్ట్యా కూడా నెయ్యిని అంతగా వాడటం మంచిది కాదు. కొవ్వు పేరుకుపోతుంది, ఎన్నో

పద్మ శీల

జబ్బులు వస్తాయి. అట్లాగే కూరల్లో కూడా నూనె తగ్గించాలి. పిండివంటలు మానేయాలి. దీనివల్ల నూనె ఖర్చుకూడా సగానికి సగం తగ్గుతుంది.'' అన్నాను నేను సీరియస్‌గా.

మా ఆవిడ ఆట్టే అభ్యంతరం చెప్ప లేదు. రెండు కిలోల నూనె ఖర్చును తగ్గించుకోవచ్చునన్నది. అయితే ముగ్గురు పిల్లలు మాత్రం ఆముదం పుచ్చుకొన్న మొహాలు పెట్టారు.

''ఏమిట్రా ?" అన్నాను పెద్దవాణ్ణి."

"నెయ్యిలేనిదే నేను ముద్ద ఎత్తం" అన్నాడు పెద్దవాడు.

"మాకు అన్నం సయించదు'' అన్నది అమ్మాయి.

చిన్నవాడు గోడకేసి చూస్తూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు, తన అభి ప్రాయాన్ని చెప్పకుండా,

"డాడీ ! నువ్వు సిగిరెట్లు మానెయ్యా కూడదూ ! నెలకు వందరూపాయలు కలిసివస్తాయి" అన్నాడు పెద్దవాడు టపాకాయ పేల్చినట్టుగా.

నా గుండెలో తుపాకిగుండు దూసుకు పోయినట్లయింది. ఇరవై ఏళ్ల నుంచీ నీడలాగా తోడుగా వస్తూన్న అలవాటు. దాన్ని మానడం మాటలా ?

"డాడీ ! సిగిరెట్లు మానేయాలి" అన్నది అమ్మాయి కూడా బిగ్గరగా.

పచ్చి కొబ్బరిముక్క గొంతులో ఇరుక్కున్నట్లుగా మా ఆవిడ కేసి చూశాను.

"తప్పదు" అన్నట్లు ఆవిడ తల ఆడించింది.

ప్రభుత్వం వారి ప్రతి బడ్జెట్‌లో ఆర్థిక మంత్రిగారి దృష్టిలోపడి అత్యంత ప్రియంగా తయారైన సిగిరెట్లను మాని వేయడంలో ఔచిత్యం కనబడి 'అట్లాగే' అన్నాను.

అందరూ చప్పట్లు కొట్టారు.

"ఉగాది పండక్కు నాకు కొత్త చీర అక్కర్లేదు" అన్నది మా ఆవిడ.

సంతోషించాను.

"మేం బోర్నవిటా మానివేసి ఒట్టి పాల్ తాగుతాం," అన్నాడు పెద్దవాడు.

"రోజూ చాకెలెట్లు కొనమని నేను ఏడ్వను డాడీ !" అన్నది అమ్మాయి.

ఆరేళ్ల మా చిన్నవాడు తన దీర్ఘ మైన ఆలోచననుంచి తేరుకొని-"డాడీ ! రేపట్నించీ నేను స్కూలుకుపోను. బస్సు ఛార్జీలు, స్కూలు ఫీజు మిగులుతాయి" అన్నాడు చంకలెగరవేస్తూ.

---

# పొలిట్రిక్సు కథ

"ఆయమ్మడు నెమ్మదైనపిల్లే. వినయం, వొందనం, శాంతం..." అన్నారు రామిరెడ్డిగారు—సుబ్బరాజు రాగానే.

సుబ్బరాజు తలొంచుకున్నాడు. ఈ విషయాల గురించి పబ్లిక్కున మాట్లాడడం అతనికిష్టంలేదు. "కనుక్కున్నాను. మీరు రాస్తున్నారన్న పోస్టర్లు ఎగస్పార్టీ వోళ్ళే వేయించారట" అన్నాడు.

"మరేట. నా బొమ్మేసినాయన నొచ్చాడిదేపు. బొమ్మ బాగుందయ్యా అంటే, "మీ ముక్కూ మూతీ అంత సోగ్గా ఉన్నాయ్యా, నా గొప్పేంవుంది. మీది బొమ్మలేసే వోళ్ళు చూసి మురిసిపోయే ముఖవూ(" అన్నాడు. నివ్వు నన్ను పొగడతన్నట్టా తెగడతన్నట్టా అనడిగేశాన్నవ్వుతూ. "నా మాటబద్దవైతే, ఎలకను కెక్కిండి, మీ మొఖం జూసి సీటివ్వకపోతే ఒట్టూ" అన్నాడు. నవుతాలుగాదు, సుబ్బరాజూ, నీకా సుబ్బరాజుగారబ్బాయికతదెలీదుగావోసు.

"నీ పేరుగలాడి కతని, అది నీ మీజ్జెప్పాననుకొని బుజాల్తడూకునేవు, జాగ్రత్త. బుజాల్తడుంకోడం గొప్పోళ్ళ లక్షణంకాదు. గుమ్మడికాయలు ఎత్తుకొచ్చినా బుజాల్తడువుకోకూడదు గుమ్మడికాయలు పోయాయంటే నివ్వెత్తుకొచ్చినవే అని దాఖలా ఎక్కడ? ఏం గుమ్మడో-బూడిద గుమ్మడో, పండు గుమ్మడో. ఈ ఊరియో, దేశాంత్రంలోవో, ఇప్పటిమాటో, ఎప్పటిమాటో—ఎవడికి దెల్సు? అంచే తలా కంగారు పడకూడదు. పౌరుషం దెచ్చుకోకూడదు. నీతి నిజాయితీలమీదా, వాటి వెతిరేకాలమీదా ఎవరెంత వుపన్యాసాలిచ్చినా సుబ్బరాజుగారు బుజాల్తడూకోలేదు. పైగా ఆయనే ఎన్నో లెక్చర్లిచ్చాడు. సుబ్బరాజుగారలాటిలాటోదనుకునేవు. లక్షలు గడించాడు. కోటికి పడగెత్తేవోడే గాని, ఇన్కంటాక్సువాళ్ళొడిచిపోతారని మానేశాడు. అసలదీగాక, ఆయనకి టాక్సెందుకు? ఇన్కంటాక్సు బాబులాటి కొడుకున్నాడు. ఓమాటా యబ్బాయి గుఱ్ఱవంత పెంపుడు కుక్క నేసుకుని ఊటీ రైలు కెళ్ళి ఏర్కండిషనింగు పెట్టెలో కెక్కాడు. అందులోవున్న ఇంకో గొప్పాసామి ఝుడుసుకుని గార్డుకి ఫిర్యాజ్జేశాడు. ఆఫీసర్నూ,గార్డూ వచ్చి కుక్కని దింపేయమన్నారు. కుక్కల పెట్లోకి ఎక్కించమన్నారు. కుర్రాయన మండిపడ్డాడు. దీన్ని కుక్కంటావేటి? నీకేమన్నా బుర్రుందా, అన్నాడు. "మీ యిద్దరి

ముళ్లపూడి వెంకటరమణ

జీతాలూ కలిపినా, దీనికయే నెలసరి ఖర్చులో సగవుండ తెలుసా" అన్నాడు.

"మే మిద్దరం ఊరెళ్తే ఓ పెట్టె కేటాయింపుగా దీసుకుంటాం మరి. మీ కుక్కకి అలా ఓటి బుక్ చేసుకోండి కావలిస్తే" అన్నాడు ఆఫీసరు కోపంగా.

"సరే. అలాగే కానీ, నాకేం బయవా?" అని రైలు దిగిపోయాడు కుర్రాయన.

వారం తరువాత కుక్కకీ, తనకీ ఎన్నొందలో పారేసి ప్రత్యేకం ఓ ఏర్కండిషన్ పెట్టె కట్టించుకెళ్ళాడు. అద్గదీ, పౌరుషం అంటే అలాగుండాలి. దరిమిలాను ఊళ్ళో అంతా గొప్పగా జెప్పుకున్నారు దీన్నిగురుంచి. పేపరాళ్లు ఫొటోగ్రాఫ్ వేసి రాస్తామని సరదాపడ్డారు గాని, సుబ్బరాజుగారే వద్దన్నారు—ఆఁ. యీ చిన్నదానికి పెద్ద పబ్లిసిటీ ఎందుకు లెండి అని. కొడుకు ప్రెగ్నెకి పొంగి పోయినా, ఆయనకి గుబులు పట్టుకుంది. వీడిలా గుణించేస్తే ఎన్నాళ్ళాటొస్తాము? దీనికి తగ్గట్టు గణించాలి గామోసు! అని. ఓ మాటు ఎవరో సభలో అవినీతి గురించి ఘాటుగా మాటాడుతూంటే, ఎందుకో ఎన్నడూలేంది మనసు చివుక్కు మంది. తిరపతెళ్లొచ్చినా స్తిమితపడలేదు. డబ్బు తరిగిపోతోందా ఏమిటి, చెప్మా అని అప్పుడు అనుమానం తగిలింది. తనికీ చేసుకున్నాడు. మేనేజర్లూ, వాళ్ళ కుడిభుజాలూ సబబుగా కాజెయ్యాల్సిన దానికి పదింతలు బయ్యటికి రవాణా చేసుకుపోతున్నారు. ఒక్కనెలలో వాళ్ళు తీసుకున్న అదనపు డబ్బు ఆ నెలల్లో వాళ్లు పట్టుకున్న చిన్న కైంకర్యాలకి పదింతలుంది. తన వాటాకి రెండింత లుంది. సుబ్బరాజుగారికి గుండెబేజారయి పోయింది. గట్టిగా అడిగేందుకు లేదు. "ఈసారి షేరుహోల్డర్ల మీటింగవనీ, మీ పని చెప్తా" అని ఒట్టేసుకున్నాడు. నెమ్మదిగా తన కొడుకుల్ని బిజినెసులో పెట్టాలని నిశ్చయించుకున్నాడు. ఆయనకి వారసులయిన కొడుకులు ముగ్గురే. బే వారసులందరికీ, అక్కడ అక్కడా ఉద్యోగా లేయించేశాడు.

సుబ్బరాజుగారికో ముచ్చటుంది. ఒక్క కొడుకుని రాజకీయాల్లో దింపుతే, ఒకడు వ్యాపారం గణిస్తే, మూడోవాడు కుక్కల్నీ గుర్రాల్నీ ఏర్కండిషండు పెట్టెల్లో, విమానాల్లో తిప్పి గుణించినా ఫరవాలేదు. ముగ్గురిలో ఎవరెందుకు పని కొస్తారో తేలాలి. ఆయనకి ఇతరత్రా అంగబలం లేదనికాదు. రెండు మూడు రేసు గుర్రాలూ, రెండు పార్టీల నాయకులూ, రెండు యూనియనుల హీరోలూ పార్టీలో రెండుగ్రూపుల పెద్దతలలూ, రెండు మూడు ఫిలిం కంపెనీల్లో పెద్ద షేర్లూ తన పేరుమీదుండి ఇతర్ల హయాములో తిరుగుతున్న పది పదిహేను కార్లూ లేకపోలేదు.

ఓసారి పార్టీమీటింగులో ఓ ఎలక్షనుకి అభ్యర్థుల్ని సెలక్టుచేసి టిక్కెట్లిస్తుండగా







ఆయనకి తనకొడు కొకణ్ని దింపాలని మనసైంది. టిక్కెట్లరద్దీ ఎక్కువగా ఉంది. అందరికందరూ గొప్పవాళ్ళేననీ ఏ ఒకరు లేకపోయినా దేశం నాశనం అయిపోతుందనీ అందరూ అన్నారు. అవతల సంస్థలో సీట్లు పెంచేసి అందరికీ టిక్కెట్లిద్దామాఅంటే అందుకు వ్యవధి లేదు రాజ్యాంగాన్ని సవరించాల్సి రావచ్చు. అవి నెమ్మదిమీద జరిగేవి. చివరకి మూడు సీట్లకి టిక్కెట్ల దగ్గర శానా రభసైంది. పద్దెనమండుగురు అడుగుతున్నారు.

"రావుగారిముక్కు చాలా పొడుగు. మొహం తమాషాగా ఉంటుంది. జనం ఓసారి చూస్తే మళ్ళీ మర్చిపోరు. ఇలాటి ముఖాల్ని ఎక్కువ ప్రేమించెదరు. కార్టూన్‌లు వెయ్యడం సులువు. ఎంత చేతగానివాడైనా ఇట్టేపోలిక లొచ్చేలా వేస్తాడు. అంచేత యీయన కార్టూనులు తరుచు పేపర్లలో పడితే, పార్టీకి నిత్య పబ్లిసిటీ అందువల్ల పార్టీ మేలు, దేశమ్మేలు కోరి రావుగారికే ఈ టిక్కెట్టు ఇవ్వా"లని ఆయన తరపు వకీలు రెడ్డిగారు వాదించాడు. ఆ సీటుకి పోటీ చేసేవారిలో ఈ క్వాలిఫికేషను ఇంకెవరికీ లేనందువల్ల ఇది ఆయనకే ఇచ్చారు.

మరోదానికి ఇలాటిదే వచ్చింది. మా రెడ్డిగారి ఆరోగ్యం బాగులేదు ఎప్పుడూ పాలిటిక్సు సందడి, సమస్యలు ప్రజాసేవ ఉండాలి. లేకపోతే మనసు, ఆరోగ్యం నాశం అయిపోతాయి. అలాని డాక్టరు సర్టిఫికెట్టు కూడా ఉంది. ఇపైన మీ ఇష్టం. ఒక మహనీయుణ్ణి చేజేతులా పొగొట్టుకుంటామంటే... మీ యిష్టం అన్నాడు రావుగారు. ప్రాణంతో చెలగాటాలాడరాదని, ఆ సీటు ఆయనకిచ్చారు

"పార్టీకి, దేశానికి, ముఖ్యంగా పేపర్లో పబ్లిసిటీ వస్తువుకీ రావుగారి కార్టూను

ఫేసు, రెడ్డిగారి అనారోగ్యం ఎంత ముఖ్యమో, మా రాజుగారి ఉపన్యాసాలూ, స్టేటుమెంట్లూ అంత ముఖ్యం అని మీరు మర్చిపోతున్నారు. ఆయన ఏంమాటాడినా మర్నాడు పేపర్లో సంపాదకీయం, నాలు గింట మూడుపాళ్ళు కార్టూను వస్తాయి. జనం చర్చిస్తారు. చర్చలే దేశానికి జీవం. అదే రాజకీయ చైతన్యం. జనంలో ఆ చైతన్యం వుంటేనే దేశం బాగుపడుతుంది. అంచేత... నే చెప్పడం ఎందుకు? మీకే తెలుసు. అదీగాక, రాజావారు పాలి ట్రిక్సుతప్ప ఇంకేది చెయ్యరు, చెయ్య లేరు ఆపైన మీ యిష్టం'' అని తన ప్రాంతపు మండలి తీర్మానాన్ని చదివాడు రెడ్డిగారు. ఆసీటు ఆయన కివ్వడంతో సుబ్బరాజుగారి మనసులో ఆలోచనలు రేకెత్తాయి.

మనవెధవాయలు ముగ్గురిలో ఇలాటి అర్హతలు ఏమున్నాయీ అని తర్కించు కున్నాడు. వాళ్ళమొహాలే గుర్తుకురాలేదు. కనబడిచావరుగదా? పదేసేళ్ళుండగా, బాగా దగ్గర్నించి తీరిగ్గా చూశాడు. అవే ముఖాలు మనస్సులో మెదిలాయి ఆ ముఖాలికే మీసాలుపెట్టి ఊహిస్తే రావుగారి కార్టూనుఫేసుల్లా కనిపించాయి. ఛ, ఇదిగాదుపనని సెక్రట్రీకి చెప్పాడు– వాళ్ళ ముగ్గుర్నీ ఓసారి కేకేయించండని. ట్రంకుఫోన్లు, టెలిగ్రాములు, కేబుల్ గ్రాములూ ఇచ్చి వారంరోజుల్లో వాళ్ళని రప్పించి మీటింగు వేయించాడు సెక్రట్రీ గారు.

కొడుకులు ముగ్గురూ వినయంగా కూర్చున్నారు తన మనసులో మెదుల్తున్న పదేళ్ళపిల్లల మొఖాలికి ఈ పాతిక ముప్పయేళ్ళ వాటికీ వాలకంలో అట్టే తేడా కనబడలేదు.

గుమాస్తాలదగ్గర మాటాడినంత బింకంగా, బోనసు ఇంక్రిమెంట్లు డిమాండ్లకి చెప్పే జవాబులా, టూకీగా సంగజెప్పాడు సుబ్బరాజుగారు. "అబ్బాయిలూ, ఇది కాశీ మజిలీ కథలావుంటే ఉండవచ్చు గాని మీకో చిన్నపనెబుతాను. చెయ్యండి. ముగ్గురూ దేశంమీదకెళ్ళి పరిస్థితులు చూసిరండి మిమ్మల్ని పాలిటిక్సులో దింపదలుచుకున్నాను. అంచేత దేశం చూసి మీ అభిప్రాయాలు చెప్పండి. బద్ధకించినా, ఎగేసినా, దగాచేసినా నా ఆస్తిలో చిల్లుకానీ ఇవ్వను. ఇన్కం టాక్సు కట్టిపారేస్తా జాగర్త" అన్నాడు ముక్తసరిగా.

మూడోకొడుకు ధైర్యంగా ఏదో చెప్పబోయాడు. ''చిల్లుకానీ ఇవ్వద్దుగాని ఓసారి చూపిస్తారా? దానికి చిన్నబెజ్జం ఉంటుందని నేనూ, కాదు పెద్దదని నా మిత్రుడూ వాదించుకుంటున్నాం. మీరెవ రితో ఏకీభవి..."

తండ్రి మాపుజూసి అది వాయిదా వేసుకున్నాడు.

"మూణ్ణెల్లు గడువు" అంటే కేశాడు తండ్రి, కొడుకులు గుమ్మం దాటుతూం డగా.

''మూణ్ణెల్లు తిరిగి గడువు ముగిసే సరికి గడపలోవాలారు ముగ్గురూ. తండ్రి ముగ్గుర్నీ మూడుగదుల్లో కూచోబెట్టి, ఒక్కొక్కడినీ పిలిపించాడు.

పెద్దకొడుకు ముందువచ్చాడు. మొహం దిగాలుగాఉంది. బట్టలు మాసివున్నాయి. వాటికన్నా గడ్డం మరింత మాసింది. దైన్యంచూసి కడుపు తరుక్కుపోయింది తండ్రికి.

"తలనొప్పిగా ఉందా ?'' అన్నాడు.

''హా. తలేమిటి, జీవితమే నెప్పెడుతోంది'' అన్నాడు కొడుకు—గాఢంగా నిట్టూర్చి సోఫాలో కూలబడుతూ.

''సంగతేమిటి ? ఏమైంది?''అన్నాడు తండ్రి ఆదుర్దాగా.

''నాన్నా. లాభం లేదు. మనంకాదు దేవుడైనా సరే పాల్టిక్సులోకెక్కి ఎంత తిప్పలుపడ్డా లాభంలేదు. దేశం అలా ఉంది. కళ్ళారా చూశాను చెవులారా విన్నాను. ప్రజలు చాలామందికి రెండు కార్లుకూడలేవు ఉన్నా చిన్నకార్లు చాల మందికి అవీలేవు ఇంకా కొందరున్నారు. వాళ్ళకసలు ఏమీలేదు, చదువులేదు, తిండిలేదు, హెల్తులేదు, వెల్తులేదు. మరొకవంక అవినీతి, లంచగొండితనం దగా, మోసం, బద్ధకం. పనిమాలిన తనం, పనికిమాలిన తనం, జబ్బులు, చావులు ముమ్మరంగా ఉన్నాయి అమ్మబాబోయ్! వీళ్ళందరినీ బాగుచెయ్యాలంటే మధ్య వాళ్ళందర్నీ అదుపు చెయ్యాలంటే బ్రహ్మతరంకాదు ఎవరు చెయ్యగలిగింది ఏమీలేదు. అది మహా ప్రవాహం. అందు మీద కొట్టుకుపోతూ, దాన్ని మనం నడపుతున్నామని భ్రమపడడం తప్ప మరేంలేదు. లాభంలేదు నాన్నా లాభం లేదు'' అన్నాడు.

తండ్రి జాలిగా అతనికేసి చూశాడు.

"పో. పోయి స్నానంచేసి భోంచేసిపడుకో. డాక్టర్ని పంపిస్తాను- మందు తిందువుగాని. భయపడకు'' అని సాగనంపి బెల్లునొక్కాడు.

"నాన్నా, ఘోరం! ఘోరం! ఇన్నాళ్ళూ మమ్మల్నిసుఖాలమధ్య పెట్టి, చుట్టూరా డబ్బుగోడలు కట్టి సమాధి చేశావు. అర్జెంటు, అర్జెంటుగా నేను జీవితంలో అడుగుపెడతాను'' అంటూ గాలిదుమారంలా వచ్చాడు రెండో కొడుకు.

''కూర్చో. కూర్చో. కూర్చుని స్థిమితంగా చెప్పు'' అన్నాడు తండ్రి కంగారుగా, ఆశ్చర్యంగా.

"చెప్పేందుకు టైములేదు, నాన్నా. పత్రికల రంగు టద్దాలలోంచి స్వార్థపు చత్వారపు కళ్ళతో దేశాన్ని చూస్తున్న నీకేం తెలుస్తుంది, టైము విలువ? నేను ఒక్కక్షణం ఆగలేను దేశం గగ్గోలుగా ఉంది. లక్షలాదిజనం బాధపడుతున్నారు. తిండి తిప్పలయిపోయింది మందుమాసికాని కందుతోంది. ఇంపోర్టు పాలిసీ బాగులేదు. కారు అడిగిన రెండేళ్ళగ్గాని

రాదు. పన్జేసే రేడియో బోల్డుఖరీదు. బీదవాళ్ళు బీద బాధలూ గొప్పవాళ్ళు గొప్ప బాధలూ పడుతున్నారు. దేశంలో కోడిగుడ్లు శాకాహారం స్థాయికీ, పూజరోజు కాఫీ ఔషధం హోదాకి పెరిగినట్టు లంచ గొండితనం వంటి అవినీతి పనులన్నీ ఇవి నీతి పనులన్న జాబితాలకి ఎగ బాకి పోయాయి నీతిని గొంగళీ పురుగుల్లా తినేస్తున్నాయి. ఇంకాసిని రోజులుపోతే అవే సీతాకోకలై ఎగిరి విహరిస్తాయి సుమా. ఇవి ఇలా రివాజైపోతే— తర వాత్తరవాత అవినీతి పనులింక లాభసాటి కావు—కొత్తకొత్త తప్పుడు పద్ధతులూ, పాడుపనులూ కొత్త దగాలూ కనిపెట్టాలి నాన్నా, పన్నులు ఎగెయ్యడం గౌరవం అయిన పని. సేల్సుటాక్సు వసూలుచేసి పెడుతున్నవాళ్ళని గవర్నమెంటు పద్దు లడుగడం నేరం. నో, ఫాదర్. నేను వెంటనే పాలిటిక్సులో దిగుతున్నాను. మై కంట్రీ నీడ్స్ మీ నా దేశం నన్ను పిలుస్తోంది.''

''నువ్వెళ్ళి రెండుగ్లాసులు మజ్జిగతాగి పడుకో'' అని అతన్నిపంపించి, వెంటనే సెక్రటరీని కేకేసి వాడు పడుకోగానే గదికి తాళంవేసి తనచేతికివ్వమని ఆజ్ఞా పించాడు.

మూడోకొడుకు దర్జాగా వచ్చాడు. సమానస్థాయీమనిషిలా వచ్చాడు. ఎదు రుగా కూర్చుని, సిగరెట్టు ముట్టించాడు. పొగరుగా పొగవదుల్తూ, ''ఊఁ ఏవిటి విశేషాలు నాన్నగారూ? మీ ఆరోగ్యం బాగుందా? మొన్న ఫోంచెయ్యలేదట. ఎన్నో మైసిన్ ఇంజక్షనులు తీసుకున్నా రుట. మీరీస్థితిలో వర్రీకావడం నాకిష్టం లేదు. కొడైలో కాటేజి రెడీచేయించాను నాలుగు నెల్లు రెస్టుతీసుకోండి. ఎలక్షను టైముకొద్దురుగాని. ఆమేనేజరుకి చెక్కుల మీద సంతకంపెట్టే అథారిటీ తీసెయ్యండి. నేజూసుకుంటాను?'' అన్నాడు.

"ఎలక్షనకా? నువ్వు నిలబడదామను కుంటున్నావా?" అన్నాడు సుబ్బరాజు గారు— బేజారైపోయిన గుండెల్ని మెల్లగా దిటవుచేసుకుని. 'నాచురల్లీ' అన్నాడు కొడుకు సిగరెట్టు ముట్టిస్తూ.

తండ్రి విచిత్రంగాచూశాడు కొడుకు కేసి.

"నాన్నా, నేను ఎక్కువమాట్లాడి మన టైము వేస్టుచెయ్యను. మెడమీద బుర్ర, ఊరిమీద పరపతి బిజినేసూ, డబ్బూ, టాక్సూ అన్నయ్యల్లాటి కొడు కులూఉన్నవాడెవడైనాసరే పాలిటిక్సులో దిగకమానడు. వ్యాపార దక్షతగల వాడెవడైనాసరే, దేశం పరిస్థితి ఇలా వుండగా చూస్తూ కూర్చోడు. మీరు ఏఫీల్డు తీసుకోండి. బిజినెస్ పొటెన్షల్ ఎంతుందో నే చెప్పలేను. వెధవటాక్సు లకి భయపడి వ్యాపారం చంపుకోడం, కాటేజిండస్ట్రీసుతో కాలక్షేపం చెయ్యటం తెలివితక్కువతనం. మీరు కోడై వెళ్ళండి

లేదా కాశ్మీరు వెళ్ళండి. నేను చక్కబెడ తాను అన్నీ'' అన్నాడు కొడుకు.

టెలిఫోను మోగింది. సుబ్బారాజు గారి కాలికింద మీటనొక్కితే అదలా ఆపద్ధార్మంగా మోగుతుంది. "హలో—" అని, అరనిమిషం విని, "నువ్వెళ్ళు మళ్ళీ కలుసుకుందాం. ఇండియాలోనే ఉండు సుమీ. ఏముంది" అనిచెప్పి కొడుకును సాగనంపి, నిట్టూర్చి వెనక్కి జేరగిలబడ్డాడు.

* * *

సుబ్బరాజూ, ఇపుడుచెప్పు కథలో సుబ్బరాజుగారేం చేశాడు. ముగ్గురిలోనూ రాజకీయాల కెవర్నెన్నుకున్నారు? అన్నాడు రామిరెడ్డిగారు కథ ఆపి.

''చెబుతా, ముందరాయన సెక్రటేరి పిలిచి తన వయస్సెంతో చెప్పమని ఉంటాడు. తరవాత జ్యోతిష్కుణ్ణిపిలిచి ఇంకా ఇరవై ఏళ్లు ఆయుర్దాయం ఉందనీ ఆరోగ్యం బ్రహ్మాండంగా ఉందనీ చెప్పించుకుంటాడు. ఒకటో కొడుకుని టానిక్కుల డాక్టరుకీ రెండోవాణి సైకాలజీ డాక్టరుకీ ఒప్పజెప్పుంటాడు వాళ్ళిద్దరూ పాల్టిక్సుకి పనికిరారు. ఒకడ దేశంచూసి బాబోయ్, మనమేమీ చెయ లేము అనేశాడు. రెండోవాడు నేనుచాల చెయ్యాలి,చేస్తానూ అన్నా, తీరా దిగా ఆ సుడిగుండంలోపడి మునిగిపోతాడు దేశసేవమీద అంత ఉబలాటం ఉన్నవ దెవడూ ఆటిరాడుగదా. ఇహ, మూడ కొడుకు గట్టివాడే కాని, మరీ గట్టివాడు వాడు చెప్పినమాటలతో సుబ్బరాజుగా వ్యాపార జ్ఞాననేత్రం తెరుచుకుంది. అం ఫీల్డుండగా మనం ఊరికే ఉండటమేవి టని ఉత్సాహం కలిగి రాజకీయాల్లో ఆయనే దిగనిశ్చయించుకుని ఉంటాడు' అన్నాడు సుబ్బరాజు.

''మరి మూడోకొడుకు? వాడు స్థిమి తంగా ఉంటాడా? చెప్పినట్లు వింటాడా?'

''దానికేముంది? వాడికి మంచి గడ సైన పిల్లని, చక్కనిదాన్ని తెచ్చి పెళ్ చేసేస్తాడు. స్విట్జర్లాండుకి హనీమూన తీసుకుపోతుందా పిల్ల" అన్నాడ సుబ్బరాజు.






నాకు మనశ్శాంతి లభించటం లేదు!

కూర్చున్నా, పడుకున్నా, పత్రికలు చదివినా, చీట్లపేక ఆడినా, ఇతర్లసంగతి చెప్పుకున్నా, ఆఖరికి ఇతర్లను నిందిస్తున్నాకూడా కాలం గడవటం లేదు. దీని కంతకూ ముఖ్యకారణం చేతిలో డబ్బు లేకపోవటమే.

చేతిలో డబ్బు లేకపోవటం నా లోపం కాదు. నేను చేయవలసినవన్నీ చేశాను. అంటే పరీక్షలు ప్యాసుకావటం— ఉద్యోగంకోసం దరఖాస్తులు పెట్టటం — అన్నీ చేశాను. ఆఖరికి ఇన్‌ష్యూరెన్సు ఏజంటుగాకూడా కొన్నాళ్లు పని చేశాను. ఏమీ లాభంలేకపోయింది

ఐతే అన్నీ చేశా ననటానిక్కూడా వీల్లేదు ఇంకా చేయాల్సినవి కొన్ని వున్నై. స్టేషనరీ దుకాణమో, పచారీ షాపో, కనీసం కిళ్లీకొట్టో పెట్టి ప్రయత్నించవలసి ఉంది. ఏది చేయటానికీ ఈగల బాధ ఎక్కువైంది కదా! కాసేపు తీరిగ్గా ఆలోచించనివ్వవు. కళ్లు మూస్తే ముఖాన వచ్చి వాలుతున్నై. అసలే ఎండాకాలం. చెమట దిగకారుతున్నది. పైన ఈగలు! చేతిలో డబ్బుంటే

'ఫ్లిట్' అన్నా కొని. ముందు ఈగల బాధ వదలించుకుని తీరిగ్గా ఆలోచించే వాణ్ణి.

మీకు బహుశా నవ్వుగా ఉండవచ్చు —'వీడింత ఆలోచనాపరుడా' అని. నిజానికి పొట్టచింతకంటే క్లిష్టమయిన చింత మరొకటి లేదు. రాత్రింబగళ్లు దాన్నిగురించే చింతిస్తున్నాను. నేను చింతనాశీలుణ్ణి కాను, చింతాగ్రస్తుణ్ణి!

కలకత్తా పోవటానికి నిశ్చయించుకున్నాను. ఆఁ. కలకత్తాపోయే, నా శక్తికొలదీ ప్రయత్నిస్తాను. ఈ పల్లెటూళ్లో కూర్చుంటే ఏమీ లాభంలేదు. ఆఖరికి దుకాణం పెట్టుకోవాలన్నా కలకత్తాయే బెస్ట్ ఫీల్డు! ఉద్యోగం కూడా దొరికితే దొరకవచ్చు. ఇంత కాలంనించీ ఇంట్లోనే కూర్చుండి దరఖాస్తులు పెడుతున్నాను. పర్సనల్‌గా ఆఫీసులకు పోతే ఏమనా ప్రయోజనం ఉండకపోతుందా? కనక కలకత్తా పోవటమే మంచిది.

మర్నాడు వెండి హుక్కా చేతపట్టుకుని బయలుదేరాను— కుదువబెట్టి కొంత డబ్బు తీసుకోటానికి. చేతిలో అర్థం లేకుండా కలకత్తా పోవటంలో అర్థమేముంది?

వెండిహుక్కా మాట విని మీరు బహుశా నేను జమీందారు బిడ్డనని అనుకుంటారేమో! ఆ అదృష్టం నాకు పట్టలేదు మా నాయన కొంచెం సర్దా పురుషుడు. అంచేతనే నాకేమీ మిగల్చకుండాపోయాడు.

హుక్కా కుదువపెట్టుకుని షాహుకారు పది రూపాయలిచ్చాడు. నా చేతిలో యింకా పది ఉన్నై. ఆవాళే కలకత్తా బయలుదేరాను.

* * *

మాకు దూరపు బంధువు ఒకాయన కలకత్తాలో ఉంటున్నాడు. పోయి ఆయన ఇంట్లో విడిది దిగను. మాది బీరకాయ పీచు చుట్టరికం; ఒక విధంగా బాదరాయణ సంబంధం కూడా. మా మేనమామ మరదలికి ఆడుబిడ్డ కొడుకు ఆయన. శాస్త్రప్రకారం గణితం వేసి చూడందీ ఫలానా వరస అని తేల్చడం కష్టం. కాని నేనంత లోతుకు దిగదలచలేదు. వికాసబాబును—అందే మా చుట్టాన్ని చూడగానే, "ఏమి అన్నయ్యా! నన్ను గుర్తించావా?" అన్నాను.

నిజానికి అన్నయ్య నన్ను గుర్తించలేదు. ఐనా అన్నాడు: "చాలా రోజులైంది కాదూ చూచి. అందుకనే కాస్త జ్ఞాపకం—రామపురంనించేక దూరావటం?''

రామపురంలో వారి జ్ఞాతులు ఉండవచ్చని ఊహించుకున్నాను.

"కాదు. మీరు గుర్తించరేదనుకుంటాను. అయినా ఎలాగుర్తిస్తారులే, చూచి చాలాకాలమయిందాయె! నేను బాంకురానించి వస్తున్నాను. మీకు—"

అని మా యిద్దరికి ఉన్న చుట్టరికపు ఫార్ములా నేను వల్లించుకొచ్చింది వప్ప జెప్పి—"మీరు నాకు అన్నగా" రవుతా రన్నాను.

ఆయ నేమీ మాట్లాడలేదు. మళ్ళీ నేను మొదలుపెట్టాను:

"మావాళ్ళు కలకత్తాలో చాలామంది ఉన్నారు. వారందరినీ చూడాలంటే చాలాకాలం పడుతుంది. అందుకనే ఈ మాటు మిమ్మల్ని చూసిపోదామని స్థిర పరుచుకున్నాను."

కూలీనెత్తిన ఉన్న రంగుపోయిన ట్రంకూ, మురికి బెడ్డింగూ చూసి వికాస బాబు "ఇక్కడే ఉంటారా?" అన్నాడు.

"ఎన్నాళ్ళో కాదు, నాలుగైదు రోజులు!" అన్నాను.

"ఊఁ" అని సన్నగా మూలిగాడు ఆయన.

సామాను దించి డబ్బులు తీసుకొని కూలీ వెళ్ళిపోయాడు. కాసేపయినాక అన్నయ్య ఫోంచేసి దుస్తులూ అవీ వేసు కుని బయటికి వెళ్ళాడు. నేను ఒక్కణ్ణే మెదలకుండా కూర్చున్నాను. కాని ఎక్కువసేపు నేనిలా కూర్చో నవసరం లేకపోయింది. ఇంటోనించి అంతా ఇంతా పిల్లలు అరడజనుమంది వచ్చి నన్ను చుట్టుముట్టి, ఒకడు పంచదార బిళ్లలు పెట్టమనీ, ఇంకొకడు గాలిపటం కట్టి వ్వమనీ వేధించసాగారు. అందులో ఒక పిల్లి నా జేబులోకూడా చెయ్యిపెట్టింది!

అందరికంటే నన్ను ఎక్కువ వేధిం చింది చిన్నపిల్ల. నా చెవుదగ్గర ఒక పులిపిరికాయ ఉంది. దాన్ని లాగుతూ ఆడుకో మొదలుపెట్టింది!

ఇంత స్వల్పకాలంలో పిల్లలు తప్ప ఎవరింత చొరవ చేసుకోగలరు?

......బజారికి నడవక తప్పలేదు.

*　*　*

మూడు రోజులు గడిచినై.

నేను కలకత్తా పది సంవత్సరాల క్రిందట వచ్చాను. మొట్టమొదట, చదవ టానికి రెండు సంవత్సరా లున్నాను. ఇప్పుడు ఈ మూడు రోజులనించి తిరు గుతున్నా నన్ను ఎరిగినవాళ్లు ఒక్కరు కూడా కనపడలేదు. సహపాఠులంతా ఎవరి దోవను వారు వెళ్ళిపోయారు. ఉపాధ్యాయులు కూడా చాలామంది కొత్తవాళ్లు. నే నిదివరకున్న 'మెస్'లో ఇప్పుడు హోటలు పెట్టారు.

తేలిన సంగతి-నన్నెవరూ గుర్తించ లేదు, నేనూ ఎవర్నీ గుర్తించలేదు. తిరిగి తిరిగి వికాసబాబు ఇంటికే చేరు కున్నాను.

మూడు రోజులూ ఇలాగే గడిచినై.

వికాసబాబు ఉదయంపూటే కాసేపు కనపడతాడు. ఆ కాసేపు కూడా మహా తొందరలో ఉంటాడు—'లేట్' అయి పోతుందేమోనని.

ఉదయం లేవగానే అంగవస్త్రం బుజాన వేసుకుని మార్కెట్టుకు పోతాడు.

అక్కడినించి కూరగాయలు వగైరాలు తీసుకుని త్వరగా వచ్చేస్తాడు. రావటం తోటే వొంటికి నూనె పట్టించుకుని పంపు దగ్గరికిపోయి స్నానం చేస్తూనే భార్యను కేకలువేస్తాడు.

"అన్నం వడ్డించు ఇదిగో నిన్నే !- లేట్ అయిపోతుంది పావుదక్కువ తొమ్మిది అవనే అయింది పోటానికి ఎట్లయినా ఘంట—"

తర్వాత ఆ మెతుకులు నాలుగూ ముక్కూ, నోటా కుక్కుకుని బయలు దేరుతాడు. ఇక తిరిగి రావటం ఒకో రోజున రాత్రి పదింటికీ, ఒకోరోజున పదకొండింటికీని. అందుకనే ఆయనతో కాస్సేపు తీరిగ్గా మాట్లాడాలంటే వీలు చిక్కటంలేదు.

ఆయన్ని చూస్తే నాకు అసూయ వేసేది. రోజూ చక్కగా ఆఫీసుకి పోతాడు. పగలంతా పనిచేసుకుంటాడు. రాత్రి హాయిగా నిద్రపోతాడు. ఉద్యోగస్థుడంటే ఇలాంటతనే!

అన్నయ్యను శరణుజొచ్చితే ?

ఆయన ప్రయత్నించాడంటే ఏదో ఒక నౌకరీ తప్పక నా కిప్పించగలు.

* * *

మర్నాడు ఆయనవెంట పడ్డాను.

ఆయన భోంచేసి ఆదరాబాదరా బయలుదేర బోతుండగా నేను — "అన్నయ్యా, నేను కూడా నీ వెంట వస్తాను," అన్నాను.

"నా వెంటా? ఎందుకూ ?" అన్నాడు అన్నయ్య.

"ఒకమాట అడగాలి—"

"ఐతే త్వరగా రండి. లేటయిందంటే ఆ ముండాకొడుకు వచ్చిపడతాడు."

నేను వెంటపడ్డాను.

"ఏం మాట ?" అన్నాడు వికాసబాబు నడుస్తూనే.

"పెద్ద విశేషం కాదు—" సంగతి ఎలా తేవాలో నాకు తోచటంలేదు.

"డబ్బూ దస్కం నేనప్పివ్వలేను- ఆ సంగతి ముందుగానే చెప్పుతున్నా" అన్నాడు వికాసబాబు.

"ఎబ్బే, నాకు డబ్బక్కర్లేదు— పదండి, ట్రాంమెక్కినాక చెప్పుతాను."

"నేను ట్రాంమెక్కను, నడిచే పోతాను."

"సరే, నేనుకూడా నడిచేవస్తాను. ఎంతదూరం పోవాలి ?"

"ఈడెన్ గార్డెన్ !"

"ఈడెన్ గార్డెన్‌లో ఆఫీసా ? ఏ మాఫీసు ?"

"ఆఫీసుకని మీ కెవరు చెప్పారు ?" అని వికాసబాబు నవ్వుతూ నావంక చూడ నారంభించాడు.

"ఐతే-?"

"అరి రామచంద్రా ! రోజూ నేను ఆఫీసుకి పోతున్నానని అనుకుంటున్నావా ?"

"మరి రోజూ ఎక్కడికి వెళ్తారు ?"

కాస్సేపు వెనకాముందాడి వికాస బాబు—"పారిపోతాను!" అన్నాడు.

నే నాశ్చర్యంతో ఆయన ముఖం చూస్తూ ఉండిపోయాను. వికాసబాబు చెప్పనారంభించాడు:

"మా నాన్న కొంత డబ్బు బాంకిలో ఫిక్సెడ్ డిపాజిటుగా వేసిపోయాడు. దానికి వచ్చేవడ్డీ నలభై రూపాయలతోనే కుటుంబం జరుగుతూ ఉంది మూడు సంవత్సరాలనించీ విసుగు లేకుండా ప్రయత్నిస్తున్నా నాకు ఉద్యోగం దొరక లేదు. ఎందుకూ సర్టిఫికెట్టూ—ఎం. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయాను! పదండి, లేటవుతోంది—మళ్ళీ, ఆ ముండాకొడుకు వచ్చాడంటే బెంచీ దొరకదు."

ఉభయులమూ కాసేపు మౌనంగా కొంతదూరం నడిచాము. వికాసబాబు మళ్ళీ చెప్ప మొదలుపెట్టాడు:

"ఇంటిదగ్గర వెళ్ళబెట్టేరు ఈ సంగతి పొరబాటునన్నా! ఇంటా విడకు అసలు సంగతి తెలియదు. నేను పెద్ద ఆఫీసులో జీతంలేకుండా 'అప్రెంటిస్' గా పనిచేస్తున్నానని చెప్పాను. అందుకనే ఇంత తొందరగ నాకు అన్నం వండి పెడుతోంది!"

ఆ తర్వాత కాసేపు మెదలకుండా తోడు తోడుగా నడిచాము. వికాసబాబు మళ్ళీ ప్రారంభించాడు.

"పారిపోయి వస్తున్నానంటే అర్థం కాలేదా? ఇంట్లో ఆ పిల్లల నందరినీ పెట్టుకుని కూర్చుండట మంటే నాకు పరమ అసహ్యం! వాళ్లెప్పుడూ పోరు పెడుతూ ఉంటారు—'బూర కొనిపెట్టు, బొమ్మలు తెచ్చిపెట్టు, పిప్పరమెంటు బిళ్ళలు పెట్టు!' అని. ఇక ఇంటావిడ కోరికలు కూడా కొన్ని ఉంటై! అందుకనే తప్పుకొస్తాను. అర్థమైందా?"

మళ్ళీ కాసేపు మౌనం.

కాసేపుండి వికాసబాబు తిరిగి నవ్వుతూ మొదలుపెట్టాడు:

"ఇంట్లో ఉంటే చాలా ఇబ్బందులున్నై. గ్రహించారా? ఆవాళ రాత్రి నేను ఇంటికొచ్చేవరకు చిన్నవాడు మెట్ల మీదినించి పడ్డాడనీ, తల పగిలిందనీ తెలిసింది. నెత్తురుకూడా ఎక్కువగానే కారిందిట. నేను ఇంటిదగ్గర ఉన్నట్లయితే అప్పుచేసి అయినా డాక్టర్ని పిలవక తప్పేది కాదు. లేను కాబట్టి—నిశ్చింత! పదండి. కొంచెం కాలు సాగనివ్వండి ఈడెన్ గార్డెన్‌లో పొన్నచెట్టు క్రింద ఒక బెంచీ ఉంది. పగలంతా దానిమీద గడుపుతాను— కూర్చునో, పండుకునో. ఊఁ, పదండి; లేటయిందంటే ఇంకో ముండాకొడుకున్నాడు—వాడొచ్చి భుక్తపడచుకుంటాడు, దాన్ని. ఇప్పటికైనా గ్రహించారా?"

ఇద్దరం వడివడిగా సైదోడుగా నడుస్తున్నాము—ఈడెన్ గార్డెన్‌లోని కాళీ బెంచి చేయిజారి పోతుందేమోనని

—

# అగ్ని పరీక్ష

మాదిరెడ్డి సులోచన

(గత సంచిక తరువాయి)

"ఆ మాట అనడానికి సిగ్గుపడాలి మీరు".

"నేను...నిన్ను చేసుకున్నందుకే సిగ్గుపడాలి."

"అది రోజూ అనే మాటేగా. వెళ్లి వదినగార్కి టెలిగ్రామ్ ఇవ్వండి "

సరళ పర్స్, పెట్టె గాలిస్తే రెండు రూపాయలు దొరికాయి. అతనిదగ్గర ఓ రూపాయి ఉంది. అంతా కలిపి టెలిగ్రామ్ ఇవ్వమని చెప్పింది. ఆ రాత్రి టెలిగ్రా మివ్వాలంటే చికాకుపడ్డాడు. అయినా తప్పదు

"ప్రొద్దుటే వెళ్లి సుజాతకీవిషయము చెప్పి, పనిలో చేరండి."

"పనిలో చేరకపోతే పస్తుంటాను నిన్నేం అడగనులే". విసురుగా వెళ్లిపోయాడు.

మర్నాడు ఉదయము కాఫీ తెచ్చిన సరళ కెవ్వుమంది. నిర్మలశరీరం చల్లగా కర్రలా ఉంది. ఏమిటంటూ, భర్త, అత్త రావటం చూచి బావురుమంది.

"నిర్మల...నిర్మల... పోయింది,' అన్నది. సుందరమ్మ శోకాలు మిన్ను ముట్టాయి. నిర్మల శవాన్ని క్రిందకు దింపారు.

నిర్మల తల్లితండ్రులు వచ్చాక, దహనసంస్కారాలు జరిగాయి. ఆనాడేమో త్రిలోకనాధులు, స్వాములు అంటూ ధారాదత్తంచేసిన వారే ఈరోజు సరళను నిందించసాగేరు. రఘుతో పోట్లాడి వెళ్లిపోయారు. ఖర్చులన్నీ విష్ణు భరించాడు.

"వెళ్లేవారు మీ మనువడిని తీసుకుపొండి."

''మనవడా, మట్టిగడ్డలా! దాంతో పాటు కాష్టంలో పడేస్తే పోయే ది". అన్నది తల్లి. నీరసంగా. తన జీవం ఉందని తెలుపుతూ అటూ ఇటూ కదిలిన పిల్లవాడికి సరళే పాలు పట్టింది

"వాడిని చావనియ్యవే," అంది సుందరమ్మ

"వాడు నేను పుడతానంటూ వచ్చాడా! పుణ్యం, స్వర్గం, లోకకల్యాణం అంటూ, వాడి జన్మకు కారకులు మీరు."

"వాడిని పెంచి ఏంచేద్దామని..."

''వాడు బ్రతికితే ఆలోచిద్దాం,'' అన్నది నిర్లక్ష్యంగా. సరళ అంచనా తప్పుకాలేదు. నాల్గురోజులనంతరం, ఓ సాయంత్రం తల్లిని వెతుక్కుంటూ పోయాడా కారణజన్ముడు. ఆ పిల్లవాడి జన్మకెవరూ సంతోషించనట్టే, అతని మరణానికి ఎవరూ విచారించలేదు. గడ్డిపూలు పూస్తాయి, రాలిపోతాయి. అలాగే వాడూపోయాడు. రఘు పిచ్చిగా చూచాడు. భూస్థాపితంచేయక తప్ప లేదు. నాల్గురోజులు పాలు త్రాగించిన మమకారమేమో, సరళ రెండు కన్నీటి బొట్లు రాల్చింది

## 36

దాదాపు నెలరోజులు గడిచినా రఘులో మార్పురాలేదు. సరళ ఇక నిర్లిప్తంగా ఉండలేకపోయింది. పిల్లలు నిదురపోయాక మెల్లగా అతని దగ్గర కెళ్లింది.

"ఏమండీ!''

''ఊ...'' అటు తిరిగాడు. ఆరోజు సుజాత వచ్చి వెళ్లింది. కొంచెం త్రాగి వచ్చినట్టున్నాడు.

"ఇంటివాళ్లు సాయంత్రం అన్న మాటలు విన్నారా?"

"ఊ..."

"ఏం ఆలోచించారు ?"

"నేనేం ఆలోచించాలి! ఉద్యోగం చేస్తున్నావు ఇచ్చేయి ".

"నాకెంత వస్తుందో మీకు తెలియదా!"

"......"

"రేపు సుజాతవాళ్ల వర్క్‌షాపు కెళ్లండి. అడ్వాన్సుగా వాళ్లదగ్గర కొంత డబ్బు అడిగి ఇంటివాళ్లకిద్దాం. వెడతారు కదూ?"

"వెళ్లను." కళ్లు మూసుకున్నాడు.

"ఎందుకో?" అతన్ని తనవైపు తిప్పుకుంటూ అడిగింది. అతను పరాయి వ్యక్తి తన్ను ముట్టుకున్నంత కంపరంగా ఆమె చేయి తీసివేశాడు.

"మాట్లాడరేమండీ!"

"నాయిష్టం. నీ పొగరు నాకుతెలుసు సంపాదిస్తున్నాననేగా! నీ చండాలపు కూడు నాకొద్దు. రేపు ఏదైనా విషం తెచ్చి పిల్లలకు పోస్తాను. నేను త్రాగు తాను. నీకు వీధినిండా ఆత్మీయులేగా. వారితో కులుకుదువుగాని."

"మీ రీ మాటలు త్రాగిన మైకంలో అంటున్నారా ? నన్ను అర్థంచేసుకుంది ఇంతేనా ?"

"సుజాతకు డబ్బు ఇవ్వవద్దని చెప్పింది నీవు కాదూ ?"

"సుజాత కంపెనీలో పనిచేయటానికి అభిమానము అడ్డువస్తుంది. డబ్బు అడగడానికి రాదా ? మనమా పిల్లకేం ఇచ్చామని! అడగడానికి కొన్ని హద్దు లుండాలి."

''అన్ని హద్దులు నాకేనా ? నీకేం

వద్దా? అవునులే సంపాదించేదానివి కదూ!" వెటకారం చేశాడు రోజూ ఇదే తంతు. అతను ఏవో మాటలతో గాయపరచటము, ఆమె ఏడవటం పరిపాటి అయింది ఇద్దరి మధ్య యెన్నో ఆమడల దూరం అన్పించసాగింది. లాలించి, బుజ్జగించి అడిగినా, నచ్చచెప్పినా నిరాసక్తిగా చూస్తాడు. తను అభిమానం విడిచి సుజాతను ఇంటి అద్దె అడగలేకపోయింది. ఫలితం, ఓ సామాన్యతం సామాన్లు వీధిలో పడవేసి, తాళం వేసుకుంది ఇంటామె. అప్పటికే అయిదు నెలలు గడిచాయి అద్దె ఇవ్వక. ఇంటిముందు బేలగా నిల్చున్న సరళ సంసారాన్ని డాక్టర్ రాజన్ చెల్లెలు చూచింది. జాలిపడి తమ అవుట్ హౌస్‌లో ఉండమని కోరింది అంతకన్న ఆ క్షణంలో వేరే మార్గం కన్పించలేదు. కందిపోయిన రఘు ముఖం చూస్తే సరళ రోడ్డువారే నిల్చునేది కాని వారింటికి వెళ్లేదికాదు.

## 37

మోటార్ సైకిల్ స్లిప్ అయింది. విష్ణు కాలుకు కొద్దిగా దెబ్బతాకింది. ఇంట్లోనే పడుకున్నాడు. ఆఫీస్ ఫైళ్లు తీసుకుని త్వరగా వచ్చింది సుజాత. అతను మంచి నిదురలో ఉన్నాడు. కాలు దిండుపై ఉంది. నుదుట స్వేద బిందువులతో విధిలేక పడుకున్నట్టు ఉంది. ప్రక్కనే కూర్చుని అతని నుదుటపై స్వేద బిందువులు తుడిచింది అతను మేల్కొన్నాడు.

"మీరెప్పుడూ ఒక గంట స్థిమితంగా ఉండరు. ఈరోజు మంచి శిక్షేపడింది."

"శ్రీరామ్ కంపెనీ ఇచ్చాడులే నిన్న బొంబే పంపమన్న ఉత్తరం పంపావా?"

"లేదు స్లైటు మాడిఫికేషన్ చేయాలి."

"చేసి పంపలేకపోయావా?"

"మీ అనుమతి లేనిదే..."

"అంతా పతివ్రతా లక్షణం కాబోలు."

"పతివ్రతను కావాలని కాదు. స్వతంత్రించానని అనుకునే ఆస్కారం మీకెందుకివ్వాలి?"

"అపార్థం చేసుకుంటానని కలగాని వచ్చిందా?"

"లేదుగాని, మొగవారి మాటలకు అర్థాలు వేరు అనాలిప్పుడు."

"ఎందుకో!"

"అన్నయ్య చూడండి. వదినను ప్రేమించి, ఇష్టపడి వివాహం చేసుకున్నాడు. ఇప్పుడు ఆమె చేసే ప్రతి పని తప్పుగానే కన్పిస్తుంది. హీనాతి హీనంగా విమర్శిస్తాడు .చివరకు... తన శీలాన్ని కూడా శంకించే స్థితికి దిగజారిపోయాడు. ఆమె పిచ్చిదానిలా తయారయింది."

"తప్పు అతనిది కాదు. పరిస్థితులు అలా అనిపిస్తున్నాయి. కష్టాలలో నిల

ద్రొక్కుకున్నవాడే, ఆత్మస్థైర్యం గలవాడే నిజమైన మనిషి. కొందరు ఏదో కాంప్లెక్స్‌తో తాము బాధపడుతూ, ఇతరులను బాధపెడతారు. యెదుటివాడు ఏది చెప్పినా చెడుగానే విన్పిస్తుంది..."

"లెక్చర్ ఇచ్చేశారా ?"

"కాదు. నీకు నిజం చెబుతున్నాను. నేనంత బలహీనుడిని కాను. ఒకవేళ నీవల్ల ఏదయినా పొరపాటు జరిగినా దిద్దుకునే శక్తి ఉందిలే."

"అంగీకరించాము..." నవ్వుతూ, స్వతంత్రంగా, అతని బుగ్గపై చుంబించింది. ఆమె మెడపై చేయిపోనిచ్చి మత్తుగా చూచాడు.

"ఏమిటి కొత్త పెళ్లికొడుకులా !"

"ప్రేమానురాగాలు అమరమయినవి సుజా. వాటికి కాలం, వయసుతో పని లేదు. సావరస్యంగా జరిగే సంసారంలో ఇవి నిత్య నూతనమై ఉంటాయి."

"అలాగా !...టీ త్రాగుతారా ?"

"ఇస్తే వద్దంటామా !"

ఆమె టీ చేసి భర్తకిస్తుండగా ఉదయ్ పైకి వచ్చాడు. తనకు చేసుకున్న టీ అతనికిచ్చింది.

"ఏమన్నయ్యా, ఈ సమయంలో మీరింట్లో ఉంటారనుకోలేదు."

"పరిస్థితులు ఉండమంటే ఉండాల్సిందే..." కాలు బెణికిన ఉదంతం చెప్పాడు.

"వదినా ! రేపు వాసంతికి ఏదో సీమంతమట. మీరు రావాలి" అన్నాడు.

"అలాగే... కంగ్రాచులేషన్స్."

"థ్యాంక్స్ ! అన్నయ్యా, వివాహ జీవితం సుఖమయం కావాలంటే, ఈ పెద్దలను దూరంగా పంపించాలి. లేని అంకులు పెడతారు. అమ్మ ఇంత చాదస్తం అని అనుకోలేదు." విష్ణు ముఖంపై చిరునవ్వు చూచి అన్న తనను సమర్థించటం లేదని తెలిసిపోయింది.

"నీకు గజ, గజ వణికిపోయేవారు. నాకయితే తలనొప్పిగా ఉంది."

"ఉదయ్ ! ఎటువంటి వారయినా, తల్లి, తండ్రులేరా. వాళ్లను విమర్శించే అధికారము నీకు లేదు. భార్య స్థానం భార్యదే. పెద్దల స్థానం పెద్దలదే" అన్నాడు. అతనో అరగంట ఆ మాటా, ఈ మాటా మాట్లాడి వెళ్లిపోయాడు. క్రిందకి వచ్చి ఉదయ్ పిలిచిన విషయము చెబితే, కాంతమ్మ బాధపడింది.

"అంత నిర్లక్ష్యంగా పిలిస్తే వెళ్లడం దేనికి ?" కమలమ్మ కసురుకుంది. సుజాత అత్తవంక చూచింది.

"పరాయివారా! వెళ్లిరా" అన్నది. ఆ తరవాత ముగ్గురూ చాలాసేపు బాధపడ్డారు.

అలసి పడుకుంది, కమలమ్మ. విష్ణు పిలవటంతో కంగారుగా లేచింది.

"ఏమిటి నాయనా, ఇలా వచ్చేవ నన్ను పిలిస్తే నేనే వచ్చేదాన్నిగా."

"పరవాలేదు విన్నీ" చనువుగా ఆమె మంచంపై కూర్చున్నాడు.

"విన్నీ! ఈరోజు ఉదయ్ తో మాట్లాడుతుంటే కొత్తవిషయాలు తెలిసి వచ్చాయి. రాజీవ్ రెండుసార్లు అపనంగా పరీక్షకు కూర్చున్న డబ్బు లెక్క కడుతున్నాడు. అందుకే మిమ్మల్ని ఓ ప్రశ్న అడగాలని వచ్చాను. నీకు రేణు ఒక్కర్తే కూతురు ఇప్పుడు. మాకు ప్రభ, రమ ఉన్నారు. ఉమ్మడి ఆస్తి పోయిందన్న తగాదా వద్దు. మీది మీరు చూసుకుంటే నాకేం అభ్యంతరంలేదు."

"విష్ణూ!"

"అవును విన్నీ. అది నీవల్ల కాదంటే కలిసే ఉందాం."

ఎంత కచ్చితంగా మాట్లాడుతున్నావురా?"

"జరుగుతున్న విషయాలుచూస్తుంటే, అంత్య నిష్ఠూరంకంటే ఆది నిష్ఠూరమే నయము అనిపించింది."

"ఒకప్పుడు మూర్ఖంగా ఏదయినా అంటే మనసులో పెట్టుకోకురా. నీ అండన ఇలాగే వెళ్లిపోని నా జీవితం. ఈ పిల్లలను అదుపులో పెట్టటము నా తరమా! ఇక పెళ్లిళ్లు, నువ్వు సంపాయిస్తావ్, నీ చెల్లెండ్ల కిస్తావు..."

"అంతమాత్రం అర్థంచేసుకుంటే చాలు విన్నీ." అతను లేచి తల్లిదగ్గర కాసేపు కూర్చుని, నెమ్మదిగా మేడ యెక్కాడు.

## 38

"సరళా!"

"ఊఁ" అన్నది పచ్చడి రుబ్బుతూ.

డాక్టరుకు నీకు యెలా పరిచయం అయింది."

"ఇదివరకు చాలాసార్లు చెప్పాను."

"నాకు మామూలు పరిచయంలా కన్పించటంలేదు."

"కామెర్ల రోగి శాస్త్రం..."

"షటప్...స్త్రీని మహా మహావాళ్లే అర్థంచేసుకోలేదు. నేనెంత! నీకు నా సంపాదన ముఖ్యంగాని నేను కాదు. నా ఉద్యోగం ఊడేసరికి నేను పనికి రాకుండా పోయాను డాక్టరు కావల్సి వచ్చాడా!..."

"ఛీ...ఛీ ... మీకు మతిఉండే మాట్లాడుతున్నారా?"

"నీ కెంత పొగరే... నాకు మతి లేదంటావా?" వంగదీసి వీపుపై దబా, దబా గుద్దాడు. కిక్కురుమనలేదు. ముందు డాక్టరు కుటుంబం ఉంది. వింటే పరువుపోతుంది. జుట్టుపట్టి అటూ, ఇటూ కుదేశాడు.

"నిజం చెప్పవే."

"మీకు ఏంచెప్పినా అర్థంకాదు," అన్నది. శరీరం అప్పగించి ఊరుకుంది. అతను చేతులు నొప్పిపుట్టేవరకు దెబ్బలు కొట్టి వదిలేశాడు. పిల్లలు అరవ బోయారు. సరళ సైగననుసరించి అలాగే నిలబడిపోయారు. అతను బయటికి వెళ్లిపోయాడు. చిల్లా, పల్లం అయిన పచ్చడి ఒక్క దగ్గర చేర్చి గిన్నెలోకి తీసింది.

"ఏమిటే... ఆ గొడవ..." సుందరమ్మ అడిగినా ఎవరూ జవాబు చెప్ప లేదు. లోపలికి వెళ్లి తనముఖం చూచుకుంది అద్దంలో. ఉబ్బి భయంకరంగా ఉంది. బడికిపోవటం కుదరదని డాక్టరు గారి చెల్లెలికి లీవు లెటరిచ్చి పంపింది, చిట్టితో.

సాయంత్రం పంపుదగ్గర బట్టలు ఉతుకుతుంది సరళ. డాక్టర్‌గారు క్లినిక్‌కు వెళ్లటానికి బయటకు వచ్చాడు. అతని గరాజ్ పక్కనే పంపు.

"ఏమండీ..."

ఉలిక్కిపడి చూచింది సరళ. ఆమెను చూస్తూనే అతను చలించిపోయాడు.

"మీవారిని మంచి డాక్టరుకు చూపించాలమ్మా. ఇందాక వచ్చి 'నా భార్యకు విడాకులు ఇస్తాను. మీరు పెళ్లిచేసుకోండి' అన్నారు. నాకేం అర్థంకావటం లేదు."

"డాక్టరుగారూ! మావల్ల ఇలాంటి అవమానాలు జరిగితే క్షమించండి. మరో నాలుగు రోజులలో ఇల్లు చూచుకుంటాము."

"అది కాదమ్మా...నేను వెళ్లిపొమ్మనటంలేదు. ఆయన ఆరోగ్యం. ఐమీన్, మానసిక ఆరోగ్యం, బావున్నట్టులేదు."

"అంటే...అంటే..."

"అలాగే వదిలితే పిచ్చి..."

"డాక్టర్ గారూ!"

ఒక్తి ఆడవిమనుషుల మధ్య. మమ్మీ ఇంకా కొన్నాళ్లు పోవాలి". భర్తవైపు గోముగా చూచింది. ఉదయ్ అదేదో విట్టు అయినట్టు నవ్వుతున్నాడు. అందరూ జత కలిపారు సుజాత ముఖం చిన్నబోయింది. తను తెచ్చిన ప్యాకెట్టు తీసుకువెళ్లి వాసంతి కిచ్చింది. బొట్టు పెట్టించుకుంటుందో, లేదో అని భయ పడుతూ. అందరు భోజనాలకు బదులు, పడకగదిలో అమర్చిన పానీయాల వైపు వెళ్లారు, 'చీర్స్' అత్తా, అల్లుడు గ్లాసులు తాకించుకున్నారు. సుజాతకు వింతగా ఉంది. "ఆడవారు త్రాగుతారా అత్తయ్యా?" నెమ్మదిగా అడిగింది.

"వాళ్లు ఆడవాళ్లటే తల్లీ. అంతా ఖర్మ."

సుజాతకు నవ్వు వచ్చింది. పొత్తుల సంసారం పోరంటూ వేరయితే అక్కడా సుఖం లేదు.

"పెద్దమ్మా! త్రాగుడు పార్టీ ఈరోజు తెమలదు గాని, మాకు వడ్డించేయి." వాసు బయటికి వచ్చాడు. బయటనుండి రాజీవ్, చలపతి వచ్చారు. అందరికీ వడ్డించింది. పక్క గదిలోంచి నవ్వులూ, కేరింతలు తేలివస్తున్నాయి. ఏదో ఇంగ్లీష్ రికార్డు వేసినట్టున్నారు. మ్యూజిక్ వినపడుతూంది.

"ఈ రోజు డ్రింకింగ్ పార్టీయా?" రాజీవ్ అడిగాడు.

"ఈ రోజు అంటున్నావ్, రోజూ ఉంటుందేమిటి?" వాసు అడిగాడు.

"ఆదివారం, ఆదివారం ఉంటుందిరా."

వాళ్లు భోజనము చేస్తుండగా, ఉదయ్ బయటికి వచ్చాడు.

"మీరు అప్పుడే వచ్చేశారేం నాన్నా?" తీక్షణంగా ఉంది కంఠం.

"మీ అమ్మ ఏదో పేరంటం..."

"అది ఆడవారికి..." మధ్యలోనే త్రుంచేశాడు. "ఇలా అయితే సంసారం అయినట్టే. వ్యవసాయదారు డంటే, పొలం తప్పవేరే ఏం గుర్తుండ రాదు."

"ఇంట్లో ఇంత పండుగయితే ఆయన ఒంటిగా అక్కడ భోజనం చేస్తారా! నేనే రమ్మన్నాను."

"నీకెన్ని సార్లు చెప్పాలి. ఇలాంటి విషయాలలో తలదూర్చ వద్దు అని."

"అవునులే. ధర్మరాజు వంటి కొడుకును కర్కోటకుడు అన్నందుకు అనుభవించాలి." గొణుక్కుంది.

"అమ్మా! ఏమిటి నీ సణుగుడు! ఒక్క నిముషం శాంతంగా ఉండనివ్వవు కదా!"

"ఉదయ్ బాబూ..." అత్తగారి పిలుపు వింటూనే ఆదరా బాదరగా వెళ్లిపోయాడు.

"రావే అమ్మా, మనము తిందాము. వచ్చి పోట్లాడినా పోట్లాడ గలదు." అన్నది. ఇద్దరు, భోజనాలు చేసి, వాసు సుజాత ఇంటికి వచ్చేశారు. వరండాలో

# తెల్లని బట్టలు నీరకాయ పట్టుతున్నయ్యా?






## నీరకాయ రంగును అలా ఒలిచేసే పౌడరు

## కొత్త రిన్సో

సబ్బు వాడుతూ వుండటం వల్ల మీ తెల్లని బట్టలు నీరకాయరంగు కావటం గమనించారా? అలాటి వాటిని తొలగించేదే రిన్సో: డిటర్జంట్–ఉతుకు–విధానంలో రిన్సో ప్రతిభావంతమైన ప్రగతి సాధనం. అక్షరాలా మిరుమిట్లు గొలిపేలా తెల్లగా చేస్తుంది అది అతి సరసమైన ధరకు అమూల్యమైన నాణ్యత

## మిరు మిట్లు గొలిపే తెల్లని ఉతుకు కోసం రిన్సో

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్ RINSO I 77 TL

శ్రీరామ్‌ను గుఱ్ఱం (కొయ్యది) యెక్కించి ఆడిస్తున్నాడు విష్ణు.

"వదినా, మరిది రాత్రివరకు రారను కున్నాను." అన్నాడు.

"వారం రోజులు ఉందామనే అను కున్నాము. నీకు కోపం వస్తుందని వచ్చే శాము" అన్నాడు.

"మంచి పని చేశావు. స్పేర్ పార్ట్స్ వచ్చాయిట. నేను ఈ పూట వెడితే కాలు మరీ నొప్పి అవుతుందో ఏమో, కాస్త వెడతావా!"

"అలాగే...వదినా! కాసింత టీ..."

"అలాగే." కొడుకును ముద్దాడుతూ లోపలికి పోయింది. నాల్గు ముక్కల్లో వాసు పేరంటం విశేషాలు చెప్పాడు.

"ఉదయ్ అలా మారాడా!"

"నేను చూడక పోతే నమ్మక పోయే వాడిని. ఆమె అత్తకాదు..."

"పోనీరా... మన కెందుకురా!" అన్నాడు. వారు టీ త్రాగినాక వాసు వెళ్లిపోయాడు.

"ఏమండోయ్ అడవి మనిషిగారూ! ఒకసారి మా వాళ్లను చూసి రావాలి." అన్నది తమాషాగా సుజాత.

"తమ్ముడి కాంప్లిమెంటా, మర దలిదా?"

"ఊహించండి చూద్దాం."

"ఉదయ్ అంతమాట అనలేదు. వాసంతే అని ఉంటుంది. ఔనా!"

"తమరి ఊహ తప్పవటం యెప్పుడూ చూడలేదుగా."

"మరి కాస్త విస్కీ రుచిచూడక పోయావా?"

"ఈ సారి వెడితే చూస్తాను లెండి. మరి నాకు పార్టీలో పాల్గొనే దుస్తులు అవి కొనిపెట్టండి."

"నాగరికత పేరుతో వేసే పిచ్చి గంతులు. వీడికింతడబ్బెలా వస్తుందో.."

"లంచాలు గుంజడంలో ఆరితేరా డట మీ తమ్ముడు."

"నాకే సిగ్గుగా ఉంది సుజా! నాచేతి క్రింద తర్ఫీదు పొందిన ఉదయ్ ఇలా అయ్యాడంటే..."

"మంచి అలవాట్లు నేర్చుకోవాలంటే ఏళ్లు కావాలి. దిగజారిపోవటానికి కొన్ని క్షణాలు చాలు. పదండి, మరోసారి అయొడెక్స్ రాసి వెడతాను." అన్నది. ఇద్దరూ మెల్లగా లోపలికి వెళ్లిపోయారు.

## 40

"అందరూ దొంగలూ, కమ్యూని ష్టులు! అవును...నేను, నేను ఏ వర్గా నికి చెందినవాడిని? జమీందారును... కాదు అంతా ప్రభుత్వం లాక్కుంటుంది. నాయకుడిని...ఎంత బావుంటుంది... పనిలేదు...హాయిగా ప్రారంభోత్సవాలు, కార్లు, షికార్లూ..." రఘు పెద్దగా నవ్వాడు. అతనలా అరుస్తుంటే పిల్లలు తమాషగా చూస్తున్నారు

"మీరు ఇంట్లోకి పదండి." సరళ మృదువుగా పిలిచింది.

"నువ్వు...నువ్వు ఎవరు నన్ను పిలువటానికి ?"

"వీధిలో వారంతా వినోదం చూస్తు న్నారు. ఇంట్లోకి పదండి" చేయి పట్టి లేవదీయబోయింది. ఒక్క నెట్టు నెట్టాడు ఆమె తలకు గేటు తగిలింది. బొప్పి తడుముకుంటూ ఇంట్లోకి వచ్చింది.

"అత్తయ్యా; నేను పిలిస్తే రెచ్చి పోతున్నారు; మీరు వెళ్లి పిలవండి," అన్నది సుందరమ్మతో

''బంగారంలాంటి నా కొడుక్కు ఇదేం రాత రాశావురా దేవుడా!'' ఆవిడ ఓ శోకం పెట్టి బయటికి వెళ్లింది

"రఘూ! ఇంట్లోకి పదరా తండ్రీ." అన్నది దగ్గరగా వచ్చి.

''ఏమన్నావ్! తండ్రినా!...అహ! అహా...'' పెద్దగా నవ్వాడు.

"ఈ నాటకాలు నా దగ్గర చెల్లవు. నేను రాజుకు, చిట్టికి మాత్రమే తండ్రిని ...నువ్వు...నువ్వు నిర్మలను చంపావు. నన్ను చంపుతావు. ఫో...దూరం పో..."

"రఘూ! అమ్మనురా...''

"నాకుఅమ్మఉందంటావా!...సరే ఓ పది రూపాయలు ఇలా పడేయి... చూశావా! అమ్మవు కావు."

"నా దగ్గర డబ్బెక్కడిదిరా? నేను ఉద్యోగం చేస్తున్నానా? మీ నాన్న సంపాదించింది ఉందా?"

"ఉద్యోగం చేస్తావా! నేను బ్రతికి ఉండగానే... చెప్పు చేస్తావా!" తల్లి గొంతు పట్టుకున్నాడు లేచి.

"వదలండి..." సరళ వచ్చి అతని పట్టునుంచి ముసలమ్మను వదిలించింది.

"నీకు బాగా పొగరెక్కిందే. నిన్ను చంపితే శాంతి.''

సరళ నేర్పుగా తప్పించుకుని గదిలో దూరి తలుపువేసుకుంది.

"అమ్మా! అది భయపడి పోయిందే ...నువ్వేడుస్తున్నావా! వద్దు. ఇల్లు కట్టిస్తానుగా. అప్పుడు చెల్లెండ్ల కందరకు సారెలు పెడతాను." ఆమె దగ్గరగా జరిగాడు. ఆమె పైప్రాణాలు పైనే పోయాయి. భయంగా చూచింది.

"ఎందుకే ఆ భయము. ఆ సరళ మాట వింటాననేగా!" గుసగుసగా అన్నాడు

"అది ఉద్యోగానికి పోతుందిగా! అప్పుడు అప్పు చేస్తాను. ఆ తరవాత మనము పిండివంటలు చేసుకుందాం."

అతన్ని చూస్తే సుందరమ్మ హృదయం నీరు అయింది. ఆమె నోట్లో గుడ్డ కుక్కుకుంది.

''అయ్యో! నాకు చావురాదేమిటి!" తల బాదుకుంది.

"ఓహో! చచ్చి పోదామనే... ఎంతాశ! మార్వాడీ దగ్గర అప్పు లెవరు చేయిస్తారు! సరళను ఎవరు సాధిస్తారు? అవును సరళను సాధించి




బాధ నివారణ కోసం
అయొడెక్స్
రుద్దటం అవసరం

ఇతర ఆయింట్‌మెంట్స్ మీకు బాధనుంచి ఉపశాంతిని యియ్యవచ్చు అయొడెక్స్ ఉపశాంతిని యిస్తూ, బాధను నివారిస్తుంది దీనిలో అయొడిన్ ఉంది గనక.

కండరాల నొప్పులకూ, కీళ్ళ నొప్పులకూ ఒకే ఒక ఆయింట్‌మెంట్-అయొడెక్స్.






అయొడెక్స్-మిమ్మల్ని మళ్ళీ చురుకుగా పనిచేసేలా చేస్తుంది.

లింటాస్-10 DEX.3-75 TL

నందుకు, నిర్మలను చంపినందుకు శిక్ష పడాలి." తల్లిపైకి ఉరకబోయాడు. సరళ తలుపు తీసుకునివచ్చి అతన్ని పట్టుకుంది.

"ఏయ్ వదులు."

"కాసేపు పడుకోండి "

"పడుకుంటాను. నిర్మలను చంపింది అమ్మకాదూ ?"

"ఆయిమ మూడి చనిపోయింది."

"ఏమన్నావ్ !" ఆమెను విదిలించి, రెండు తగలనిచ్చాడు. "నా కెదురు చెప్పుటయే నీధ్యేయమా !"

"లేదండీ...అత్తయ్యే చంపింది."

"నేను తాగుతానా !"

"నేను.. నేను తాగుతానా?"

"లేదండీ. ఆమాట యెవరన్నారు?"

"నువ్వు అనలేదా! . గుడ్. పద పడుకుంటాను.." అతను కళ్లు మూసుకున్నాడు. డాక్టర్ రాజన్‌వచ్చి ఇంజెక్షన్ ఇచ్చాడు.కాసేపు గొణుక్కుని నిదరలోకి జారిపోయాడు ఆ రోజంతా అలాగే నిదరబోయాడు. రాత్రికూడా లేవలేదు. ఇంజక్షన్ ప్రభావమే అనుకుని, నిదర బోయింది. మధ్య రాత్రి మేలుకున్నాడు రఘు భార్యను తట్టి లేపాడు. సరళ భయంగా అతని వంకచూచింది.

"అలా చూస్తావేం సరూ ?" ఆప్యాయంగా ఆమె బుగ్గలు పుణికాడు. చాలా కాలం తరువాత అతని కన్నులలోకాంతి, అనురాగం తొణికిసలాడటం కన్పించింది. అతనిచేతులు చెంపల కాన్చుకుంది. అతని చేతిలో ఏవో కాగితాలున్నాయి.

"మీరు ఎప్పుడు లేచారు ?"

"చాలా సేపయింది !"

"ఏమిటండీ, ఇవన్నీ?"

"ఓ.. ప్రభుత్వానికి.. ఉద్యోగం కో దరఖాస్తు. ఇది.. ఇంటికోసం. నన్ను క్షమించు సరూ. మిమ్మల్ని ఈ మూలకు తీసుకువచ్చి పడేశాను. "

"పరవాలేదండీ.మీరిలా సంతోషంగా ఉంటే, గుడిసె అయినా పరవాలేదు."

"ఈ కవర్లకు స్టాంపులు కావాలి. డబ్బులున్నాయా ?"

"ఎంత కావాలి ?"

"రూపాయి చాలు."

"అంతేగదా. ఉంది పొద్దుట లేచాక వెడుదురు గాని."

"ఆలస్యం అమృతం విషం అనేది తెలియదా ?"

"తెలుసు. ఇంతరాత్రి పోస్టాఫీసు ఉంటుందా !."

"ఆ విషయము మరిచేపోయాను. అయామ్ సారీ. నా సరసన పడుకోవాలంటే భయమా సరూ ?"

"అదేంలేదు."అన్నది కొన్నిరోజుల క్రితం సిగ్గువిడిచి, అతని సరసనచేరితే, అసహ్యంగా చూచి, లేచి వెళ్ళిపోయాడు. కుదుటపడుతున్న అతని మనసులో రాయివేటము భావ్యంకాదని ఊరుకుంది.

# పెరిగే వయస్సుకు ప్రియ మిత్రము-ఇంక్రిమిన్*!

ఉప్పొంగే జీవితం. పెల్లుబికే శక్తి సంపూర్ణమైన ఆరోగ్యం! పెరిగే వయస్సులో మీ పిల్లలకు ఇన్‌క్రిమిన్ టానిక్ ఇవ్వండి. ఇన్‌క్రిమిన్ సిరప్‌లో ఉపయోగకరమైన విటమిన్లు, ఐరన్ మరియు అవసరమైన అమినో ఏసిడ్-పెరిగే వయస్సులో ముఖ్యమైనవి అన్నీ వున్నాయి.







## ఇన్‌క్రిమిన్*

## ఇన్‌క్రిమిన్ టానిక్-పెరిగే పిల్లలకు వరప్రసాదం!

డాక్టర్లు విశ్వసించే పేరు- Lederle ఎ డివిజన్ ఆఫ్ సయానమిడ్ ఇండియా లిమిటెడ్
• అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

SISTAS-INC-3088A TEL

"ఇలా రా " చేయిబట్టి లేవదీశాడు లేచి అతని సరసనే పడుకుంది

"సరూ! ఉద్యోగం దొరికితే అప్పులు అన్నీ తీర్చిపారేద్దాం "

"అలాగేనండీ'' అన్నది అప్యాయంగా, అతనివీపు నిమురుతూ అతను తోటకూర కాడల్లాఉన్న సరళచేతులు ఆప్యాయంగా తన మెడచుట్టూ వేసుకున్నాడు

''ఎలా అయిపోయావో చూడు పనిమనిషిని పెడతాను సరళా" అన్నాడు

''మంచిది "

"నమ్మకం లేదు కదూ!"

"అలాగే పెట్టుకుందాము పడుకుందామా. కంటికి పండుగా నిదురబోక యెన్నాళ్లయిందో "

"నిజమె నువ్విలా నాదగ్గర పడుకుని కబుర్లు చెప క ఏళ్లు అయినట్టు లేదూ?"

"అందుకే కాసేపు పడుకుందాము " మృదువుగా అతని తల నిమురుతూ,లైటు తీసివేసింది ఈ మార్పు నిజమా తాత్కాలికమా అర్థం కాలేదు మొదట ఇల్లు మారాలి, అనుకుంది

లేస్తూనే, భర్త కవర్లలో పెట్టిన ఉత్తరాలు కనిపించాయి తృప్తిగాచూస్తూ వాటిని విప్పింది మతిపోయిన దానిలా నిల్చుండిపోయింది ఒకటి ముఖ్యమంత్రికి, రెండోది ప్రధానమంత్రికి, అడ్రసు చేసి ఉన్నాయి కొన్ని క్షణాలక్రింద అనుభవించిన ఆనందమంతా ఆవిరిలా ఇగిరిపోయింది

"ముఖ్యమంత్రి గార్కి- శతకోటి నమస్కారాలు! త్రాగానట, కంనీపివారు ఉద్యోగం నుండి తీసివేశారు త్రాగ కూడదనుకున్నవారు కొట్లు యెందుకు వెంటనే మీరు నాకో మాంచి జాబ్ ఇల్లు చూపించాలి. అప్పులబాధలు భరించ లేక ఇల్లు అమ్ముకున్నాను గనక ఇల్లు ఇవ్వాలి ఇది ప్రజల ప్రభుత్వము నేను ప్రజలలో ఒకడినిగా త్వరగాతేల్చాలి.

ఇట్లు
రఘునాధరావు

కూలిపోయే శరీరాన్ని మంచంకోడు ఆసరాగా చేసుకుని నిల్చుంది కంటిలో నీరు యెప్పుడో ఇంకిపోయింది హృదయ స్పందన కూడా ఆగిపోతే ఎంత బాగుండును అనుకుంది బయటికి వెళ్ళి, డాక్టరిగారింటినుండి సుజాతకు ఫోనుచేసి వచ్చేసింది రఘు లేచి దిక్కులు చూస్తున్నాడు

(సశేషం)

Printed and Published by A. Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500001. Controlling Editor "CHAKRAPANI"

